



శ్రీ నారా చంద్రబాబునాయుడు
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వర్యులు



శ్రీ గంటా శ్రీనివాసరావు
రాష్ట్ర మానవ వనరుల
అభివృద్ధి శాఖా మంత్రి

# కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయాల్లో రుతుస్రావ పరిశుభ్రత మీద అవగాహన

* 6-10వ తరగతి దాక ఇంగ్లీషు మీడియం
* ఉచిత విద్య, దుస్తులు, వసతి, భోజనం
* సహజ పథకంలో భాగంగా నెలనెలా ఉచిత శానిటరీ నాప్కిన్లు
* పూర్తిగా మహిళలతో నిర్వహణ
* కంప్యూటర్ విద్య, ప్రొజెక్టర్‌తో పాఠాలు
* కళలు, చేతి వృత్తులు, ఆటలు
* ఆత్మరక్షణ విద్యలో శిక్షణ
* భద్రత, ఆన్‌లైన్ పర్యవేక్షణ
* పోటీ పరీక్షల కోసం ప్రత్యేక శిక్షణ

★ కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయాలు - ఆడపిల్లల పాలిట వరాలు

విద్య మా హక్కు
సర్వశిక్షా అభియాన్ AP
అందరూ చదవాలి అందరూ ఎదగాలి

సర్వశిక్షా అభియాన్.
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

సాహిత్య ప్రస్థానం
ఫిబ్రవరి 2019
సంపుటి : 18 సంపాదకీయం సంచిక : 2

# అంతర్జాలంలో తెలుగు భాష

తెలుగు భాష అంతర్జాలంలో వేగంగా విస్తరిస్తున్న అంశం భాషాభిమానులందరికీ సంతోషం కలిగిస్తుందనడంలో సందేహం లేదు. సాంకేతిక విజ్ఞానాన్ని అందుకుని భాషను అంతర్జాలంలో వికసింపచేయడం ఇటీవల పెరిగింది. అంతర్జాలాన్ని కంప్యూటర్ మొదలుకొని మొబైల్ ఫోన్ వరకూ విరివిగా వాడుతున్నారు. అనివార్యంగా స్థానిక భాషలకు కూడా తన మార్కెట్ కోసం ప్రపంచీకరణ కొంత చోటు కల్పించాల్సి వచ్చింది. అందులో భాగంగానే తెలుగు లిపిని కంప్యూటర్స్‌లో, మొబైల్స్‌లో ఉపయోగించుకోవడానికి వీలుగా వైవిధ్యభరితమైన సాఫ్ట్‌వేర్‌లు వాడుకలోకి వస్తున్నాయి. ఈ పరిణామాలు స్థానిక భాషల ప్రజలకు ఆనందం కలిగిస్తున్నాయి. ఇటీవల దాకా స్థానిక భాషలను ఇంగ్లీషు భాష డామినేట్ చేయడం చూశాం. ఆయా స్థానిక భాషలు ప్రమాదంలో పడుతున్నాయని ఐక్యరాజ్య సమితి అనుబంధ సంస్థ యునెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలు హెచ్చరించాయి కూడా. కానీ ఇటీవల గమనిస్తున్నట్లయితే తెలుగు భాషకు ఊహించని విధంగా అంతర్జాలంలో ఆదరణ పెరుగుతున్నది. ఈమెయిల్స్, ఫేస్‌బుక్ పోస్టింగ్‌లు, వాట్సప్ గ్రూప్స్‌లో ఎక్కడ చూసినా తెలుగు అక్షరాలు కనిపిస్తూ అహ్లాదం కలిగిస్తున్నాయి. ముఖ్యంగా సాహిత్యరంగానికి సంబంధించి తెలుగు వాడకం అంతర్జాలంలో చెప్పుకోతగ్గ స్థాయిలో పెరిగింది. సాహిత్య ప్రస్థానం పత్రికకు వచ్చే రచనల్లో తొంభై శాతం ఈమెయిల్స్ ద్వారానే అందుతున్నాయి. గత రెండు మూడు సంవత్సరాలుగా పోస్టుద్వారా వచ్చే రచనల సంఖ్య బాగా తగ్గింది. అలాగే రచయితలు బ్లాగ్స్‌లో, వెబ్‌సైట్స్‌లో తమ రచనలు ఈఫైల్స్‌గా డిజిటల్ రూపంలో భద్రపరుచుకోవడం పెరిగింది. ఇప్పటికే రచయితలు కంప్యూటర్‌లో, సెల్‌ఫోన్స్‌లో తమ రచనలు టైపు చేసుకోవడం, ఫోన్ ద్వారానే పత్రికలకు, వెబ్ మ్యాగ్‌జైన్‌లకు రచనలు పంపించడం చేస్తున్నారు. నిజానికి ఇంటర్నెట్ సౌకర్యం ఉపయోగించుకోని తెలుగు పత్రికల ప్రచురణను ఊహించలేం. ఇదంతా చాలా వేగంగా జరుగుతున్న పరిణామం. ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు ఈ అంతర్జాలంలో తెలుగుభాష వికాసం గురించి వెంటనే శ్రద్ధ పెట్టవలసిన అవసరం కనిపిస్తుంది. అంతర్జాలంలో తెలుగు వాడుక గురించి అందరికీ సులువుగా ఉండే విధంగా సాంకేతిక పదాలు వంటివి రూపొందించడం చేయాలి. ఎవరికి వారు కొత్తపదాలు చేర్చడం కన్నా ఒక యంత్రాంగం ద్వారా అటువంటివి చేపడితే ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. అలాగే అనువాద పరికరాలు కూడా అందుబాటులోకి వస్తున్నాయి. టైపింగ్ అవసరం లేని రోజులు కూడా వచ్చేసాయి. భాష స్పష్టంగా పలికితే యాప్ ద్వారా అక్షరాలు స్క్రీన్‌పై డిస్‌ప్లే అవుతున్నాయి. ఫిబ్రవరి 21 అంతర్జాతీయ మాతృభాషల దినోత్సవం సందర్భంలో ఈ పరిణామాలను సాంకేతిక అభివృద్ధిలో సాగుతున్న భాషావిప్లవంగా భావించొచ్చు.



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- • 5 సంవత్సరాల చందా రూ.1000/
• 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## కథలు


అలివి వల - ఉదయమిత్ర............................ 5
ఏనుగు అంబారీ - వనజ తాతినేని.................... 28
దేవుణ్ణి చూసినవాడు
- దేవరకొండ బాలగంగాధర్ తిలక్............ 39
అంకురం - అనిల్ ప్రసాద్ లింగం................... 57


## కవితలు


ఒక్క పిడికిలి - గొర్రెడ్డి హరిశ్చంద్రారెడ్డి............... 4
అగదు ఈ నడక - చాగంటి తులసి...................... 12
నానీలు - పాలపర్తి ధనరాజ్.............................. 12
సజల నయనాల సాక్షిగా - దారల విజయకుమారి... 17
కమ్ బ్యాక్ - కెంగార మోహన్........................... 21
అమ్మ కుట్టుమిషను - డా॥ పెంకి విజయకుమార్.... 27
తెల్లపదం - డా॥ సడ్లపల్లె చిదంబరరెడ్డి............... 32
హరిత గాథావింశతి - రామ్‌దాస్ టంగుటూరి....... 32
వంచనా శిల్పం - మార్ని జానకిరామ్ చౌదరి......... 35
చీకట్లో చిగురించిన దేశం
- మల్లారెడ్డి మురళీమోహన్..................... 38
నానీల సేద్యం - సుమనశ్రీ.................................. 38
మళ్ళీ కొత్తగా పుట్టాను - లక్ష్మీ కందిమళ్ళ............. 47
ఆకలి కేకలు - పి.వి.ఎల్. సుజాత......................... 51
కంచెలు దాటుకుంటూ - శ్రీ వశిష్ట సోమేపల్లి......... 56
అవును! ఇది దేవతలు దిగబడ్డ దేశమే
- శ్రీ వశిష్ట సోమేపల్లి................................64


## వ్యాసాలు


వీరేశలింగం ప్రభావం(కందుకూరి శతవర్ధంతి వ్యాసం)
- వకుళాభరణం రామకృష్ణ...........................13
తెలుగు సాహిత్య విమర్శకు కొత్తకోణం 'విమర్శిని'
- విజయ్.................................................. 18
ముందుమాటల్లో రాచముద్ర
- డా॥ పి.సి. వెంకటేశ్వర్లు.......................... 22
భాషా ప్రయుక్త రాష్ట్రోద్యమం - గిడుగు స్ఫూర్తి
- డా॥ అప్పిరెడ్డి హరినాథ రెడ్డి..................... 33
ముప్పై కావ్యాల విలక్షణ పరిచయం
- శ్రీరాం................................................36
గతానికి చేయూత విధ్వంసానికి ఎదురీత
- డా॥ డి. శ్రీనివాసులు............................. 48
పెళ్ళి మంత్రాల్లో సమాజ దర్శనం- సింహాద్రి శిరీష.. 52
స్వీకారం.....................................................61
డైరీ ............................................................65


## కవిత

# ఒక్కపిడికిలి


- గొర్రెడ్డి హరిశ్చంద్రా రెడ్డి
9110595847


సంద్రంలో ఎక్కడో కేంద్రం
చిన్న అలజడి మొదలయింది
అల ఒకటి కదిలింది
ప్రక్కనున్న తన జాతిని మేల్కొలిపింది
అది తన రూపును విస్తరించింది
కడలి కదం తొక్కింది
నీళ్ళలో నిప్పు రాజుకుంది
గగనంలో గాలి తోడయింది
తీరంవైపు తోసుకొస్తుంది
తరంగం తాండవమాడింది
వెల్లువై విరుచుక పడింది
తను సహనం కోల్పోయినప్పుడు
చెలియలికట్టను దాటుతుంది
సర్వం స్వాహా చేస్తుంది
తన గర్భంలో కలుపుకుంటుంది
ఆ సమయంలో ఏదీ
మినహాయింపు కాదు
కొత్త యుగానికి ప్రణాళిక వేస్తుంది
పాతను నిర్ధారిస్తుంది
కొత్తను ఆవిష్కరిస్తుంది



◆




# అలివి వల

ఉదయమిత్ర - 9985203376

"యాడికివోతున్నవవ్వా?" నవ్వుతూ అడిగాడు పసులకాపరి.

"ఏట్లకు.. నీకెందుకురా గాడ్డీ" ముసలవ్వ కోపంతో జవాబిచ్చింది.

పసుల కాపర్లు గలగలమని నవ్వుకున్నారు.. వాళ్లకు ముసలవ్వతో తిట్టించుకోవడం ఓసరదా..

"ఏట్లకా.. అయ్యో.. మరి ఏరుగిక్కడుంటే నువ్వ ్కడవోతున్నవు..?" రెచ్చగొట్టేడు మరో పసులకాపరి.

"అరే భాడుకావ్.. నా ఇష్టమొచ్చిన తాన్కి పోత.. నా ఇష్టమొచ్చినకాడ జస్త.. నువ్వెవడివిర.. నన్నడుగనీకె.. మీ ముండమొయ్య.. నా ఎం॰ వద్దేరేమిర.. మీ ఇంట్ల పీనిగెల్ల" - అంటూ శాపనార్థాలు పెడుతూ.. వాళ్లవైపు దొర్కిన రాయిరప్పను విసరడం మొదలెట్టింది ముసలవ్వ.

పోరలు నవ్వుకుంటూ పోయి చెట్ల చాటుకు దాక్కున్నారు. ముసలవ్వ ఎగపోసుకుంటు తిట్టితిట్టి అలిసిపోయి, అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

"పాపంరా.. పోలీసోల్లు టెంట్ల మీద దాడిజేసిన కాడికెల్లి మనిషిలమనిషి లేదుర.. ఏడిపియ్యొద్దుర అవును పాపం.." కాస్త పెద్దరికంగ మాట్లాడేడొకడు.

"ఔనంటరా.. ఆయాల్లకొడ్కును గూడ శాన శీనగొట్టిర్రంట."

"గదే.. గదే.. గప్పట్నుంచి పిచ్చిపిచ్చిగ జేస్తున్నదట"

"కలోగంజో తిని ఇంట్ల ఉండాల్సిన మనిషి, చెట్లు గుట్టల పొద్ది పిచ్చిదానిలా తిర్గుతున్నది.."

◆◆◆

ముసలమ్మ నడుస్తున్నది.. ఎక్కడికో తనకే తెలీదు.. చేతిలోని ఎండుకట్టెలో బాటపక్కన చెట్లను కోపంతో కొడుతోంది. లోపల్లోపల ఎవరినో తిడుతోంది. మార్గంలో తొండ కనబడితే, రాయివిసిరింది. చెట్టుమీద పిట్టకూస్తే, దానిమీదకీ రాయి విసిరింది.

చింపిరి జుత్తులో, చిరిగిన బట్టల్తో ముసలవ్వ ఎలుకలు కొరికేసిన వలలాగున్నది.

అట్లా నడిచినడిచి, అక్కడే ఉన్న "కిన్నెరబండ" పైకి

చేరింది. కాళ్లు బార్లా చాపుకుని కూచొని, ఒక్కసారి ఆకాశంవైపు శూన్యంగా జూసింది. నదివైపూ, చుట్టూ చెట్లవైపు చూసింది.

"గంగమ్మా.. నీకూ.. మాకూ తీరిపోయింది.. నీకు పూజలు జేసినం.. టెంకాయలు గొట్టినం.. నువ్వే మాదిక్కని నమ్మినం.. మాకిప్పుడు చేపతియ్యకుండైతివి. మా కడుపు మాడుస్తున్నవు. మమ్ములను, మా పిల్లలను పూటొక్కతీరుగ ఏడిపిస్తున్నవు. నేను జెబ్తున్న ఇను. మా కడుపు మాడుస్తున్నందుకు, నువ్వు ఏదో ఒకరోజు ఎండిపోతవు. గీ అడివి కాలపోతది. గీ మనుషులకు గత్తర జుట్టుకుంటుంది. సర్వనాశనమైతది.. నేను చెంచుదాన్ని.. నా సాపెన ఊకెపోదు.. ఊకెపోదు.. ఊకెపోదు.." అని మాట్లాపుతూ మాట్లాడుతూ నిద్రలోకి జారుకుంది.

నదిమీదనుండి చల్లగాలి హాయిగ వీస్తోంది. అది చెట్టకొమ్మల్లో దూరి కొత్తరాగాలు సృష్టిస్తోంది.

ముసలవ్వ మనుమడు గజ్జన్న దృష్టి అంతా గాలం మీదనే ఉంది.. ఎంతకూ బెండు మున్గతలేదు. అర్థగంట నుండి ఒక్క చిన్న చేపగూడ తగుల్తలేదు. "ఏమయ్యింది.. ఈ మధ్యన మనుషుల్లాగే చేపలు గూడ తెలివి మీరిపోయినవా..ఏంది?" అనుకొని గాలాన్ని పైకితీసి, ఇంకాస్త మరుగు ఉన్నచోట గాలం వేశాడు. అక్కడా అదే తంతు. "నదికేదో గత్తర జుట్టుకున్నట్టుంది.. ఒక్క చేప పడ్తలేదు. ఏందో జర్గుతోంది.. ఇంతకుముదు గాలమేస్తే చాలు నిముషాలల్ల చేపలు దొరికేవి.. ఇపుడు అర్థగంట, గంటైనా చేపలు పడ్తలేవు.. లోపల చేపల్ని మందేసి చంపుతున్నరా? లేక ఎవరైనా ఊడ్చుకపోతున్నారా.. ఏందో జర్గుతోంది? " పరిపరివిధాలుగా వాడి ఆలోచనలు సాగుతున్నాయి.

అసలే ఆకలితో ఉన్నాడు.. ఏదైన కంశెపిల్ల దొర్కితే నిప్పుమీద కాల్చి.. ఉప్పుకారం దట్టించి.. రొట్టెమీద తినాలని ఉవ్విళ్లూరిపోతున్నాడు. ఒక్క చేపా దొర్కదే.. కట్టగట్టుకొని వలసబోయినట్టున్నాయి..

"చేపల్ని.. చెంచుల్నుండి ఎవరైనా దూరం జేస్తున్నరా?" – ఎప్పటికీ తెగని గజ్జన్న ప్రశ్న.

దిక్కుల్ని రాపాడుతోంది..

ఇక లాభం లేదని.. ఎక్కడివక్కడలొదిలేసి వాడు తల్లిని జేరుకున్నాడు.

♦♦♦

కృష్ణానది.. శ్రీశైలం బ్యాక్‌వాటర్‌లో నిండు కుండలా ఉంది. అప్పుడే వంటజేసి.. గిన్నెల్ని టెంటులోకి జేర్చి, బయట కొచ్చికూచుంది అంకమ్మ. దూరంగా కనబడ్తోన "కిన్నెర గుండు" వైపు కన్నార్పకుండా జూసి, తృప్తిగా గాలిపీల్చింది.. తమ పెద్దలు అక్కడే నివసించేవారని.. ఎవరో చెప్పగా విన్నది. అప్పట్నుంచి ఆ గుండును జూస్తే, తమ పెద్దలు యాదికొస్తరామెకు.

కిన్నెరగుండు.. నదిమీదకు వొంగినట్లుగా ఉంటది. దాని అడుగుభాగం గుహలాగ ఉండి నివాసయోగ్యంగ ఉంటది. నల్లగా, పెద్దగా ఉండే ఆ గుండును గురించి స్థానికులు ఓ కథ చెబుతుంటూరు.. పూర్వం ఓ గిరిజన అమ్మాయి, ఓ యువకుణ్ణి ప్రేమించిందట. ఎంతసేపటికీ అతడు తన మనసులోని మాట చెప్పకపోయేసరికి, అతనికి తన మీద ప్రేమలేదేమోనని నిరాశ జెంది.. ఆత్మహత్య చేసుకుందట! ఇది తెల్సిన ఓ రుషి, వెంటనే అతడిని శిలగా మారేటట్టు శపించాడట.. ఆమెను నదిగా మారేటట్టు దీవించాడట.

ఇప్పుడు ఆ శిలను ఎవరైనా చూస్తే.. తనను క్షమించమని వొంగి నదిని వేడుకున్నట్టుగా ఉంటది. ఎప్పుడైనా నది ఉధృతి పెరిగినపుడు అది శిలకొక ముద్దునిస్తూ, మనోహరంగా జారిపోతుందట. ఒక్కోసారి.. శిలయై మర్చిపోయేటట్టు నది దాని ఒళ్లంతా తడిమిపోతుందట.

చెప్పొద్దూ! కేవలం ఆ ఒక్క ముద్దుకోసమే.. ఆ చల్లని ఆత్మీయస్పర్శకోసమే దశాబ్దాలుగా ఆ శిల అక్కడ పడున్నదేమోననిపిస్తది. అంకమ్మకు ఆ గుండువైపు ఎన్నిసార్లు జూసినా తనివితీరదు.

♦♦♦

గజ్జన్న నెమ్మదిగా వొచ్చి, తల్లిచేతిని తనచేతిలోకి తీసుకొని, నదివేపు, చెట్లవేపు, భూమీ ఆకాశంవేపూ సాలోచనగా చూశాడు.

"అమ్మా! నేనొకటి అడగనా?" అన్నాడు గజ్జన్న.

12 సం॥ల వయస్సులో,వాని బుర్రనిండా సోక్రటీసు ప్రశ్నలే.

"అడుగు" అంది అంకమ్మ కాస్త జంకుగానే.. ఏమడుగుతాడోననే భయం మరి.

"ఏంలేదూ! ఈ నదిల మనం చేపలు పట్టగూడదా అమ్మా" అమాయకంగా అడిగాడు గజ్జన్న.

"గదేందిర.. గట్లడిగితివి.." – ఆశ్చర్యపోతూ జవాబిచ్చింది అంకమ్మ.

"ఏంలేదూ.. పొద్దున మనోల్లు మాట్లాడుకుంటుంటే నేను ఇన్న.."

"ఏం ఇన్నవుర.."

"ఈ నదిల మనకు చేపలు పట్టే హక్కులేదని ఎవరో రైతులు అన్నరటగద."

"అదేంలేదు.. ఈ నదిమీద హక్కు మనదే. ఈ నదిమనదే. మన తాత ముత్తాతలకాడ్నించి గీనదిలనే చేపలు వట్టెటోల్లు. అగో.. గాడ.. పేద్ద బండగనవడ్తలేదూ? దాన్ని "కిన్నెర గుండు" అంటరు తెల్సుగద.."

"ఔను.. నేను గూడ దానిమీద ఆడుకున్న"

"అగో... గాబండకిందనే మన తాతముత్తాతులు ఉండెటోల్లంట.. నదిల చేపలువట్టుడు.. బండకింద బత్కుడు.. ఇట్లే ఇట్టే నడిచిందట.. అయినా నీకెందుకొచ్చిందిర గీ అనుమానం"

ఏంలేదమ్మా.. గీనదిపారేజాగ.. తమపొలాలకిందికి వొస్తదని.. గీనది అంత తమరైతులదని.. అందుకని మనం చేపలు పట్టేవీల్లేదని.. చుట్టుపక్కల రైతులు కట్టెలు వట్టుకోకి.. కొట్టనీకె వొచ్చిన్రుగది.. గందుకని"

"ఓ...గదా.. అదంతా ఆ కంపెనీవోని పని.. మనం చేపల్ని సొంతంగా అమ్ముకోవాలని.. ఓ సంఘం పెట్టుకోవాలని చూస్తున్నంగదా! గది కంపెనీ వోనికి కడుపుమంట.. అందుకని.. ఉపాయంగ.. గీరైతుల్ని మన మీదికి ఉసిగొల్పిండు భాడుకావు.."

"అయితే గీనది ఎప్పటిదమ్మా.."

"ఎవనికి దెల్సు.. ఎక్కడ పుట్టిందో.. ఎప్పుడు పుట్టిందో.." అంటూ కృష్ణానది వేపుజూసి కళ్ళుమూసుకొని దండం బెట్టింది.." గంగమ్మ మనకు కూడువెట్టేది.. మనం బత్కుతున్నదే.. గీనదిమీద.. నదికీ, చెంచుకీ ఉన్న సంబంధం.. తల్లికీ.. బిడ్డకూ ఉన్న సంబంధమేరా.."

"అంతేనా.."

"అంతేమరి.. రైతులకు తమ పొలంమీద ఎంతహక్కు ఉంటదో.. మనకు గీనది మీద.. అంత హక్కు ఉంటది.. అగో.. గాడలేదూ.. గా కిన్నెరబండ మన తండ్రయితే.. గీ గంగమ్మ మన తల్లి.. తల్లిదండ్రులనిడ్సి మనం యాడికివోతం. ఉన్న గీ ఒక్క ఆదెరువును అందకుండజేసి.. మనల్ని ఎల్లగొట్టజూస్తున్నరు బద్మాష్‌గాళ్లు."

అమ్మా! ఒకేల చేపలు వట్టుడు బందువెడితే మనం ఎట్ల బతుకాలెనే?"

"ఏముందీ? అందరంకట్టగట్టుకొని గంగల దూకాల్సిందే.."

"ఇంకేం ఉపాయం లేదా.. అమ్మా.."

"తెల్వదు.."

◆◆◆

అమరగిరి.. అందమైన పేరు.. దాన్ని నరకకూపంగా మార్చివేశారు అధికారులు.. అసలు అధికారులు చెంచులకు మనష్యుల్లాగా చూడనే చూడరు. ఏ పాటావాళ్లను ఎత్తుకోదు. ఏ గొంతూవాళ్లను పలుకదు. పాలమూరులో కృష్ణానది ఒడ్డున.. ఓ మారుమూలప్రాంతాన.. "శ్మశానంలో వెలి బండలై" బతుకునీడుస్తుంటారు చెంచులు.

ఎవరికీ సెంటు భూమిలేదు. రేషన్‌కార్డుల్లేవు. రైతుబంధు పతకంకింద ఇంటికి 200–300 రూ॥లు ఇచ్చేసి దులిపేసుకున్నారు.. గతంలో బియ్యం 35 కిలోలు ఇచ్చేవాళ్లు. ఇప్పుడు ఆరుకిలోలే ఇస్తున్నారు. ఓట్ల అవసరంగాబట్టి రేషన్‌కార్డులు, వోటరుకార్డులు మాత్రం ఠంచన్‌గా జారీచేస్తారు. బడి ఉందిగాని, దాన్ని ఒంటిపూట బడిగమార్చి వేసారు. మధ్యాహ్నం భోజనం పెట్టేసి, వెళ్లిపోతారు.

ITDA వాల్లు అటువైపు చూసిన పాపానపోలేదు. ఉన్న అరవై కుటుంబాలకు నలభై ఇండ్లు కట్టించి ఇచ్చారు. RDT (Rural Development Trust)వాళ్లు.

చేపలు పట్టడమే చెంచుల జీవనాధారం.

వాళ్లు వారం రోజుల్దాంకా చేపలు పట్టడానికి నదికిపోయి అక్కడే ఉంటారు. జంటలు జంటలుగా వెళ్లి, నది ఒడ్డున టెంట్లు వేసుకుంటారు.. ఆ వారం రోజులు వంటా–వార్పు అక్కడే.

వలలు కంపెనీవాడే ఇస్తాడు. కిలో 500–1000రూ॥ల చొప్పున ఉంటుంది. మిగతా ఖర్చులు బ్రోకర్ చూసుకుంటాడు.. ఇంతా చేసి నెలకు 2000–3000 రూ॥లు మాత్రమేవొస్తది. సంవత్సరాల తరబడి అప్పుదీరదు.

ఒక పుట్టిలో ఒక జంట రాత్రి పూట వలలువేయడాన్కి బయలుదేరుతారు. భార్య తెడ్డువేస్తే, భర్త వలవేస్తాడు.. చిన్న పిల్లలుంటే, భార్య కాళ్లమధ్యన ఇరికించుకుని తెడ్డువేస్తుంది. వర్షం వొచ్చినప్పుడు పరిస్థితి భీభత్సంగా ఉంటుంది. భార్య ఒక వైపు తెడ్డువేస్తూ, ఒకవైపు పిల్లవాడిని సంభాళిస్తూ, మరోవైపు పుట్టిలో చేరిన నీళ్లను తోడిపోయాలి. చీకటి, గాలివాన హెూరు.. నిర్మానుష్య ప్రదేశం.. ఊహించడాన్కి భయం వేస్తది.

ఇదిలా ఉంటే, ఒడ్డున ఉన్నవాళ్ల పరిస్థితి ఏమీ తీసిపోదు. పాములు, తేళ్లురాకుండా టెంటు చుట్టూ ఒక్కోసారి గుంతలు తవ్వుతారు.. చీమలు ఉండనే ఉంటాయి. పైన చీకటి. టెంటులో చీకటి. 8 గంటలకే తిని పడుకోవాలి. చుట్టూ అడవి.. నక్కల ఊళలు. అలల హెూరు.. చెట్ల ఆకుల చప్పుళ్లు తప్ప మరేమీ వినబడదు.

తెచ్చుకున్న మేకలకు రక్షణగా కుక్కల్ని తెచ్చుకుంటారు. అవి మొరుగుతుంటే, వాళ్లకు రక్షణలాగుంటది.

వర్షాకాలమొస్తే.. గాలీవాన సృష్టించే భీభత్సం ఇంతాఅంతాగాదు. టెంట్లు కూలినప్పుడల్లా, తిరిగి వేసుకోవాలి. వంటజేసుకోడాన్కి కట్టెలు దొర్కుడుకష్టం.

నదితో, ప్రకృతితో యుద్ధం.. బతుకు దినదినగండం.

♦♦♦

ఆరోజు ఉదయం ఎనిమిది గంటలు చెంచులందరూ ఒడ్డుమీద నిలబడి బోటు కోసం ఎదురుచూస్తున్నారు. నదిమబ్బువట్టింది. వర్షమొచ్చే సూచనలు కన్పిస్తునాయ్.. ఆవలివైపు గుట్టలు క్రమశిక్షణ గల సైనికుల్లా నిల్చున్నాయ్. దుబ్బుగా పెరిగిన పచ్చని చెట్లలో, నల్లని శిలల్ని గమ్మివేస్తూ.. నలుపు, పచ్చదనం గల్సిన సుందర చిత్ర పటంలా ఉందా దృశ్యం!!

“వొచ్చే.. వొచ్చే” గుంపులోంచి అరిచారెవరో. అల్లంత దూరాన బోటు కనబడింది.. చెంచులందరూ తమతమ చేపల బుట్టల్ని సర్దుకున్నారు. పిల్లలు స్కూలు బస్సుకు ఎదురుజూసినట్లు ఆఫీసువాల్లు కంపెనీ బస్సుకోసం ఎదురుజూసినట్లు, చెంచులు బోటుకోసం ఎదురుజూస్తారు.

బోటు మెల్లిగా ఒడ్డు చేరింది.. అందులోంచి గుమాస్తా సత్యం.. కళ్లజోడు సవరించుకుంటూ.. చేతిలో సెల్‌లో చంకలో పుస్తకంలో దిగాడు. అతనికి సుమారు 50 సం॥లుంటాయి. వెంట ఇద్దరు కూలీలు, తక్కెడ సామానుతో దిగారు.

తూకం మొదలయ్యింది..

“కొర్రమట్టలు ఎన్నికిలోలు?”

“ఐదు కిలోలు”

“మద్దిలేటీ నీకు 450 రూ॥లు”

“రొటలు – ఎన్ని కిలోలు”

“ఆరు కిలోలు”

“ఆ.. లింగసామీ.. నీకు మూడు వందలు”

“అరేయ్..గా బొచ్చెలు.. భిలాషలు.. వాల్లలు జోకుండిలా..”

బిలబిలమని మూగిన చెంచులందరినీ పక్కకుతోసేసి లెక్కలేయడంలో మునిగిపోయాడు.

“కొర్రమట్టలకు జర్ర పైసలెక్కువెయ్యిని సారూ. పైసలకు కష్టంగున్నది” – ధైర్యం జేసి అడిగింది అంకమ్మ.

సత్యం రాసేది ఆపి.. కళ్లద్దాలమీదుగ జూసి, అసలది ప్రశ్నేగాదన్నట్టు తన పనిలో మునిగిపోయాడు.

“సారూ.. నిన్నే అడుగుతున్నం.. జర్రమాదిక్కు గూడ జూడుర్రి. జర్ర చేపలకు పైసలు ఎక్కువెయ్యిర్రి. చీకట్ల పురుగూ బూషి లెక్కజేయకుండ చేపల్ని పట్టుకొస్తం. మీరేమొ ఒక్క పైస ఎక్కువెయ్యరు” నిష్ఠురంగనే అడిగింది అంకమ్మ.

“ఏందమ్మో.. గీనడమ గొంతుపెద్దది జేస్తున్నవ్.. ఏం సంగతి? గీడ నీకు పైసలు ఎక్కువిస్తే.. గాడ.. ఏంది.. గాడ.. నా మొగుడున్నదు.. ఆడు నా జీతంలకెల్లి కోస్తడు.. ఎరికేనా?” కోపంతో అరిచాడు సత్యం.

“తూకం కూడ తక్కువ గొలుస్తరు” ముసలోడు గొణిగిండు.

“మాతాననేమొ అగ్వకు తీసుకుపోతరు. బైట మస్తు లాభానికి అమ్ముకుంటరు. ఎవ్వనికి దెల్వదు?” అరిచారెవరో.

“ఓహెూ.. అంతదాంక వొచ్చిందన్నమాట. అయితే ఇనుర్రి.. గీచావల్ని అమ్మనీకే.. బైటవేమెన్నిక కష్టాలువడ్తున్నమో మీకేం దెల్వదు.. ఆహా.. మీకేం దెల్సు? మీకు బైటి ప్రపంచం తెలిస్తేగద.. అసలు అడివిలోనే బతికేటోల్లయితిరి. అడివినిడ్వరు.. బత్కడం దెల్సుకోరు.”

“గది దెల్వకనే గీడికొస్తిమి. మమ్మల్ని మీరు గిట్ల ఇర్కవెడ్తున్నరు.. ఇది న్యాయం గాదు మీకు”

“న్యాయమో.. అన్యాయమో.. గాదేవుడిట్ల రాసిండు.. గీరాజ్యమిట్ల నడుస్తున్నది. మీ ఇష్టముంటే అమ్మర్రి లేకుంటే లేదు.. ఏమంటరు?’

అందరూ మౌనమైపోయారు.

♦♦♦

తూకం తక్కువేయడం.. రేట్లు కోత పెట్టడం.. చెంచులు గొణుక్కోవడం రోజూ జరిగే వ్యవహారమే. కాకపోతే, బోటు ఎక్కబోతున్న సత్యానికి ఆ రోజెందుకో అనుమానం వొచ్చి వెనక్కి తిరిగాడు.

“మదిలేటీ.. ఇక్కడ్దారా?” అనిపిల్చాడు. వెంటనే వొచ్చాడతను. భుజంమీద చెయ్యేసి.. ఆ మాటా.. ఈమాటా కలుపుతూ..“ఆ.. ఏంలేదూ.. ఎవరో అనంగ విన్న.. మీరంత

సంఘం బెడ్తున్నరంట గద" అన్నాడు మద్దిలేటి. కళ్లలోకి జూస్తూ..

"సంఘమా!" అని నెత్తిగోక్కుని, "అంటే.. ఏందిసారూ?" అని అడిగాడు మద్దిలేటి.

సత్యం.. తనకంతా తెల్సునన్నట్టుగా మద్దిలేటి వైపు జూసి, "ఇగో.. గీనఖ్రాల్ నాకు నచ్చవు. సాఫ్‌సాఫ్ జెప్పున్రి. మీరు సంఘం బెడ్తున్నట్టు అంతట తెల్సిపోయింది. గాదోమల పెంట.. సోమశిల.. మంచాలకట్ట.. చిన్నంబావి చెంచులంతా ఒక్కటై సంఘం బెడ్తున్నరంట. ఏం పీకుతుర్రా మీరంత సంఘం బెట్టుకోని" – రెట్టించి అడిగాడు సత్యం.

"అమ్మతోడు.. మీరు జెప్పితేనే తెలుస్తున్నది సార్.. నాకైతే ఏమీ తెల్వదు" అన్నాడు కళ్లు గిరగిర తిప్పుతూ.

"సరే.. సరే.. మీఇష్టం.. మీకత.. అయితే ఒక్కటి జెప్పుత. సంఘం బెడితే మాత్రం సంకనాకిపోతరు. కంపెనీలకు సంఘాలకు పడవు. మా కంపెనీలముందు సంఘాలు నిలువవు. కోర్టులు, చట్టాలు, ఆఫీసులు.. లీడర్లు.. సర్కారు.. అందరూ అన్నీ మా దిక్కే ఉంటాయి. మీరేం పీకలేరు. మంచిగ జెబ్తున్న ఇనున్రి. దొరికే జీవగంజిల మట్టి బెడ్డలేసుకోకున్రి. అన్నీ మేం జూసుకుంటం. మునుపటిలాగనే.. మంచిగుండున్రి.. సంఘాల్ గింగాల్ మర్చిపోండ్రి. "గీతా సారం బోధించాడు.

మద్దిలేటి మౌనం.. ఏదో గొణిగినట్టే గొణిగాడు గాని, దీని సారం మాత్రం సత్యానికి బోధపడింది. "చూడున్రి.. మీరు సంఘం బెడితే.. కంపెనీ నుంచి వలలు రావు. మీ చేపలు బైట ఎవడూ కొనడు. అప్పుదొర్కదు. మందలు దొర్కవు. అన్నీ బందయితయి. ఒడ్డునవడ్డ చేపలైతరు. తర్వాత మీ ఇష్టం. "హెచ్చరికలాంటి సలహా ఇస్తూ, బోటెక్కబోయాడు.

మద్దిలేటి బోటుదాంక నడువలేదు. ఉన్నచోటే నిలబడి పోయాడు. "మేం సంఘం బెడితే.. ఈల్లకేం కడుపునొప్పో తెలువదు.' కాస్తగట్టిగానే అన్నాడు మద్దిలేటి.

అది సత్యంకు వినపడ్డదో లేదోగాని ఒక్కసారి సాలోచనగా మద్దిలేటివైపూ, నదివైపూ జూసి.. బోటును పోనిమ్మన్నాడు.

♦♦♦

ఏం జరిగిందో తెల్వదుగాని.. రెండ్రోజుల తర్వాత పోలీసులొచ్చి చెంచుల టెంట్ల మీద విరుచుకుపడ్డారు. ఎక్కడి అక్కడే పీకిపడేశారు. మొత్తం వొండుకున్నదంతా నేలపాలుజేశేశారు. అందరూ బిక్కుబిక్కుమని చూస్తుంటే.. గిన్నెలు, చెంబులు, సర్వలు చిందరవందరజేశేశారు. పచ్చని వాతావరణంలో కూలిపోయిన టెంట్లు కాళ్లు విరిగిన దూడల్లాగ పడిఉన్నాయ్. ఎవరికీ నోటమాట పెగలడంలేదు. ఎందుకొచ్చిన్రో.. ఏంచేస్తున్నారో తెలిసేలోపు ఓ పెద్ద విధ్వంస దృశ్యం.. కళ్లముందు రూపుగట్టింది..

''ఏమయ్యిందిసారూ.. మాటెంట్లన్నీ గట్ల పీకేస్తున్నరు" ఎట్టకేలకు గొంతుపెగుల్చుకుని అడిగాడు బ్రహ్మం.

హెడ్‌కానిస్టేబుల్ ఏ జవాబు ఇవ్వలేదు. వాళ్లు తమ పనిలో తాము నిమగ్నమయి ఉన్నారు.

"సారూ.. మీకు పున్యముంటుంది.. ఇదంత ఏంది సారు.. మాకు టెంట్లనెందుకు పీకేస్తున్నరు" అన్నాడు మరో చెంచు ఈశ్వరయ్యా..

హెడ్డు వాళ్లవైపు కుక్కల్ని జూసినట్టు జూశాడు.

"మీకు జవాబులు గావాల్నారా.. మిమ్ముల్ను ఈడ చేపలు పట్టొద్దని చెప్పినంగద. చెప్పినంకగూడ.. చేపలు వడ్తున్నరంటే మిడ్సరం ఎక్కువయ్యిందన్నమాటే గద" – హూంకరించాడు హెడ్డు.

"మాకున్నదే గిదొక్క బత్కుదెరువు – మమ్ముల చేపలు వట్టొద్దంటే మేమెక్కడ వోవాలెసారు.. మీరు చెప్పున్రి".. వేడుకోలుగ అంది ముసలమ్మ.

"ఏడికి వోవాలని మమ్ములను అడ్గుతరేంది? ఏట్లకువోండ్రి.."

"అయితే మేం చెంచులం బతుకొద్దాసారు."

"గదంతా మాకు దెల్వద్.. గీనది ఎవరిది? కంపెనీవోనిది.. మీరు చేపలు పట్టేది లేదు. అయినా మీకేమన్నా పట్టారాసినా.. సర్కారేమన్నా భూమికాయిదాలు రాసినట్టు నది కాయిదాలు రాసిచ్చిందా?"

"గట్లయితే .. గీనది వాల్లదేనని కంపెనీవోని దగ్గర పట్టా కాయితాలున్నయా? అయినా సారూ.. మీరు సదూకున్నోల్లు.. నాకు దెల్వక అడ్గుత.. గీనదిని ఆయన గుత్తకుకొన్నడా? ఆయన పుట్టించిండా? ఆయన చెబితేనే నదిపారుతున్నదా?"

గట్టిగానే అడిగాడు మద్దిలేటి.

"ఏందిబే.. భాదుకావ్.. ఖానూన్ మాట్లాడుతున్నవ్" హెడ్డు మద్దిలేటి కడుపులో గుద్దాడు. "మేం మాకు జవాబు చెప్పాల్నాబే. సాలే.. భాంచోత్" అంటూ కింద పడేసి బూటు కాళ్లతో తన్నడం మొదలెట్టాడు. పోలీసులు జతకలిశారు..

ఛాతీమీద విపరీతంగా తన్నేసరికి మద్దిలేటి తీవ్రంగా రక్తం గక్కుకున్నాడు. అప్పట్నుంచే ముసలమ్మ మతిచలించిందని అందరూ అంటుంటారు.

చెంచులు చట్టాన్ని అతిక్రమించి.. చేపలు పడ్తున్నారనే అభియోగం మోపి.. జైల్లో తోశేశారు..

♦♦♦

భారతరాజ్యాంగంలో గిరిజనుల రక్షణకోసం అనేక చట్టాలను తెలువనివ్వరు.

పొందుపరిచారని చెంచులకు సరిగా తెల్వదు. తెల్సినా అవి అమలుకావడం లేదన్నది.. చెంచులను చూస్తేనే తెల్పిపోతుంది.

"అటవీ హక్కుల గుర్తింపు చట్టం – 2006" ప్రకారం గిరిజనులకు నివాసపు హక్కు, చేపలు పట్టే హక్కు సాంప్రదాయిక అటవీ సంపదపై హక్కు, ఇట్లాంటివే ముఖ్యమైనవి ఎనిమిది ఉన్నాయి. వీటికి జతగా మరో పది హక్కులు పొందపర్చబడి ఉన్నాయి. అయితేనేం? చట్టం దారి చట్టానిది. అధికారులదారి అధికారులది.

ఉన్న జీవితంలో తృప్తి పడలేకా.. హక్కుల్ని గట్టిగ అడగలేకా.. చట్టాలు అమలుకాకా.. చెంచులిప్పుడు త్రిశంకు స్వర్గంలో ఉన్నారు.

♦♦♦

ఇదిలా ఉండగా, చెంచుల జీవితాల్లోకి పెనుతుపాను వొచ్చేసింది. కంపెనీ యజమాని కృష్ణంరాజు, ఓ కొత్తవలను దీసుకొచ్చాడు. అదే "అలివివల"

ఆ పేరు విన్నప్పుడు అదికూడా ఒక వల అనుకున్నారు గాని, అది పనిజేయడం మొదలెట్టాక చెంచులు బెంబేలెత్తిపోయారు. నోటమాట రాలేదు. లోలోపలపేగుల తడారిపోయింది. నిజానికి అలివివల కాదు, చెంచులకది రాకాసి వల. తమ బతుకుదెరువును సొంతంగ మింగడానికొచ్చిన కొండచిలువ.

చెంచులు చిన్న చిన్న ప్రాంతాలలో చిన్న చిన్న వలలో చేప బడితే, అది నోరు దెర్చిందంటే చాలు, దాదాపు రెండు కిలో మీటర్ల దాంకా విస్తరిస్తది. ఆ రెండు కిలో మీటర్ల మేరకు మొత్తం మత్స్య సంపద ఇది చేపల్ని గాక, మనుషుల్ని ఊడ్చేస్తున్నట్టు ఉంటది.

నంతా జాడు కట్టలాగ ఊడ్చేస్తుంది. చిన్న చిన్న గ్రంథాలలో ప్రత్యేకంగా డిజైన్ చేసి దాన్ని ఈ ప్రాంతానికి తీసుకొచ్చారు. ఒక్క అలివివల పది చెంచుల వలలో సమానమన్నమాట.

చెంచులు చిన్న చేపల విషయంలో చాలా మానవత్వంతో ఉంటారు.. అసలు వాళ్లవలనే పెద్ద చేపలకోసం డిజైన్ చేయబడ్డవి.. ఒకవేళ పొరపాటున చిన్న చేపలు వలకు జిక్కితే, వెంటనే వాళ్లు వాటిని నీళ్లలో వొదిలేస్తారు. ఇదొక మానవీయకోణం. "ఎందుకట్లా నీళ్లలో విడిచిపెడ్తారు?" అంటే నవ్వి.. "అవికూడా బతకాలె గదా!" అంటారు. ఫిలసాఫికల్గా.. మరోవైపు కంపెనీవోడు అచ్చం బంధిపోటులా వ్యవహరిస్తాడు. అలివివలలో ఊడ్చుకొచ్చిన చేపల్ని గ్రేడింగ్ జేసేటప్పుడు.. వలకు చిక్కిన చిన్న చిన్న చేపలు రెండు నిముషాల్లో చచ్చిపోతాయి. వాటిని కుప్పలుకుప్పలుగా తీసుకెళ్లి అడవిలో పారబోస్తారు. ఫలితంగా అవికుల్లి, అమరగిరి చుట్టూ దుర్గంధం వ్యాపిస్తుంది.

చెంచులొకవైపు మత్స్య సంపద పెరగాలని కోరుకుంటే, కంపెనీవోడు దాన్ని పూర్తిగా ఊడ్చివేయాలని చూస్తాడు. బంధిపోట్లు చేసేదేమిటి? ఒక ఇల్లు దోచినాంక అక్కడే ఉండరు గదా! మరో ఇల్లు దోచడాన్కి పోతారు.. కంపెనీవోడూ అంతే.. యంత్రానికి కార్మికుడి రక్తమాంసాలతో, భావోద్వేగాలతో ఏంపని? తనపని తనుజేస్తది.

అలివివల వొచ్చినాంక నదికి గత్తరజుట్టుకున్నది. ఒకసారి వల వేస్తే నదిలోంచి మూడు నాల్గు టన్నుల మత్స్య సంపద ఖాళీ అవుతుంది. కంపెనీవోని జేబులో కొన్ని లక్షలు జమ అవుతాయి. గతంలో ఒక ట్రాక్టరులో చేపలు దీసుకపోతే, ఇప్పుడు ఒక్కసారికే కొన్ని ట్రాక్టర్లుతో వొస్తాడు..

అలివివల వేయడాన్కి ప్రత్యేకమైన మనుషుల్ని కొవ్వూరు, రాజమండ్రి, విశాఖపట్నం నుండి తీసుకువొస్తారు. వాళ్లకు ఏ ప్రాంతంలో ఎంత చేప ఉండేది. ఎట్లా ఊడ్చేది బాగా తెల్సు..

గతంలో కొందరు అధికారులను, ప్రజా ప్రతినిధులను తీసుకువొచ్చి, అలివివల ఘోరాలను చూయిస్తే, "బైటికి పోయి మాట్లాడుకుందా" అన్నారు గాని, తర్వాత పత్తాలేరు.

చెంచులమీద ముప్పేట దాడి మొదలయ్యింది.. ఓ వైపు రైతులమంటూ దళారీలు, మరోవైపు పోలీసులు, ఇంకోవైపు రాకాసి వల. కాళ్లకింద భూమి కరిగిపోతోంది. కప్పుకున్న ఆకాశం చిట్లిపోతోంది.

♦♦♦

చెంచులు చాలానే చూశారు. ఎండల్ని జూశారు.

వానల్ని జూశారు. పాముల్ని జూశారు. తేళ్లను జూశారు. ఎలుగుబంట్లను జూశారు. కటువుల్ని జూశారు. వరదల్ని జూశారు. కాని ఇది కొత్త.. పరిచయం లేనిది.. మొత్తంగా జీవితాన్నే మింగేసే ప్రళయం.

గాలి వానకు మినుకు మినుకుమనే దీపాల్లా ఉన్నారు వాళ్లు.

♦♦♦

ఆ రోజు రాత్రి అమరగిరి కంటికి కునుకులేదు. మరునటిరోజు అలివివలను తెస్తున్నారని చేవలు పట్టబోతున్నారని ఊరంతా గుప్పుమంది.

వాళ్లు క్రూరమృగాల మధ్య, ప్రకృతి వైపరీత్యాలమధ్యా హాయిగా నిద్రపోయారు గాని, ఈ మాయదారివల జ్ఞాపకమొస్తే, కంటికి నిద్రపట్టదు. ప్రపంచానికి తెల్లారింది. అమరగిరికి మాత్రం తెల్లారిందని చెప్పలేం.

ఆ ఊళ్లో అందరికన్నాముందు దిగ్గునలేచింది గజ్జన్న. వాడు తెల్లారకముందే అందరి ఇండ్లు చుట్టియిచ్చాడు. ఆ రోజు వాడి బుర్ర విమాన వేగంలో పనిజేస్తోంది.

♦♦♦

కంపెనీ ట్రాక్టర్లను అమరగిరికి దగ్గర్లో ఆపి ఉంచి, డ్రైవర్లు, కూలీలు ఒక్కొక్కడుగా కిందికి దిగారు.

ఎదురుగ్గా రోడ్డుకు అడ్డంగా.. వంకర టింకర సాములాగ రాళ్ళను పేర్చి ఉన్నారు. కనుచూపు మేర ఎవరూలేరు.

"ఎవడ్రా బద్మాష్‌గాడు.. ఈ రాళ్లను పేర్చింది?" అంటూ గట్టిగా అరిచాడో డ్రైవరు.. ఉలుకూ పలుకూ లేదు. చెట్టు మొదట్లోని ఉడుత.. గబగబా పైకెక్కి.. భయంగా కిందికి తొంగి చూసింది.

"అరేయ్.. ఈరాల్లను పక్కకు పడేయండ్రా.." కూలోల్లకు ఆజ్ఞాపించాడతను.

కూలోల్లు అట్లా వొంగి పని మొదలెట్టారో లేదో. ఎక్కడ్నుంచి వొచ్చారో.. ఏమో.. ఉసిల్ల పుట్టల్లా పిల్లలు కదలివొచ్చారు. ట్రాక్టర్ ముందు సైన్యంలా నిలబడ్డారు.

వాల్లంతా ముప్పయి, నలభై మంది దాంక ఉంటారు. గోలగోలగ అరుస్తున్నారు.. తిడ్తున్నారు.. నవ్వుతున్నారు.. కొందరు నగ్నంగా ఉన్నారు. కొందరు నిక్కర్లలో ఉన్నారు. ఆడపిల్లలు తైల సంస్కారంలేని పిల్లలు, జడలు తోకల్లాగ వేలాడుతుంటే, చేతులు తిప్పుతూ.. ఏదేదో మాట్లాడేస్తున్నారు.

విద్యాగంధంలేని పిల్లలు ఆకలికి నకనకలాడే పిల్లలు.. ఎడారిలో శిథిల శిల్పాలు.. పురుగు తొల్చిన పుష్పాలు.. నాగరీకుల నిర్వచనాలకు, కవుల కవిత్వాలకు, పాలకుల పథకాలకు అందని అనాగరిక పిల్లలు.. ఇక్కడ ట్రాక్టర్‌ను దిగ్బంధనం జేసి పడేశారు.

వాళ్లు పిల్లల్లా లేరు..

పిడుగుల్లా ఉన్నారు..

బురదమట్టిలోంచి తొల్చుకొచ్చిన కొత్త మొలకల్లా గున్నారు.

అందరికన్నా ముందు భాగాన నిల్చున్నాడు గజ్జన్న.. తొలుత తల్లికి ప్రశ్నవేసి జవాబుగ తానే నిల్చున్నాడు.

అల్లంత దూరాన.. ఆడవాళ్లు బండలమాటున, చెట్ల చాటున సిద్ధంగా ఉన్నారు.

డ్రైవరు.. కూలీలు మొదట ఈ కొత్త వాతావరణాన్ని జీర్ణించుకునే ప్రయత్నం జేశారు.. వాళ్లు నయానాభయానా చెప్పి చూశారు.. ఒక్కడుంటే ఒక్కడు.. అంగుళమంటే అంగుళం కదిలితే ఒట్టు..

"ఏం కావాలెరా మీకు?' అసహనంగా అడిగాడు డ్రైవర్.

''మీరు పోవాలె..'' గజ్జన్న గొంతుకీచుమంది

"పోవాలె.. పోవాలె.."

"గీనది మాదే"

"అలివివలలొద్దు"

అరుపుల్తో.. కేకల్తో వాతావరణం మార్మోగిపోయింది..

♦♦♦

వాళ్లు ట్రాక్టర్ కదలకుండా అడ్డం పడుకున్నారు. కొందరు కూచుండిపోయారు. కొందరునిలబడి ఏదేదో మాట్లాడేస్తున్నారు. గందరగోళంగా ఉన్నా.. అందులో ఒక పద్ధతి కనబడ్తోంది.

డ్రైవరుకూ, సిబ్బందికీ.. ఏమీ తోచడం లేదు. గాలి రయ్‌మని వీస్తున్నా వాళ్లకు చెమటలు పడ్తున్నాయి.. ముందుకు అడుగేస్తే ఏం ప్రమాదం ముంచుకొస్తుందో?

భయాల్ని జయించిన పిల్లలు.. కళ్లముందు దివిటీలై వెల్గిపోతోంటే.. వాళ్లు నిశ్చేష్టులై ఉండిపోయారు.. ఎప్పుడూ అనుభవంలోకి రాని ఓ కొత్త వాతావరణం.

తలల మీదుగ ఎగురుతోన్న పక్షి కొత్త సందేశాన్ని మోసుకు గగన తలానికెగిసింది. ♦

# ఆగదు ఈ నడక

- చాగంటి తులసి



నడవండ్రా నడవండి
నేను నడుస్తున్నాను
మీరూ నడవండి
బిరబిర చకచక
ఈ చేతుల వూపు
పూనకపు వూపు
కాదిది కవాతు

సాగుతూనే ఉంది నడక
దూరమవుతూనే ఉంది
చేరవలసిన చోటు

అవును, ఇప్పుడు
ఈనడక కుంటినడక
నావెనక నడిచే మీ నడక
అలిసిన ఆపసోపాల నడక
అడుగు సాగని నడక
అయినా నడక నడకే
ఆగదు ఈ నడక
మనకాళ్లు చచ్చుబడినా
మనం పడిపోయినా
ఆగదు ఈ నడక

మనకలలు కల్లలు కావు
పుంజుకున్న, జోరందుకున్న
తరతరాల అడుగులు
పెడతాయేమో పరుగులు
అదే వాడి గుండె దడదడ

వేస్తున్నాడు మనకాళ్లకు
మండీలు
లాగుతున్నాడు వెనక్కి
పరుగులు పెట్టే అడుగులకి
పెడుతున్నాడు అడ్డులు

పడుతూ లేస్తూ నడక నేర్చిన పిల్లలు
పెడతారు పరుగులు
వస్తున్నారు మన వెన్ను వెనక
వాడి అంతు చూస్తుంది ఈ నడక
ఆగదు ఈ నడక

# నానీలు

- పాలపర్తి ధనరాజ్
9550593901



మెతుకులు
కలిస్తేనే అన్నం
మనసులు
కలిస్తేనే అనుబంధం!

నిను వీడని
నీడను నేనే
పరీక్షల తర్వాత
ఫలితాలు!

వయసు
మళ్ళిందనడాన్ని
సూచించే మాట
'మా రోజుల్లో'!

ప్రతి ఇద్దరి
సంభాషణలో
ముఖ్యపాత్రధారి
మూడోవాడు!

క్షణికావేశ
ఆత్మహత్యలకు
ప్రతినిధులు
టీనేజర్లు!

అందమైన
అనుభవం
నువ్వు తిన్నావా
భర్త భార్యనడగడం!

భలేమంచి రోజు
పసందైన రోజు
జీతాలందుకున్న
రోజు!

వాహన ప్రయాణంలో
ఎవరికీ
నచ్చని వాడు
బ్రేక్ ఇన్స్పెక్టరు!

అంబరాన్నంటే
విగ్రహ ప్రతిష్ట
నేటి భక్తి విశ్వాసాల
ప్రామాణికం!

ఉన్నంతలో
దానం
ఉదారత్వానికి
కొలమానం!

ఎందెందు చూసినా
అందందే గలదు
బెంగళూరు
అయ్యంగార్ బేకరీ!



కందుకూరి వీరేశలింగం
(16.04.1848 -27.5.1919)

# వీరేశలింగం ప్రభావం

- వకుళాభరణం రామకృష్ణ

**19**వ శతాబ్దంలో, వలసవాదపు పెత్తనం విధించిన నిర్బంధాలు వుండినప్పటికీ, ఆంధ్రదేశపు సమాజం పునరుజ్జీవన ప్రక్రియకు లోనైంది. భారతదేశంలో సార్వత్రిక సామాజిక ఘటనలో భాగమైన ఆ ప్రక్రియ అంతవరకు అమలులో వుండిన సాంఘిక విలువలలోనూ, ఆచారాలలోనూ కొన్ని మార్పులకూ, ఆధునిక భావాల వ్యాప్తికి దారి తీసింది. యిది కేవలం సంస్కృతి భావజాలాలలోనూ, సంస్థలోనూ బ్రిటిష్ వాళ్ళు ప్రవేశపెట్టిన మార్పుల ఫలితం కాదు. హేతువాదంతోనూ, శాస్త్ర విజ్ఞానవాదంతోనూ కూడిన పాశ్చాత్య భావాల ద్వారా విద్యావంతుల వర్గం పొందిన విజ్ఞాన ప్రబోధం యొక్క తక్షణ ఫలితమూ కాదు. సమాజంలో దీర్ఘకాలంగా వుండిన అసమ్మతి ఆక్షేపణల సంప్రదాయం కూడా దీనికి తోడ్పడింది. వీరశైవమనబడే మత, సాంఘిక సంక్షోభం నాటి నుండి కాకపోయినా, వేమన నాటి నుండి యీ సంప్రదాయం వుండినట్లు చెప్పవచ్చు. యీనాటి తమిళనాడు సరిహద్దులను దాటి వ్యాపించిన వీరశైవమూ శ్రీవైష్ణవమూ కులపట్టునూ, కట్టుబాట్లనూ, వైదిక మతకర్మలనూ వ్యతిరేకించాయి. వీరశైవం జంగమ, శెట్టి బలిజ. ఆరాధ్య బ్రాహ్మణలాంటి కొత్తకులాల పుట్టుకకూ శ్రీవైష్ణవం సాతాని, దాసరిలాంటి కొత్త కులాల పుట్టుకకూ దారితీశాయి. హిందువులూ ముస్లింలూ కలియడం ద్వారా దూదేకుల (లేదా పింజారి) అనే కులం పుట్టింది. వేమనా అలాగే అంత ప్రసిద్ధులు కాని గుంటూరు జిల్లా నాసరయ్యా, కడప జిల్లా పోతులూరి వీరబ్రహ్మం లాంటి మత శాఖల నాయకులూ సాంఘిక, మత జీవితంలోని దురాచారాలను ఖండించారు. బ్రిటిష్ రాజ్యస్థాపనకు ముందు శతాబ్దాలుగా సమాజంలో సజీవంగా వుండిన యీ శైశవ సంచలనాల నుండీ, మతపు ముసుగులోని సామాజిక ఆక్షేపణల నుండీ పంథొమ్మిదవ శతాబ్దపు సంఘ సంస్కరణోద్యమాలు ఉత్తేజం పొందాయి.

ఆంధ్రదేశంలోని సంస్కరణల కృషికి కందుకూరి వీరేశలింగం ప్రారంభించిన ఉద్యమాలు బాగా ప్రాతినిధ్యం వహిస్తాయి. ఆయన ఆనాటి సామాజిక పరిస్థితుల చేతా, బెంగాల్‌లోని బ్రహ్మ సమాజ ఉద్యమంచేతా ప్రభావితుడైనాడు. 19వ శతాబ్దపు యితర సంస్కర్తలలాగే ఆయన శాస్త్ర విజ్ఞానపు వ్యాప్తిపట్లా, హేతువాదపు వృద్ధిపట్లా గాఢమైన ఆసక్తి కనబరచాడు. ఆయన గొప్ప రచయిత అయినందువల్ల. ప్రజలలో సంస్కరణ భావాల వ్యాప్తి కొరకు సాహిత్యాన్ని ఉపయోగించుకున్నాడు. ఆయన జనసామాన్యంలో విద్యావ్యాప్తి జరగాలని వాదించి, కేవలం సాహిత్య విద్యను వ్యతిరేకించాడు. ప్రజల మనస్సులను సంప్రదాయపు సంకెళ్ళ నుండి విముక్తి చేసి, సంస్కరణాభిముఖంగా తీర్చి, సమాజంలో పునరుజ్జీవనాన్ని కలిగించే విద్యా వ్యవస్థ కావాలని ఆయన

కోరాడు. రాజకీయాలలో మితవాది అయినందున ఆయన బ్రిటిష్ పాలన యొక్క సద్గుణాలను ప్రశంసించి, ఆ విధంగా, బ్రిటిష్ పరిపాలన మూలంగా భారతదేశపు సమాజం రూపాంతరం చెందుతుందని నమ్మిన 19వ శతాబ్దపు యితర సంస్కర్తలలాగే బూటకపు చైతన్యానికి లోబడిపోయినాడు. అయినప్పటికీ ఆయన యధాస్థితి కొనసాగాలని కోరలేదు. ఆయన సర్వాంగ పురోగతి సిద్ధాంతాన్ని నమ్మి, భారతదేశంలోని ఆనాటి పరిస్థితులలో సంఘ సంస్కరణ తక్షణ కర్తవ్యమని పోరాడాడు.

వీరేశలింగం కేవలం బోధకుడు గానీ, సిద్ధాంతకారుడు గానీ కాదు. ఆయన కార్యవాదపు సంస్కర్త. ఆయన దృష్టిలో భావాలు అనేవే లక్ష్యాలు కావు. వాటి విలువ ఆచరణ రంగంలో పరీక్షింపబడాలి. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆయన భావాలు ఆయన ప్రారంభించిన ఉద్యమాలచేత సంపన్నమైనాయి. ఆయన ఉద్యమాల అనుభవాల నుండి ఆయన భావాలు తమ పోషక పదార్థం పొందాయి. ఆచరణలో పొందిన అనుభవం దృష్ట్యా అవసరమైతే ఆయన తన భావాలను మార్చుకునేవాడు కూడా. సంస్కరణ భావాలను ముందు తీసుకుపోవడంలో సమాజంలో ఒక ముఖ్యమైన భాగంగా యువకుల మీద ఆయన వుంచిన విశ్వాసం ఆచంచలమైనది. ఆయన ప్రారంభించిన సంస్కరణల చర్యల విజయానికి ఆయన స్వస్థలమైన రాజమండ్రిలోని విద్యార్థులు అందించిన అపారమైన సహకారాన్ని బట్టి చూస్తే, వాళ్ళమీద ఆయన వుంచిన విశ్వాసం నిరాధారమైనది కాదని తెలుస్తుంది. సంప్రదాయ బంధితమై, సంఘసంస్కరణ విషయాలలో యెలాంటి మార్పునైనా వ్యతిరేకించే సమాజంలో, ఆదర్శవాదమూ, యవ్వనమూ, కొత్త భావాలపట్ల స్పందనశీలతా గల విద్యార్థులు నిజమైన ఆశాజ్యోతులుగా వుండినారు. యీ విషయంలో వీరేశలింగం దూరదృష్టి గల నాయకుడుగా కనిపించాడు.

సంఘ సంస్కరణ ప్రయత్నాల ప్రధాన లక్ష్యం స్త్రీల ఉద్ధరణ. జనాభాలో సగం మందిగావుండే స్త్రీల స్థాయి మెరుగైతే తప్ప సమాజంలో చెప్పుకోదగిన ప్రగతి యేదీ జరగజాలదనే భావం సర్వత్రా వుండింది. మానవ కారుణ్యం ముఖ్యమైన అంశమే అయినప్పటికీ, సంస్కరణకు అదొక్కటే చోధక శక్తి కాదు. సంస్కర్తల దృష్టి స్పష్టంగా సామాజిక రూపాంతరీకరణ మీదా, ప్రగతి మీదా కేంద్రీకరింపబడింది. అయితే వాళ్ళ కృషికి లభించిన ఫలితం పరిమితమైనది. బాలికల విద్యకూ, బాల్య వివాహాలకూ, వితంతు వివాహాలకూ చెందిన రంగంలో – అనగా సంస్కరణ కార్య కలాపాల ప్రధాన రంగంలో – యీ మాట నిజం. సంస్కర్తలు ప్రభుత్వ విధానాన్ని ప్రభావితం చేయలేక, వ్యక్తిగత కృషిద్వారా యీ సంస్కరణలు సాధించడానికి ప్రయత్నించారు. బాలికల పాఠశాలలు ప్రారంభించబడ్డాయి. వితంతు వివాహాలు జరపబడ్డాయి. పతితయువతీ రక్షణశాలలు ప్రారంభించబడ్డాయి. బాలికలకు సంగీతమూ, నృత్యమూ నేర్పే విద్యాసంస్థలు స్థాపించడం జరిగింది. అయితే యీ ప్రయత్నాలు దృష్టిని యీ సమస్యల మీద కేంద్రీకరించేటట్లు మాత్రమే చేశాయి గాని, సమస్యలను నిజంగా పరిష్కరించలేదు. వాస్తవంగా యెంత సాధింపబడింది అనేదాన్ని బట్టి వీటి విజయాన్ని కొలవకూడదు. సాంఘిక దురాచారాల హానికర ఫలితాలను గుర్తించేటట్లు సాంఘిక వాతావరణాన్ని సృష్టించడంలో యివి చేసిన సేవ మరింత ముఖ్యమైనది. యీ విషయంలో వీటి విజయం చాలా గొప్పది. సంస్కర్తలు ఉపన్యాసాల ద్వారా, మహాసభలు ద్వారా, పత్రికల ద్వారా ప్రజలలో విజ్ఞాన ప్రబోధాన్ని, వ్యాప్తి చేయడానికి ప్రయత్నించారు. మానవ గౌరవాన్ని హీనపరచే సంప్రదాయాలకూ, ఆచారాలకూ, వ్యతిరేకమైన చైతన్యం సమాజంలో పెరగడానికి యిది తోడ్పడింది. సంస్కర్తలు లేవనెత్తిన సమస్యలలో అనేకం తరువాతి కాలంలో జాతీయోద్యమంలో భాగమైనాయి.

ఆంధ్ర సంస్కర్తలు గుర్తించిన వాటిలో ముఖ్యమైనది ఒకటి యేమిటంటే భారతదేశంలో సాంఘిక సమస్యకూ మత సమస్యకూ మధ్య గల సంబంధం. అందువల్ల సంఘ సంస్కరణలు ఫలవంతంగా వుండాలంటే, వాటి మత పరిధులను కూడా లెక్కలోకి తీసుకోవాలి. మత సంస్కరణలకు మూలంగా వుండింది యీ దృక్పథమే. మరొక విధంగా చెప్పాలంటే, మత సంస్కరణలు కేవలం మత సంస్కరణలు కాదు, వాటిలో ముఖ్యమైన సాంఘిక సమస్యలు కూడా యిమిడి వున్నాయి. విగ్రహారాధనకూ, బహు దేవతారాధనకూ, అనేక యితర మత కర్మలకూ వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాలు యీ వాదాన్ని రుజువు చేస్తాయి. బ్రహ్మ సమాజ రూపంలో ఆంధ్రదేశంలో జరిగిన మత సంస్కరణ బెంగాల్ బ్రహ్మ సమాజ ఉద్యమానికి దాదాపు ఒక శాఖే. ఆంధ్ర సమాజపు కార్యకలాపాలు కూడా బెంగాల్ సమాజపు అడుగు జాడల్లోనే

వుండినాయి. అయినప్పటికీ, తమ పాత పరిసరాల నుండి పెకలించివేయబడి, కొత్త వ్యక్తిత్వాల కొరకు అన్వేషించే విద్యాధిక మధ్య తరగతులకు చెందినవాళ్ళకు అది కొత్త జీవిత విధానాన్ని యిచ్చింది. హేతువాదపు ఆలోచనా విధానాలకూ, విగ్రహారాధనకు వ్యతిరేకమైన భావాలకూ, ఆస్తిక భావాలకూ యిచ్చిన ప్రాముఖ్యం ముఖ్యంగా వాళ్ళ దృష్టిని ఆకర్షించింది.

'నిమ్న వర్గాల' సమస్యను చేపట్టి, పాఠశాలలూ, కళాశాలలూ హాస్టళ్ళూ, వసతిగృహాలూ, అనాధ శిశు శరణాలయాలూ నడవడం ద్వారా వాళ్ళ స్థితిని మెరుగుపరచడానికి కృషిచేయడంలో కూడా ఆంధ్రదేశంలో బ్రహ్మ సమాజోద్యమం మొదటిది. మొదటితరం హరిజన నాయకులు యీ సంస్థల విద్యార్థులే. బ్రహ్మ సమాజం పరోక్షంగా సంఘ సంస్కరణోద్యమ వ్యాప్తికి బాట వేయడమే కాక, ప్రజా సామాన్యంలో ఉదారవాద పూరితమైన విశాల దృక్పథాన్ని సృష్టించింది.

మతసాంఘిక ఉద్యమాల పరిమిత విజయానికి కారణాలు యేమిటనేది వివాదానికి గురైంది. వీరేశలింగం గారి పెత్తందారీ ధోరణి, తన మిత్రుల, అనుచరుల సామర్థ్యం పట్లా, చిత్తశుద్ధి పట్లా ఆయన కుండిన అపనమ్మకమూ, యితరుల కృషిలో ఆయన జోక్యం కలిగించుకోవడమూ కారణమని వీరేశలింగం సమకాలికులలో కొందరు అన్నారు కానీ, ఉద్యమం యొక్క స్వభావంలోనే సహజంగా లోతైన కారణాలు వున్నాయి. ఉన్నత కులాలకు చెందిన మధ్య తరగతులు యీ ఉద్యమాలకు ప్రధాన సామాజిక ఆధారంగా వుండినాయి; కొన్ని ప్రాంతాలలో వర్తకులూ, మధ్య రకం రైతులూ కలసివచ్చారు. ఉద్యమ కార్యక్రమం మధ్య తరగతుల అవసరాలకు అనుగుణంగా వుండింది. సంస్కరణ భావాలకు సమాజంలోని కింది పొరలతో సంబంధం లేదు. అందువలన అవి కింది పొరలకు చేరనేలేదు. 'నిమ్న వర్గాల' సంక్షేమం లాంటి సమస్యలూ, 'జాతీయ విద్య' లాంటి భావాలూ 20వ శతాబ్దపు ప్రథమ దశాబ్ది తరువాత మాత్రమే చురుకుగా చేవట్టబడ్డాయి. ఆనాటికి వలు కారణాల వల్ల సంస్కరణోద్యమాలు క్షీణముఖం పట్టిన లక్షణాలు స్పష్టంగా కనిపించాయి.

ఆంధ్రదేశంలో 1907 నాటి స్వదేశీ ఉద్యమమూ, దాని పర్యవసానాలూ సంస్కరణోద్యమాలకు పెద్ద ఆటంకంగా పనిచేశాయి. రాజమండ్రిలోనూ, కాకినాడలోనూ వీరేశలింగం అనుచరులలో ప్రముఖ భాగంగా ఉండిన విద్యార్థులు స్వదేశీ ఉద్యమంలో చేరారు. 1907 తరువాత జరిగిన ఘటనలు సంస్కరణోద్యమాల క్షీణమాన ధోరణిని త్వరపరచాయి. వీరేశలింగం అనుష్ఠానిక బ్రాహ్మ సామాజికుడై, జందెం తీసివేసి, బ్రహ్మ సమాజ నియమాల ప్రకారం తల్లిదండ్రుల శ్రాద్ధం నిర్వహించి, ఆ సందర్భంలో సర్వకులాల సహపంక్తి భోజనం యేర్పాటు చేశాడు.

జాతీయోద్యమం ప్రజలనెక్కువగా ఆకర్షించే కొద్దీ ఒక ప్రశ్న తీవ్ర రూపంలో ముందుకు వచ్చింది – సంఘ సంస్కరణా, రాజకీయ సంస్కరణా యేది మొదట జరగాలనే ప్రశ్న. రాజకీయ, సాంఘిక సమస్యలను చర్చించడానికి 1907 తర్వాత జరిగిన జిల్లా సాంఘిక మహా సభలు సంఘ సంస్కరణ కంటె ముందు రాజకీయ సంస్కరణ జరగాలని తీర్మానాలు చేసినాయి. అంతకు మునుపు వుండిన వైఖరికి యిది విరుద్ధమైనది; సమాజ లక్ష్యాలలో రాజకీయ విషయాలు ప్రథమ స్థానంలోకి వచ్చినట్లు దీన్నిబట్టి తెలుస్తుంది. సంఘ సంస్కరణ అవసరమని మొత్తం మీద గుర్తింపబడినప్పటికీ, జాతీయోద్యమం దానిని రాజకీయోద్యమంతో యెడం చేయడానికి ప్రయత్నించినప్పటికీ, సంస్కరణోద్యమకారులు అంతకంటె శక్తిమంతమైన రాజకీయ పోరాటాలలోకి నెమ్మదిగానే అయినా స్థిరంగా లాగబడ్డారు.

సంస్కరణోద్యమాలకు ప్రతి క్రియగా పునరుద్ధరణవాదపు పెరుగుదల కూడా ఆ ఉద్యమాల క్షీణతకు యెక్కువగా తోడ్పడింది. సంస్కరణోద్యమాల ఉచ్చదశలో వుండిన కాలంలో కూడా సమాజంలోని నైష్ఠిక వర్గాలు సంస్కరణలను ఖండించే ఉపన్యాసాలు యిస్తూ, పుస్తకాలు ప్రచురిస్తూ వాటిని నిరంతరం వ్యతిరేకించారు. అనిబిసెంట్ మద్రాసులో స్థాపించిన థియసాఫికల్ సొసైటి 'జాతీయ పద్ధతులలో సంఘసంస్కరణలు' జరగాలని వాదిస్తూ, సంఘ సంస్కరణోద్యమాల మీదా, వాటి లక్ష్యాల మీదా దాడి చేసింది. అనీబిసెంటూ, కర్నల్ ఒల్కాటూ ఆంధ్రదేశంలో విస్తృతంగా పర్యటించి, రాజమండ్రి, కాకినాడ, మచిలీపట్నం మొదలైన ముఖ్య సంస్కరణ కేంద్రాలకు వెళ్ళారు. అనిబిసెంట్, న్యాపతి సుబ్బారావుల ఆశీస్సులతో మద్రాసులో 1904లో మద్రాసు హిందూ సంఘం ప్రారంభించబడడమూ, మద్రాసుకు వివేకానందుని రాకలూ, ఆయన ఉపన్యాసాలూ, సంఘ సంస్కరణలకు వ్యతిరేకంగా ద్వేష పూరితమైన ప్రచారం చేసే 'వర్ణాశ్రమ ధర్మ సంరక్షణ మండలి' ఆ కాలంలో

స్థాపించబడడమూ సంఘ సంస్కరణోద్యమాలను బలహీనపరచాయి. ఆంధ్రదేశపు సంస్కర్తలు తమ సంస్కరణలు జాతీయ వారసత్వానికి వ్యతిరేకం కాదని ఉద్ఘాటిస్తూ, తమ కార్యక్రమాన్ని సమర్థించుకోవడం ప్రారంభించారు. అంతే కాక, కుల సంఘాలు ఆవిర్భావం కూడా సంస్కరణోద్యమాన్ని ప్రభావితం చేశాయి.

సంస్కరణోద్యమాల ప్రభావం ప్రధానంగా పట్టణాలలో నివసించే విద్యావంతులకూ, చుట్టూ వున్న కొద్దీ గ్రామాలకూ పరిమితమైంది. చాలా కొద్దిమంది చిన్న వర్తకులూ, విద్యావంతులైన రైతులూ కూడా - ముఖ్యంగా గోదావరి, క్రిష్ణా జిల్లాల వాళ్ళు - యీ ఉద్యమాలచేత ప్రభావితులైనారు. అయితే, పరిమితమైన విద్యా వ్యాప్తినీ, సమాజపు ఆర్థిక సంబంధాలలో వచ్చిన కొద్ది మార్పులనూ గమనించి, సామాజిక చలన శీలత మహా పరిమితంగా వుండిందనే విషయం స్పష్టం చేయాలి. భూ సంబంధాలను మార్చడానికి, డబ్బు ప్రధానమైన ఆర్థిక వ్యవస్థను ప్రవేశపెట్టడానికీ, ఒకే అంతరంగిక మార్కెట్‌ను సృష్టించడానికీ జరిగిన ప్రయత్నాల మూలంగా నిర్మాణపు సమతూకం చెదరినట్లూ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థలు సంచరించట్లూ, తెలిపే కొద్ది లక్షణాలు కనిపించినప్పటికీ మొత్తం మీద పాత ఫ్యూడల్ సంబంధాలు కొనసాగాయి. కొత్త రెవెన్యూ సెటిల్‌మెంటులు భూమిమీద సొంత ఆస్తిని సృష్టించి, భూమిమీద వ్యక్తిగత స్వామ్యాన్ని ప్రవేశపెట్టి, తద్వారా స్థాయిమీద ఆధారపడిన సమాజాన్ని ఒప్పందంమీద ఆధారపడిన సమాజంగా మార్చాయి. యిదీ, గ్రామాలలో ప్రవేశించిన యితర నూతన వాణిజ్య, ఆర్థిక శక్తులూ బ్రిటిష్ యుగానికి ముందు భారతదేశపు గ్రామాలలో వుండిన భూ ఆర్థిక వ్యవస్థను పరిమితంగానే అయినా బలహీనపరచాయి. యీ కాలాన్ని ఫ్యూడల్ ఆర్థిక వ్యవస్థనుండి పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థకు పరిణమించే సంధి కాలంగా వర్ణించవచ్చు. అయితే యీ పరిణామం దాని అంతిమ గమ్యందాకా సాగలేదు. అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థా, అలాంటి అభివృద్ధితో సంబంధం గల సామాజిక పొరల పెరుగుదలా లేకపోయినందువల్ల, సంస్కరణోద్యమాల వృద్ధికీ, విజయానికి అవసరమైన అండదండలు లభించలేదు. అందువల్లనే యెంతగానో వాంఛింవబడిన 19వ శతాబ్దపు పునరుజ్జీవనమనేది మధ్యలో ఆగిపోయిన అసంపూర్ణ సామాజిక పరిణామంగా వుండవలసి వచ్చింది.

సంస్కరణోద్యమాలు చేసిన ప్రధానమైన ఉపకారం యేమిటంటే, మానవుని గురించి, సమాజం గురించి విజ్ఞాన ప్రబుద్ధ భావాలను వ్యాప్తి చేయడం, కులమనేది స్థిరంగానే వుండినప్పటికీ, కుల నిర్బంధాలు సడలాయి. కాలం చెల్లిన సంప్రదాయాలూ, ఆచారాలూ గల పాత సమాజాన్ని మార్చడం అవసరమనే స్పృహ సృష్టింపబడింది. సంస్కరణోద్యమాలు కాక, కుల సంఘాలు ఉద్భవించి, సాంఘిక, ఆర్థిక బురదలో కూరుకుపోయిన కులాలను ఉద్ధరించడానికి అనేక సంస్కరణలు చర్యలను ప్రవేశపెట్టడంలో యీ స్పృహ వ్యక్తమౌతుంది. అబ్రాహ్మణ కులాలకు సంబంధించినంత వరకు, సామాజిక న్యాయం కావాలనే ఆందోళనతో పాటు, సంఘ సంస్కరణ కావాలనే ఆందోళన కూడా జరిగింది. ఉపకులాల మధ్య వివాహాల గురించీ, ఉపకులాల సంలీనం గురించీ తీర్మానాలూ, కట్నాలనూ, బాల్య వివాహాలనూ ఖండించడమూ యీ కుల సంఘాల మహాసభలలో కనిపిస్తాయి. చిత్తూరు జిల్లాల్లోని వాయల్పాడుకు చెందిన రఘునాథవర్మ, గుంటూరు జిల్లాకు చెందిన త్రిపురనేని రామస్వామి చౌదరి, గధర్ పార్టీ ద్వారా ప్రసిద్ధుడైన దర్శి చెంచయ్య - వీళ్ళు తమ సొంత పద్ధతులలోనే అయినా శక్తివంచన లేకుండా, యెవరిపాటికి వాళ్ళు సంఘ సంస్కరణోద్యమాలు నిర్వహించిన వ్యక్తులలో కొద్ది మంది మాత్రమే. గ్రామీణ ఆస్తిపరులు రాజకీయ ప్రాబల్యానికి ఒక మెట్టు మాత్రమే దిగువన వున్న సాంఘిక ప్రాముఖ్యపు స్థానాలకు స్థిరంగా పెరగడాన్ని యిది సూచిస్తుంది. సంస్కరణోద్యమాలు పట్టణాలమీద ఆధారపడగా, కుల సంఘాలు ఉన్నత కులాల సంప్రదాయాలకూ, వాటి జీవిత విధానాలకూ లొంగిపోవడం నిజమే. అన్ని పరిస్థితులనూ గమనించి మొత్తం మీద చూస్తూ, సంఘ సంస్కరణోద్యమాల లక్ష్యాలలో కొంత భాగాన్ని మాత్రమే కుల సంఘాలు సాధించగలిగాయని చెప్పాలి. కుల సంఘాలకు యిది సాధించడానికి అవసరమైన యేకరూపతా, లక్ష్యశుద్ధీ వుండేది. కానీ, ఉన్నత కులాలమీద, ఉన్నత వర్గాలమీద ఆధారపడిన సంస్కరణోద్యమాలు సామాన్య ప్రజలలోకి దిగలేక, వాళ్ళ మనసులలో భావాలపట్ల విశ్వాసాన్ని గానీ, సంస్కరణ కార్యక్రమాల పట్ల నిబద్ధతను గానీ సృష్టించలేకపోయాయి.

సంస్కరణోద్యమాలు ఆంధ్రదేశంలో జాతీయోద్యమానికి పూర్వరంగాన్ని సమకూర్చాయి. టంగుటూరి ప్రకాశం,

# సజల నయనాల సాక్షిగా

- దారల విజయ కుమారి
9177192275



పండిన గోరింటాకు
అరచేతి ఎర్రదనంలో
వెతికి.. మురిసిందీ..
వెన్నెలను దాచి ఉంచిందీ..
నీ కోసమా..

నీ అడుగులతో అడుగుల్లకై
సగభాగపు సహజీవనంకై
కలసి ఉమ్మడి కలల్ని
కనేందుకై
ఎన్ని మొక్కులు మొక్కానో
మరెన్ని నోములు నోచానో

వ్యక్తిత్వాన్ని కుదించుకుని
త్రాసులో కూర్చున్న
నిన్నెలా వరించను
కురచ విలువల..
నీ.. మరుగుజ్జు తనానికి
నా చేతినెలా అందివ్వను

నువ్విప్పుడు మారకం విలువా..
గిట్టుబాటు ధరల మధ్యా..
మసలుకునే
వస్తువ్వి కాదంటావా

నీ అస్తిత్వాన్ని కట్నానికి
తాకట్టు పెట్టేసుకున్నాక
నువ్వు గుండు సున్నావే

విస్తార ధనరాసులెందుకు
నా మనసు తులసీ దళం..
ఒక్క మొలక చాలదా
నిన్ను తూచేందుకు

మది పేపరుపై ఇప్పుడిప్పుడే
పరుచుకున్న
భావాల అక్షరాలను
ఆత్మగౌరవ ఎరేజర్‌తో
తుడిచేసుకుంటా

నా కన్నవారి కడగండ్లను
నవ్వులుగా పులుముకునే..
ఇంతటి కాఠిన్యమా..
ఆడబిడ్డల పెళ్లంటే
ఇంతటి విధ్వంసమా..

మంచితనపు శిఖరమై
నిలిచేందుకూ
వస్తువై తక్కెడలో
తూచ బడేందుకు
ఆకాశమంత భేదం
నీకవగతం కాదెప్పుడూ

నీకే మొదటి పౌరసత్వాన్నిచ్చిన
పురుషాధిక్యతను
తిరస్కరిస్తున్నా

భావాల్ని భంగపర్చుకున్నా..
దిగులు కొమ్మై మిగిలినా..
నా జీవితం నా చేతుల్లోనే
ఉంచుకున్నా

నా సజల నయనాల సాక్షిగా
నీ ఆధిపత్యపు చెరలోంచి
తప్పించుకున్న విముక్తను

నా కన్నీళ్ళు సంద్రమై నిను
ముంచేయకనే తక్కెడ దిగి
వెళ్లి పో! ◆

---

భోగరాజు పట్టాభిసీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, గాడిచర్ల హరిసర్వోత్తమరావు లాంటి పలువురు ఆంధ్రదేశపు మొదటి తరం జాతీయ నాయకులు సంస్కరణోద్యమాలలో చురుకైన భాగస్వాములుగా వుండినవాళ్ళు.

ఆంధ్రదేశంలో సంస్కరణోద్యమాలు క్షీణించినాయంటే, 1907 తర్వాత గానీ, 1919 తర్వాత గానీ మనుషుల మనస్సుల మీద వాటి ప్రభావం విధిగా ఆగిపోయిందని అర్థం కాదు. వాస్తవం యేమిటంటే, సూర్యరశ్మి మొక్కలచేత గ్రహింపబడినట్లు అది కండ్లకు కనిపించకుండా, నిశ్శబ్దంగా బౌద్ధిక వాతావరణంలో భాగమైంది. తరువాత తరాన్ని నిర్మించిన పదార్థమే అయింది. ఆంధ్రదేశపు కమ్యూనిస్టు ఉద్యమం చివరి ముప్పైలలోనూ (late 1930's), తొలి నలభైలలోనూ (early 1940's) వీరేశలింగానికి జోహార్లు అర్పించి, సంఘ సంస్కరణ ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పిందంటే, వీరేశలింగం గారి ఉద్యమం యొక్క సర్వవ్యాపక ప్రభావం సందేహించరానిది. ఆధునిక ఆంధ్రదేశపు సాంఘిక, బౌద్ధిక వ్యక్తిత్వం యీ ప్రభావం నుండి యెక్కువగా ఉత్తేజం పొందుతూ వుండడం బహుశా వందొమ్మిదవ శతాబ్దపు సంస్కరణోద్యమాలు అత్యంత ముఖ్యమైన వారసత్వం. ◆




# తెలుగు సాహిత్య విమర్శకు కొత్త కోణం 'విమర్శిని'

- విజయ్
9490122229

2018 కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందినది 'విమర్శని' గ్రంథం. కవిత్వం నవల నాటికలలోచేయి తిరిగిన రచయిత, పరిశోధకుడు, విమర్శకుడు అయిన కొలకలూరి ఇనాక్ రాసినదీ గ్రంథం. సాహిత్యరంగంలో ఆయనకు గల బహుముఖ ప్రజ్ఞ ఈ గ్రంథంలో ప్రతిఫలిస్తుంది. ఈ 'విమర్శని'లో మూడు భాగాలుగా తెలుగు వెలుగులు, తెలుగు నవల, తెలుగు కథానిక ఉన్నాయి.

తెలుగు వ్యాసపరిణామంపై పరిశోధన చేసి సిద్ధాంత పత్రాన్ని సమర్పించిన ఇనాక్ సాహిత్య పరామర్శ, ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం, జానపద సాహిత్య విమర్శ, సాహిత్య దర్శిని మొదలైన గ్రంథాలను రచించారు. తెలుగు భాషా వికాసం తీరుతెన్నుల గురించి ప్రతి తెలుగు భాషాభిమాని అధ్యయనం చేయాల్సిన అవసరం నేడుంది. తెలుగు మాట్లాడే వారి సంఖ్య గణనీయంగా పడిపోతుందని వార్తలు వస్తున్న నేపథ్యంలో ఇది చాలా అవసరం. ఇనాక్ రాసిన తెలుగు వెలుగులు చదివితే తెలుగు భాష సంస్కృతుల పరిరక్షణకు ప్రజలు, పాలకులు ఎలాంటి దృష్టి పెట్టాలో బాగా అవగతం అవుతుంది. తెలుగు వెలుగులో 15 వ్యాసాలున్నాయి. ఇందులో ఐదు వ్యాసాలు తెలుగు భాషపై వెలుగును ప్రసరింపచేసినాయి. తెలుగు భాషా వికాసానికి ప్రజలు, పాలకులు శ్రద్ధ కనబరిస్తే భాష సుసంపన్నం అవుతుందని ప్రజల మధ్య సోదర భావం పెంపొందుతుందని ఆయన ప్రతిపాదించారు. మాండలిక మంటే జీవితమని, ప్రజల సంస్కృతి, ఆచార వ్యవహారాలను, వివిధ ప్రాంతాలను బట్టి మాండలికాలు ఉన్నాయని చెప్పినారు, సర్కారు, తెలంగాణ, రాయలసీమ, తమిళనాడు, కర్ణాటక ప్రాంతాల్లో మాదిగ వృత్తి పదాలు ఒకే రకంగా ఉంటే గుంటూరులో మాత్రం బ్రాహ్మణ మాండలికాలు, మాదిగ మాండలికాలు అంటూ రెండు మాండలికాలు ఉన్నాయన్నారు. మాండలికాలను ఆయన మూడు రకాలుగా వర్గీకరించారు. అవి కుల మాండలికం, వృత్తి మాండలికం, మతమాండలికం.

మనుషుల మధ్య అంతరాలు తొలగి వృత్తి, వృత్తి విభజన పోయి శ్రమ విభజన జరిగే క్రమంలో సమాజంలో మాండలికం స్థానంలో ప్రామాణిక భాష రూపుదిద్దు కుంటుందన్నారు. ఇలాంటి ప్రామాణిక భాష ఏర్పడడానికి ఈనాడు లాంటి పత్రికలు, కొన్ని సాహిత్య సంస్థలు చేస్తున్నంతగా తెలుగు అకాడమీ గాని అధికార భాషా సంఘం గాని ఎలాంటి ప్రయత్నం చేయక పోవడం శోచనీయం. నిఘంటువును తయారు చేయడం, ప్రామాణిక భాషా పదాలను అందరికీ అందుబాటులోకి తేవడం చాలా అవసరం. లేకపోతే గతంలోలాగా ప్రాంతీయ బేధాలు పెచ్చరిల్లి మరోసారి విభజనకు దారి తీయవచ్చు.

శ్రీకృష్ణ దేవరాయలు తెలుగు భాషకు చేసిన సేవ అపూర్వమైనది. రాజ్యం, మతం కూడలిగా రాయలను ఆయన నిర్వచించారు. రాయలను మహాకవిగా, మహా చక్రవర్తిగా, ప్రేమికునిగా, భక్తునిగా, ప్రకృతి ప్రేమికు నిగా, మహాత్మునిగా కీర్తించాడు. రాయల పట్ల ఇంత ఆరాధన ఉండడం ఆశ్చర్యకరం.

జానపద సాహిత్యంలో గతం తాళం వేస్తే వర్తమానం శృతి కలుపుతుంది. భవిష్యత్ రాజ్యం చేస్తుందంటాడు కొలకలూరి. జానపద రూపాలైన హరికథ, బుర్రకథ, పాటలు, కీర్తనలు మొదలైనవన్నీ ఆధునిక సాహిత్యం

వాడుకుంటున్నదన్న సత్యాన్ని ఆవిష్కరించారు. ఇందుకు ఉదాహరణంగా పాట ఆధునిక సాహిత్యంలో విస్తృతమైన పాత్రను నిర్వహిస్తోందన్నారు, మన సంస్కృతిని, జాతిని, భాషను రక్షించుకోవాలంటే జానపద సాహిత్యాన్ని రక్షించుకోవాలని ఆయన అన్నారు. దేశమంటే మనుషులనే స్పృహ పెరగాలన్నా, జీవితం పట్ల, ప్రజల పట్ల ప్రేమ పెరగాలన్నా జానపద సాహిత్యం మిగతా సాహిత్యాల కన్నా ఎక్కువ దోహదపడుతుందన్నారు

మాతృభాషలో విద్యాభ్యాసం వల్ల పఠన పాటవ పరిశోధనా సామర్థ్యం విస్తృత మవడంతో పాటు అనుభూతి, పరిశీలనా సామర్థ్యం, విపులీకరణ పెంపొందుతాయన్నారు. మానవ సంబంధాల సమన్వయం వ్యక్తిత్వ వికాసం జరుగుతాయన్నారు. మాతృభాష అభివృద్ధికి విఘాతం కల్పించే పాలకుల ధోరణులను విమర్శకులు ఎందుకో ఎక్కడా ప్రస్తావించలేదు. తెలుగు వాచకాలలో సంస్కృత సుభాషితాలను పదాలను పెట్టరాదని, అవి పిల్లలను చదువుకు దూరం చేస్తాయన్న వాస్తవాన్ని వ్యక్తీకరించారు. తెలుగులో రాయగలిగి తానేమి చెప్పదలుచుకున్నాడో అందరికీ అర్థమయ్యేలాగా చెప్పగలిగే పరిస్థితి వచ్చే విధంగా వాచకాలను తయారుచేయాలని అభిలషించారు. పసివాళ్లు ఆడుతూ పాడుతూ నేర్చుకునే విధంగా రూపొందించాలని ఆయన కోరారు.

ఇనాక్ దళిత బహుజన దృక్పథం గల సాహితీ విమర్శకులు. విమర్శనిలో అడుగడుగునా ఇది స్పష్టమవుతుంది. మొట్టమొదటి దళిత గీతంగా మాలవాండ్ర పాటను గుర్తించారు. దీనిని దళితకవి రాసి ఉంటారని ఊహించారు. కానీ దానిని మంగిపూడి వెంకట శర్మ రాశారని సాహితీ విమర్శకులు రాచపాళెం పేర్కొన్నారు.

వలస రచయితలు తమ ప్రాంత జీవితాన్నే ఎందుకు చిత్రిస్తారు అన్న ప్రశ్నకు సమాధానంగా ఆ ప్రాంత పునాదులు భాషా సంస్కృతులు కూరుకుపోయి ఉండటమే కారణమని తేల్చినారు. వలస రచయితలు పరాయీకరణకు కూడా గురవుతారు. అయితే వలస రచయితలే సాహిత్యాన్ని సమకాలికం చేయగలరనే సత్యాన్ని ఆయన ఆవిష్కరించారు. అందువల్లనే సాహిత్యం ప్రపంచ సంస్కృతికి గుండెకాయగా పేర్కొన్నారు.

విమర్శనిలో రెండవ భాగమైన తెలుగు నవలపై కూలంకషంగా చర్చించారు. ముదిగంటి సుజాతా రెడ్డి 'తెలుగు నవలానుశీలనం, 'వల్లంపాటి వెంకటసుబ్బయ్య అనువాదం 'నవల – ప్రజలు' గ్రంథాలు నవలపై విస్తారంగా చెప్పినాయి. కానీ ఇనాక్ దళిత బహుజన దృక్పథంతో నవలలను విశ్లేషించడం ద్వారా కొత్త కోణాలను ఆవిష్కరించారు. తెలుగు నవలా సాహిత్యంలో పంచముల జీవితాల గురించి సమగ్రంగా ఇంతవరకు ప్రతిఫలించలేదని, దీనికి కారణం వీరవసరం సమాజంలో అంతగా లేకపోవడం అన్నారు. వాస్తవానికి వీరి శ్రమ లేకుండా సమాజం నడవలేదు. పట్టణాలలో, పంచాయతీలలో పారిశుధ్య కార్మికులు, గ్రామాల్లో వ్యవసాయ కూలీలుగా గ్రామ సేవకులు (వెట్టి తలారి)గా ఉండేది పంచములే. నవలా రచయితలు వీరిని విస్మరించడం అంటే వారికి శ్రమ పట్ల సరైన అవగాహన లేకపోవడమే. ఈ అవగాహన పెంపొందించేది మార్క్సిజం మాత్రమేనని కొలకలూరి స్పష్టం చేసినారు.

ఆధునిక మహా కావ్యంగా గుర్తింపబడుతున్న నవలకు నోబెల్ బహుమతులు కూడా వస్తున్నాయి. కవిత్వం స్థానాన్ని ఇప్పుడు నవల ఆక్రమించిందని ముదిగంటి సుజాతా రెడ్డి అన్నారు. సమాజంతో ప్రకృతితో జరిపే పోరాటాన్ని చిత్రించే మహాకావ్యమే నవల అని రాల్ ఫాక్స్ నిర్వచించారు. నవల మానవ జీవితంలోని బాహ్య ప్రపంచం పరిస్థితులనే గాక మనిషి అంతరంగ జీవితాన్ని కూడా ఆవిష్కరింపజేస్తుంది. అందుచేతనే అంతర బహిర మానవ విముక్తిగా తెలుగు నవలను నిర్వచించారు ఆచార్య కొలకలూరి ఇనాక్. తనకోసం తాను జీవించేవాడు అంతర మానవుడు. నలుగురి కోసం బతికే వాడు బాహిరమానవుడు. నవలల్ని మార్క్సిజం, మనస్తత్వం దృష్టికోణాల నుంచి అధ్యయనం చేయడం ద్వారా మనకు స్పష్టత లభిస్తుందన్నారు. తెలుగు నవల ప్రారంభం నుంచి మనిషి కేంద్రంగా నడిచిందన్నారు. నవలా వికాసంపై రాసిన వ్యాసంలో తొలి నవల, చారిత్రక, సాంఘిక, హాస్య, మనోవైజ్ఞానిక నవలా వికాసం గురించి విపులంగా ఉన్నాయి. రాజకీయ నవలల నవలల గురించి ప్రస్తావించి ఉంటే మరింత సమగ్రత చేకూరేది.

పంచముల గురించి వచ్చిన నవలగా 'మాలపల్లి'ని అందరూ ప్రస్తావిస్తారు కానీ 'మాలపల్లి' నవలలో ఉన్నవ మానవ అభివృద్ధి కంటే గ్రామ పరాజయాన్ని, పరాభవాన్ని బాగా చిత్రీకరించారన్నారు. ఈ నవల ద్వారా మాల మాదిగలను కాంగ్రెస్ పార్టీకి అనుకూలంగా బ్రాహ్మణ వ్యతిరేక పార్టీగా వచ్చిన జస్టిస్ పార్టీకి ప్రతికూలంగా మార్చగలిగింది

అన్నారు. వేయి పడగలు నవలను విశ్వనాథ బ్రాహ్మణాధిక్యతను కీర్తిస్తూ రూపొందించారన్నారు. ఇదొక నిప్పుల నవలగా ఆయన భావించారు. చలం స్త్రీల గురించి రాసినా ఆ స్త్రీలు బ్రాహ్మణ స్త్రీలని కొలకలూరి విశ్లేషించారు. చలంకు హరిజనులు అంటే భయం. బ్రాహ్మణ స్త్రీలను పాడుచేసేవారిగా ఆయన భావించారన్నారు.

జి. మోహన్ రావు రాసిన 'ఖాకీబతుకులు', చిలుకూరి దేవపుత్ర రాసిన 'పంచమం', కళ్యాణ్ రావు 'అంటరాని వసంతం', 'కాలువ మల్లయ్య 'మాదిగ పల్లె ', ఎస్. వెంకట్రామిరెడ్డి 'కాడి' మొదలైన నవలలు దళిత జీవితాన్ని చిత్రీకరించాయని కొనియాడారు. అన్ని నవలలను విశ్లేషిస్తూ తెలుగు నవల మనిషి అభ్యుదయానికి నిలువెత్తు అద్దంలా నిలబడిందని ఆయన కొనియాడారు. నవలా సాహిత్యం కొంత అభివృద్ధి చెందినా ఇంకా ఎంతో ప్రగతి సాధించాలని ఆయన అభిలషించారు. తెలుగులో 1872 లో వచ్చిన శ్రీ రంగరాజ చరిత్ర ను మొదటి నవలగా, రాజశేఖర్ చరిత్రను మలి నవలగా నిర్ధారించారు. నరహరి గోపాలకృష్ణమ శెట్టి రాసిన శ్రీ రంగరాజ చరిత్ర లో రాజు ఒక లంబాడి కన్య సోనాబాయిని ప్రేమించి పెళ్లి చేసుకోవడం ఇందులోని కథాంశం. నల్లమల అడవుల్లోని తాండా సామాజిక జీవితం ఇందులో కనిపిస్తుంది. అందుచేత దీన్నే తొలి నవలగా తీసుకోవాలన్నారు. వీరేశలింగం రాసిన రాజశేఖర చరిత్ర, వికార్ ఆఫ్ వేక్ఫీల్డ్ అనే ఆంగ్ల నవలకు అనుసరణ కావడంవల్ల దీనిని మలి నవలగా తీసుకోవాలన్నారు.

మనిషి ఆలోచించే తీరు ఆచరణలో వాటి ప్రభావం దాని నుంచి మళ్లీ మన ఆలోచనా తీరు ఇవన్నీ కలిపి మనిషి మనస్తత్వం అవుతుంది. ఈ మనస్తత్వమే మనిషిలోని సమస్త భావాలకు, ద్వంద్వాలకు, సంఘర్షణలకు కారణమని, ఈ సంఘర్షణ గతానికి వర్తమానానికి రాజీ కుదరకపోవడం వల్ల పుట్టిందని కొలకలూరు అభిప్రాయపడినారు. మనిషి గతం వేసిన ముద్రల్నిచెరిపేసుకుని వర్తమానంతో రాజీ పడతాడు. గోపీచంద్ అసమర్థుని జీవయాత్రలో సీతారామారావు ఆదర్శానికి ఆచరణకు మధ్య సంఘర్షణలో అసమర్థునిగా మిగిలిపోయాడన్నారు. అయితే సామాజిక పరిస్థితుల ప్రభావం మనిషి మనస్తత్వంపై ఆధారపడి ఉంటుందన్న విషయం అందరికీ తెలిసిందే. దీన్ని ఇనాక్ తన వ్యాసంలో వదిలేశారు. అయితే మనస్తత్వం చిత్రించిన నవలలు మనిషి తన సమస్యల నుంచి విముక్తి పొందడానికి, సంఘ సమస్యలు పరిష్కరించడానికి దోహదపడతాయన్నారు కొలకలూరి.

విమర్శనిలో మూడవ భాగం కథానికా పరిణామం. కథలెందుకు పుట్టాయి, ఏది తొలి కథ, కథల్లో ఉన్న రకాలు మొదలైన అంశాలన్నింటిని విడివిడిగా కూలంకశంగా రచయితల పేర్లతో సహా వివరిస్తూ రాసినారు ఇనాక్. తన జీవితాన్నే కాక ఇతరుల జీవితాలను తెలుసుకోవాలన్న ఆకాంక్ష కారణంగానే కథ పుట్టింది. అయితే అది మెల్లగా ప్రేమ నీతి వైపు పయనించిందన్నారు. కథానిక వేదకాలం నుంచి ఉందని భావించడం సరికాదన్నారు. ఆంగ్లంలో షార్ట్ స్టోరీ వచ్చిన తర్వాతనే కథానిక తెలుగులో ప్రారంభమైందన్నారు. కథ సమాజాన్ని ప్రతిబింబిస్తుందని ఆ కథాంశం సమాజాన్ని తిరిగి ప్రభావితం చేస్తుందన్నారు. గురజాడ రాసిన దిద్దుబాటు కథ మొదటిది కాదని బండారు అచ్చమాంబ 'ధన త్రయోదశి' తొలి కథ అని ఆయన పేర్కొన్నారు. కానీ నేటి తెలుగు పరిశోధకుల ప్రకారం అచ్చమాంబ కన్నా ముందే చాలామంది కథలు రాశారని తెలుస్తోంది. రాయలసీమలోనే చాలా కథలు ఇప్పుడు వెలుగులోకి వచ్చాయి

గురజాడ రాసిన దిద్దుబాటు కథ ఓ హెన్రీ కథకు అనుసరణ అని తేలింది కాబట్టి 'మీ పేరేమిటి?, 'పెద్ద మసీదు 'కథలు మాత్రమే అచ్చంగా తెలుగు కథలుగా పేర్కొన్నారు. చలం, కొ.కు లు రాసినా అవన్నీ బ్రాహ్మణ జీవితాలని ప్రతిబింబించాయన్నారు. గోపీచంద్ మాత్రమే అబ్రాహ్మణ జీవితం వైపు పయనించారన్నారు. గిరిజనేతరులు గిరిజనుల కథలు రాశారన్నారు. గిరిజనులే రాసిన కథలు రావాల్సి ఉందన్నారు. స్త్రీవాద, దళితవాద, మైనారిటీ, బహుజన వాద కథలు వచ్చాయన్నారు. కథానికకు ఉత్తరాంధ్ర తూర్పు దిక్కుగా ఆయన గుర్తించారు. గురజాడ, శ్రీశ్రీ, చాసో, చలం, రావిశాస్త్రి మొదలుకొని నేటి గంటేడ గౌరునాయుడు, బమ్మిడి జగదీశ్వరరావు, గౌరును జగదీశ్వర రెడ్డి, అట్టాడ అప్పల్నాయుడు మొదలైన వారి వల్ల ఉత్తరాంధ్ర కథాసాహిత్యం పరిఢవిల్లుతోందన్నారు. అదేవిధంగా రాయలసీమలో కూడా చాలా మంది కథలు రాస్తున్నారన్నారు. తెలుగు కథానిక ఆవిర్భావమే ప్రతిభా స్ఫోరకంగా జరిగిందని 'మీ పేరేమిటి' కథలో ఇది వ్యక్తం అయిందన్నారు.

ఒక ఆదర్శ జీవితం ఉన్న సమాజం మీద నిర్మించే అద్భుత సాహిత్య సృష్టి రావాలి. ఇప్పుడున్న దరిద్రం, దుఃఖం పోయి సమాజం మారుతుందనే విశ్వాసాన్ని కలిగించే సాహిత్యం రావాలని ఆయన తన విమర్శని గ్రంథంలో ఆకాంక్షించారు ◆

ప్రజానాయకుడు, సాహిత్యాభిమాని

## టి. నరసింహయ్య కన్నుమూత

ప్రజానాయకుడు, సాహిత్యాభిమాని, సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవిగారి తండ్రి టి. నరసింహయ్య జనవరి 18న హైదరాబాద్‌లో కన్నుమూశారు. 1928 జూన్ 8న తెలకపల్లి రామయ్య, సరస్వతమ్మ దంపతులకు జన్మించారు. 91 ఏళ్ళ టి. నరసింహయ్య సిపియం పార్టీ నాయకుడిగా చిరపరిచితులు. రాయలసీమలో ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ నాయకుడిగా ఆ తర్వాత సిపియం నాయకులుగా ప్రజల మధ్య , కష్టజీవుల పక్షాన చివరి శ్వాస వరకూ పనిచేశారు. ప్రజా ఉద్యమాలలో మమేకం అవుతూనే సాహిత్య పట్ల ఆసక్తి చూపేవారు. కర్నూలు జిల్లాలో సాహితీస్రవంతి ఏర్పాటుకు ప్రత్యేక శ్రద్ధ పెట్టారు. సాహిత్య ప్రస్థానం పత్రికను తప్పనిసరిగా తెప్పించుకుని చదివి సూచనలు, విమర్శలు చేసేవారు. రెండు సంవత్సరాల క్రితం కన్నుమూసిన నరసింహయ్య గారి సహచరిణి టి.సి. లక్ష్మమ్మ ప్రజా ఉద్యమాలలో నరసింహయ్య గారితో కలిసి నడిచారు. పార్టీ కార్యకర్తలకు క్లిష్టమైన అర్థశాస్త్రం అంశాన్ని సులభంగా బోధిస్తారని నరసింహయ్య గారికి పేరు. ప్రజా సమస్యల పట్ల ఎప్పటికప్పుడు స్పందించడమే కాకుండా ప్రతీ



సమస్యనూ క్షుణ్ణంగా అధ్యయనం చేసేవారు. కార్యకర్తలతో ఆప్యాయంగా మసులుతూ వారి వ్యక్తిగత సమస్యలను కూడా తెలుసుకుని పరిష్కరించడానికి ప్రయత్నించేవారు. 2007లో 'ఉద్యమం - జీవితం- ఓ కమ్యూనిస్టు జ్ఞాపకాలు పేరుతో తన స్వీయజీవితాన్ని నరసింహయ్య గారు గ్రంథస్తం చేశారు. చాలా స్ఫూర్తివంతమైన జీవితం నరసింహయ్యగారిది. వీరి కటుంబం ప్రజా ఉద్యమాలకు అంకితమైన తీరును, నిబద్ధతను ఆ గ్రంథం ఉత్తేజభరితంగా వివరిస్తుంది. ◆

## కమ్ బ్యాక్

- కెంగార మోహన్
9493375447



వెనక్కి వెళ్ళేకొద్దీ అనుభూతులన్నీ
గుట్టలు గుట్టలు పేరుకుపోయి కనిపిస్తున్నాయి
ఎన్నేళ్ళ ఉద్దీపనలో కాని
వొక్కసారిగా మదిలో అల్లుకుపోయి
నరనరాల్లో కుదించుకుపోయిన
న్యూరో ట్రాన్స్‌మీటర్లు వెలిపోయినట్లున్నాయి
ఫలితమేమోగానీ ఎంతగా మారిపోయాడీ మనిషి
తనకు తాను "నేను" మనిషినంటూ పరిచయం
చేసుకుంటున్నాడనిపిస్తుంది
అడుగులు ముందుకు పడేకొద్దీ
కోట్ల యుగాల వెనకున్న అనాగరిక సమాజాన్ని
యిప్పుడు కూడా ఆవిష్కరిస్తున్నాడనిపిస్తోంది
ఇది ముమ్మాటికీ ఇల్యూషన్ స్టేట్‌మెంట్ కానే కాదు కదా!
మానసిక బంధాల్లోంచి బయటకు విసిరేయబడి
సాంకేతిక అనుబంధాల నిష్క్రియాత్మక
సంకెళ్ళను తనకు తానే బిగించుకొని
మరీ పునీతమౌతున్నాడనడం తిరోగమనమే
ఏ అచ్ఛాదన లేని కృత్రిమానంద
సామాజిక మాధ్యమాలే అన్యోన్యమని భావిస్తున్న
ఈ నవనాగరిక సమాజం ముందుంచుతున్న ఒకే ప్రశ్న
ఊపిరుండి యంత్రాలైన ఈ మనుషుల్ని
మనసున్న మనుషులుగా తయారు చేస్తారా? ◆






# ముందుమాటల్లో రాచముద్ర

- డా॥ పి.సి.వెంకటేశ్వర్లు
9490164963

నేటి ఆధునిక సాహిత్య విమర్శకుల్లో అందరికీ బాగా పరిచయమైనవ్యక్తి ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి. రాత, మాట, బాట మూడింటిలో ఆదర్శప్రాయమైన మార్క్సిస్టుగా ఆయన మూర్తిమత్వం నిండుదనాన్ని కలిగి ఉంటుంది. ఆచార్యుడిగా ఉద్యోగవిరమణ చేసిన తర్వాత కుటుంబ, వెయక్తిక జీవితాలకే పరిమితమై పోకుండా నిరంతరం ఎప్పటికప్పుడు వస్తున్న ఆధునిక సాహిత్యంపై తన గొంతుకను వినిపిస్తున్న ఆధునిక విమర్శకుడు రాచపాళెం. ఇంకా చెప్పాలంటే ఉద్యోగవిరమణ చేశాక తన కలానికి ఎక్కువ పదును పెడుతున్న భౌతికవాద విమర్శకుడు. ఎందుకంటే ఇప్పటి వరకు ఆయన రాసి, ప్రచురించిన 28 విమర్శక గ్రంథాల్లో 2008 తర్వాత వచ్చినవి 20పైచిలుకు ఉన్నాయి. కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందిన " మన నవలలు - మన కథానికలు" కూడా ఉద్యోగవిరమణ తర్వాత 2010లో వచ్చింది. అంటే ఉద్యోగధర్మం తర్వాతకూడా అనుక్షణం సమయాన్ని వ్యర్థం చేయకుండా చేయవలసిన సాహిత్య సేవను కొనసాగిస్తున్నారనే నిత్యసాహిత్య కృషీవలుడైనాడు.

అనంతపురంలో కవులు, కరువు సమృద్ధిగానే ఉన్నట్లు ప్రత్యక్షంగా చూసిన ఎవరికైన అర్థమౌతుంది. గురజాడవారి భావజాలాన్ని, కట్టమంచివారి ఆధునిక విమర్శను ఆకళింపుచేసుకున్న రాచపాళెం భౌతికవాదిగా, మార్క్సిస్టు విమర్శకుడిగా ఎన్నో రచనలు చేశాడు. అలాగే కొన్ని గ్రంథాలకు పీఠికలు రాశాడు. కవితాగ్రంథాలకు ముందుమాటలు రాశాడు. ఏది రాసినా దృక్పథం స్పష్టంగా ఉన్నప్పుడు, చేసే విమర్శలో సూటిదనం ఉన్నప్పుడు, మాటల్లో అరమరికలు లేనప్పుడు అది పాఠకుల్ని ఆకట్టుకోవడమే కాదు, ఆలోచింపజేస్తుంది. వారికి మార్గదర్శనం అవుతుంది. రాచపాళెం విమర్శకు ఆ శక్తి ఉంది. అందుకే ఎంతో మంది యువ పరిశోధకులు, రచయితలు, అధ్యాపకులు ఆయన రచనల్ని బాగా అధ్యయనం చేస్తున్నారు. ఆయన ప్రభావాన్ని మరికొందరికి అందజేస్తున్నారు.

రాచపాళెం రాసిన 'ముందుమాటలు' గ్రంథంలో 40 కవిత్వ పుస్తకాలకు రాసిన ముందుమాటలు క్రోడీకరించబడ్డాయి. దాదాపు 2006 నుండి రాష్ట్ర నలుమూలలనుండి కవిత్వం రాసిన కొందరు రచయితలు రాచపాళెం చేత అభినందన రాయించుకోవాలని కుతూహలపడ్డారు. వారి కవితా సంపుటాలపై రాచపాళెం రాసిన అభిప్రాయాల సమాహారమే ఈ గ్రంథం.

ఆధునికుడైన రాచపాళెం ముందుమాటలు రాసిన కవితా సంపుటాలన్నీ ఆధునికమైనవి కావు. కొన్ని ప్రాచీనవాసనలతో రాసిన గ్రంథాలుకూడా ఉన్నాయి. అందులో వచన కవిత్వం,

పద్యకవిత్వం, పద్యాలు, అనువాదాలు, నానీలు, కీర్తనలు , బాలసాహిత్యం, సంకలనాలు, ఇతరాలు ఉన్నాయి. 'ఏ గ్రంథానికి ముందుమాట రాస్తున్నా జంకుతూ రాయడం అలవాటై పోయింది. తాను ఈ పుస్తక రచయితకన్నా గొప్పవాడినికాదు అనే స్పృహలో ముందుమాటలు రాస్తాన'ని రాచపాళెం ఈ గ్రంథానికి రాసిన ముందుమాటలో చెప్పుకోవడం ఆయనలోని ఒదిగిపోయే మనస్తత్వానికి నిదర్శనం. ఆయన కవితా గ్రంథాలకు సూచించిన ముందుమాటల్ని కొన్ని ప్రత్యేక శిల్పంతో ప్రారంభిస్తాడు. తాను ఏ కవితకు ముందుమాటలు రాస్తున్నాడో అందులోని ఒక కవితతో ప్రారంభించడం, ఆ గ్రంథరచయితతో తనకున్న పరిచయంతో మొదలు పెట్టడం, పుస్తకంలో కవితలున్న ప్రక్రియ తీరుతెన్నుల్ని ప్రస్తావిస్తూ ఆరంభించడం, రచయితను ఇబ్బందిపెట్టే వాక్యాలు వాడకపోవడం, చిన్న చిన్న సూచనలు చేయడం, రచన కొనసాగించాలని ప్రోత్సహించడం వంటివి రాచపాళెం ముందుమాటలో కనిపించే అంశాలు.

ముందుమాటలు రాసే క్రమంలో, కవిత్వతత్వాన్ని విశ్లేషించే క్రమంలో రాచపాళెం కొన్ని ప్రతిపాదనలు చేశాడు. లక్ష్యాలను నిర్దేశించాడు. కవి సర్వస్వతంత్రుడైనప్పటికీ, శక్తి సంపన్నుడైనప్పటికీ, వైతాళికుడైనప్పటికీ జగాన్ని స్వర్ణమయం చేయలేడని, అలా చేసేశక్తులు వేరే ఉన్నాయని చెప్పడంలో కవి పరిధుల్ని వివరిస్తాడు రాచపాళెం. పుత్తా హరినాథ్ రాసిన 'హరివిల్లు' కవితా సంకలనానికి రాసిన ప్రేమ, అనురాగం, వాస్తవమైనప్పటికీ, కవి 'వాటిమీద మోజును పెంచుకోవడం విశ్వదృష్టికి అవరోధం అంటాడు. కళా మురళి రాసిన 'పుడమి తల్లి' సంపుటికి రాసిన 'కవిత్వ సంతకం' అనే ముందుమాటలో కవిత్వానికి, కవికి కొత్తదైన నిర్వచనం ఇచ్చాడు. 'కవి జనంతో చేసే కరచాలనం కవిత్వం' అంటాడు. 'రాయవలసిన కవిత్వం రాయడం కవి లక్షణం'గా చెప్పాడు రాచపాళెం. అరుణమ్మ రాసిన 'అమ్మ ఒకమనిషి' కవితాసంపుటికి 'జీవన వ్యాఖ్యానం' శీర్షికతో రాసిన ముందుమాటలో గృహయిత్రి రచయిత్రిగా మారితే, విశ్రాంతివర్గం నుండి కాకుండా శ్రామిక వర్గంనుండి వచ్చిన స్త్రీ కవిత్వం రాస్తే ఎలా ఉంటుందో వివరించాడు.

"నువ్వు విత్తునాటితే
నేను మొక్కనయ్యేదాన్ని
నువ్వు నిప్పును నాటుతున్నావ్
నేను జ్వాలనై లేస్తా" వంటి కవితల్లో రచయిత్రి చైతన్యాన్ని విశ్లేషిస్తూ, వర్తమాన సమాజపు దుష్ఫలితాలకు వ్యాఖ్యలే ఆమె కవితా ఖండికలని కితాబిచ్చాడు.

నందవరం కేశవరెడ్డి 'కామాలే' కవితా సంపుటికి 'యానబాట పట్టాలి' అంటూ రాసిన పరిచయంలో రాయలసీమ జీవితంతో సంబంధంలేని సినిమాలవాళ్ళు చిత్రించే కథలను ప్రోత్సహించవద్దని యువతను కోరాడు. కవిత్వంలో చెప్పే విషయానికి, విధానానికి సమప్రాధాన్యత ఉండాలని, కవిత్వంలో రాయలసీమ మాండలికం పూర్తిస్థాయిలో తీసుకురావాలని ప్రతిపాదించాడు. కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి రాసిన 'చిగురింత' లకు రాసిన ముందుమాటలో చిన్న నానీలో భావాన్ని భావుకతను కూర్చినందుకేకాదు, అగ్రవర్ణం వాడై ఉండి కిర్రుచెప్పులు కుట్టే మాదిగను మా అన్నయ్య అనగలిగినందుకు రచయితను మెచ్చుకున్నాడు. అలాగే 'మన నానీలు' సంపుటి రాసిన ఎ.ఎ. నాగేంద్ర కవిత్వాన్ని విశ్లేషిస్తూ, నానీ లక్షణమైనసమస్య ప్రతిపాదిత అంశం, దానిమీద వాఖ్య చేయడంలో చాలామంది విఫలం అయ్యారని, రచయిత కవిత్వాన్ని వొలకబొయ్యకుండా వంచేందుకు ప్రయత్నిస్తున్నాడని, యువరచయితను భుజం తట్టి ప్రోత్సహించాడు. మెరాజ్ ఫాతిమా రాసిన 'అంతర్వేదన' కవితా సంపుటిలో కవితల్ని చదివితే, 'సముద్ర గర్భంలోని బడబాగ్ని, కొలిమి కడుపులోనుంచి ఎగిరే మంటలు గుర్తుకొస్తున్నాయి అంటాడు. వచనకవిత్వం వచనమై తేలిపోకుండా, అర్థంకాని భాషా కాఠిన్యపు పేటిక కాకుండా సాగిన ఫాతిమా కవిత్వం పాఠకుడ్ని మెల్లగా నడిపిస్తుందని మెచ్చుకున్నాడు. ఎలవర్తి మధుసూధన్ రాసిన 'కొత్తపాట'లో కవిత్వాన్ని మదింపు చేస్తూ భక్తిగీతాల దశనుండి వచనకవితా మార్గంవైపు మళ్ళినాడని, కవితలో దృక్పథ పరమైన ఇబ్బందులున్నా శ్రీశ్రీ, తిలక్, కుందుర్తి వంటి కవులు మనఊరికి వచ్చి పలకరించినట్లు మధుసూధన్ కవిత్వం ఉంటుదని చెప్పాడు.

సత్యాన్ని గోప్యంగా దాచిపెట్టేవ్యక్తి కవిగాదు. ప్రభుత్వ పోలీసు ఉద్యోగి. కవిత్వం నమ్మకమివ్వాలి. నిజాన్ని నిర్భయంగా చెప్పాలి. భరోసా నివ్వాలి. అలాంటి కవిత్వాన్ని రాసేవారిని నమ్మదగిన కవులు అంటారు. నద్దపల్లి చిదంబరరెడ్డి 'నమ్మదగినకవి' అంటాడు రాచపాళెం. 'దృశ్యప్రవాహాని'కి రాసిన ముందుమాటలో. నీటి బుడగకు, నీటి బిందువుకు స్వభావంలో తేడా ఉందని, ఒకటి ఆకారాన్ని సాకారం

చేసుకోలేనిదని, మరొకటి సాకారమయ్యేదని అంటాడు. ఈ తాత్త్వికత తెలిసినవాడైన రాచపాళెం రచయితను అనంతపురం కవుల్లో నీటి బిందువుగా వర్ణించాడు. కెంగార మోహన్ రాసిన 'కవనసేద్యం' అభ్యుదయ గొంతుకగా అభివర్ణించాడు.

'నలుదిక్కుల కబళించిన ఉమ్మడి శత్రువుని జయించాల్సిన సమయం ఎప్పుడో వచ్చేసింది' అంటూ గొంతెత్తిన కవిఅనీ, ప్రపంచీకరణ మేడిపండు పొట్టచీల్చి దానిలోని పురుగుల్ని చూపించడానికి ప్రయత్నించాడని ముందుమాటలో వివరించాడు. శ్రీశ్రీ(మూడు యాభైలు), ఆరుద్ర (కూనలమ్మ పదాలు), లాగా, రాయలసీమ నుండి పదాలను పదునుపెట్టిన పుట్టపర్తి, గజ్జెలలాగా, వర్తమాన అంశాల్ని పదాలుగా కవిత్వీకరించి రామమోహన్ రాసిన 'కోయిలమ్మ పదాలు' ఉన్నాయని ధ్రువీకరించారు. అలాంటి పదాలతో వచ్చిన 'తెలుగు బాలపదాలు' రాసిన మల్లికార్జునను అభినందనలతో ఆశీర్వదించాడు. రాయలసీమ పదసాహిత్యానికి పుట్టినిల్లని, రాయలసీమ రచయితగా మురిసిపోయాడు రాచపాళెం.

'కర్నూలు కవిత' సంకలనాన్ని పరిశీలించి, ఆ పుస్తకాన్ని 'వర్తమాన భారతీయ చిత్రం'గా వర్ణించాడు. 68ఏళ్ళ స్వతంత్రభారతం మీద, స్వపరిపాలన మీద, భారత్ వెలిగిపోతుంది వంటి నినాదాల మీద రచయిత సంధించిన ప్రశ్నలను రాచపాళెం స్వాగతించాడు. అన్ని జిల్లాల నుండి ఇలాంటి కవితా సంకలనాలు రావాలని తెలిపాడు.

*"ఇది ఆకలికావ్యం*
*ఇది అంటరానికావ్యం*
*ఈ కావ్యానికి నాహ్వానం"* అంటాడు రాచపాళెం. కార్మికవర్గపు కవి ఇరుపోతు శ్రీనివాసులు రాసిన 'నిజమేకదా' కావ్యానికి రాసిన ముందుమాటలో. వచ్చినిజాలు, కఠినసత్యాలు, కవిత్వప్రశ్నలు గల కవితా సంపుటిగా అంచనా వేశాడు. మార్క్సిస్టు, మార్క్సిస్టేతర ప్రజాతంత్రవాదులు ఐక్యతను ప్రతిపాదిస్తున్న కవితలుగా నిర్ధారించాడు రాచపాళెం.

కవులు ప్రాచీన, ఆధునిక కవులు, పద్య,వచనకవులు వంటి విభాగాలే మనకు తెలుసు. విమర్శకుడిగా రాచపాళెం భావాల్నిబట్టి మూడురకాలుగా విభజించాడు. వెనుకటి భావాల్ని నమ్ముకున్నవారు. ఉన్నచోటనే ఉందామనుకున్నవారు, ముందుకు వెళ్ళామనుకున్నవారు. ఈ మూడురకాల కవితలు కలిగిన పుస్తకంగా జింకా సుబ్రమణ్యం చేసిన 'పసిడి పరిమళాలు' అనే కవిత్వ సంకలనాన్ని సమీక్షిస్తూ చెప్పాడు. ఆయన ప్రొద్దుటూరు నుండి వచ్చిన కవిత్వపొద్దుగా అభివర్ణించాడు. 'చైతన్యగీతాలు' అనే సంపుటిని రాసిన చిన్నవాడైన ఆనంద్‌ను అభినందిస్తూ 'కరుణ కన్నీటి చారికలద్దిన శిల్పంనీది' అని కితాబిచ్చాడు.

*"మాకు తోలు వలవడం తెలుసు*
*మాకు వెన్ను విరవడం తెలుసు*
*మాకు కాటికి కాయం మోసి*
*కపాలమోక్షం ఇప్పించడం తెలుసు"* వంటి కవితల్లో వున్న ధర్మాగ్రహాన్ని ముందుమాటల్లో న్యాయంగా ప్రస్తావించాడు.

సుద్దాల అశోక్‌తేజ రాసిన 'శ్రమ' కావ్యానికి మహాకావ్యం పేరుతో పదిపుటల ముందుమాట రాశాడు రాచపాళెం. కల్పనావస్తువుకు స్థల,కాలాలుంటాయని, ఈ దీర్ఘవచనకావ్యంలో కాలం, స్థలం ప్రత్యేకంగా కనిపించకపోయినా, సుదీర్ఘమైన కొన్ని యుగాల కాలముందని, సరిహద్దులులేని రంగస్థలం ఉందని, శ్రమీ – శ్రామికుడు రెండే పాత్రలతో కావ్యం నడచినా, వారు అసంఖ్యాక జనసమూహాల ప్రతీకలనీ వివరించాడు రాచపాళెం. భావ, భౌతిక వాదాలను అరటిపండు వలచినట్లు చెప్పడమే కాకుండా, మనిషి చారిత్రక నిర్మాత ఎలా అయ్యాడో కావ్యం శాస్త్రీయంగా ఆవిష్కరించిందని, 'శ్రమ మహాప్రస్థానం' అవుతుందని విమర్శనాత్మక నిర్ణయం చేశాడు. అలాగే 'మట్టిపోగు' కవితా సంపుటిని రాసిన కుమారస్వామిని సిద్ధాంతబలంగల కవిగా రాచపాళెం నిర్ధారించాడు. శ్రీశ్రీ రాసిన 'మానవుడా' కవిత ఎంత గొప్ప అభ్యుదయాన్ని కలిగించిందో, కుమారస్వామి 'సహజసూత్రం' కవిత కూడా కలిగివుందని వివరించాడు. 'అక్షరం జనసమూహాలుగా మారుతుంద'ని చెప్పడం కవి చెప్పిన గొప్పవాక్యమని, 'పల్లె ఇప్పుడు ఒంటరి పక్షి' అనడంలో ప్రపంచీకరణ దృష్టి కలిగివున్నాడని వివరించాడు రాచపాళెం. శాంతి నారాయణ రాసిన 'కొత్త అక్షరమై' కవితా సంపుటికి 'రెండు శతాబ్దాల నడుమ' అనే శీర్షికతో ముందుమాట రాశాడు రాచపాళెం. యాభైఏళ్ళ సాహిత్యజీవితాన్ని కలిగిన శాంతినారాయణ భౌతికవాదిగా, హేతువాదిగా, ద్రావిడవాదిగా, భూస్వామ్య రాచరిక, అగ్రకుల పెట్టుబడిదారీ వ్యవస్థలపైన తన కవితలద్వారా యుద్ధం ప్రకటించాడని చెప్పాడు.

*"విశ్వమానవుణ్ణి నేను*
*వసుధైక కుటుంబం నాది*

*మానవత్వం నాకులం*
***సమానత్వం నామతం"*** అని చెప్పిన శివప్రసాద్ 'రెక్కలు కావాలి' కవితాసంకలనం కులరహిత సమాజాన్ని కోరుకుంటున్నదని, కవి ఇప్పుడిప్పుడే స్థిరమైన దృక్పథంవైపు రెక్కలు తొడుక్కొని పయణిస్తున్నాడని తెలియజేశాడు రాచపాళెం.

జయప్రద రాసిన 'కొత్తదేహాలు' కవితాసంపుటిని 'అమ్మతనాన్ని పంచుతున్న కవిత్వం' శీర్షికతో సుదీర్ఘమైన సమీక్ష చేశాడు. ఆమె కవితలు వర్తమాన సంక్షోభంలోనుండి ఎగిసిపడిన అక్షరజ్వాలలు అంటాడు. విమర్శకుడిగా తన ఆలోచనను అవసరమైనచోట్ల బలమైన వాక్యాలతో ప్రతిపాదించడం రాచపాళెం రచనలోని విలక్షణం. 'భయంతో బ్రతికే సమాజం గొప్పది కాదు, మనుషుల్ని భయపెట్టే వ్యవస్థ మంచిదిగాదు' అనే మాటలు వర్తమాన సమాజంలో రాజ్యహింసను, రచయితలపై జరిగే దాడులను సూటిగా విమర్శించడమే. ఇలాంటి బెదరగొడుతున్న భవిష్యత్తుపై రచయిత్రి శంఖారావం పూరించిందని, స్త్రీల ఆత్మహత్యలపై మహిళల్ని చైతన్యపరచిందని వివరించాడు రాచపాళెం.

*"భూమ్మీద నీటి మట్టాలు*
*అడుగడుక్కి పోతుంటే*
*అవినీతి మట్టాలు*
*అంతకంతకు పెరిగిపోతున్నాయి".*

అంటూ నిరసించిన కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి రాసిన 'వాకిలితెరవని వాన' అనే కవిత్వానికి ముందుమాట రాశాడు. 21వ శతాబ్దపు గిరీశాల గుట్టును ఈ కవిత్వం రట్టు చేస్తుందని, దేశభక్తి అనే పదాన్ని మనం భ్రష్టుపట్టించినంతగా ఎవరూ పట్టించలేదని, నాయకులు చెప్పే నంబర్‌వన్ స్థానం ప్రత్యక్ష్యంగా చూపమని ప్రశ్నించాడు. అదేవిధంగా శ్రీరామమూర్తి రాసిన 'నివురు' గ్రంథానికి 'నిజాలకవి నిజమైనకవి' అనే శీర్షికతో రాసిన పరిచయంలో రాచపాళెం ప్రతిభావంతమైన, ఆలోచనాత్మకమైన ప్రతిపాదనలు చేశాడు. 'వర్తమానం పట్ల విమర్శనాత్మక భావనలేని వాళ్ళు ఆధునిక రచయితలు కాలేరు'. 'గతంపట్ల విగ్రహారాధన చేసేవాళ్ళు ప్రజాకవులు కాలేరు', 'జరుగుబాటు, వెనులుబాటు రక్తమెక్కించుకొని గాలిలో చేతులు తిప్పేవాళ్ళు జనం రచయితలు కాలేరు', 'కూల్చేయాల్సిన శత్రువుల పాదెచుట్టూ ప్రదక్షిణలు చేసేవాళ్ళు సామాజిక రచయితలు కాలేరు' అంటూ సైద్ధాంతిక ప్రతిపాదనలు చేశాడు. 'పురాణ పురుషుని పాదాలనుండి పుట్టినవారికి పాదాలతో పనేముంటుంది. వారికి వేదాలున్నాయి కదా!' అంటూ తార్కికంగా కవిత చెప్పిన రచయితను అభినందించాడు.

ఘంటసాల నిర్మల సంకలనం చేసిన 'నాన్న' కవితాసంపుటికి ముందుమాటలో విస్తృతమైన విశ్లేషణ చేశాడు రాచపాళెం. కుటుంబ ప్రాధాన్యాన్ని, అమ్మనాన్నల గురించి సుదీర్ఘంగా చర్చించాడు. శ్రీనాథుని నుండి అద్దేపల్లిదాకా కవులు నాన్నను ఎలా వర్ణించారో వివరించాడు. దుష్యంత, యయాతి, భీష్మ, దశరథ, సిరియాల పాత్రలు తండ్రి తత్వానికి ఇచ్చిన ప్రాధాన్యాన్ని వివరించాడు. పూర్ణమ్మ, కన్యక, లవణరాజుకల గ్రంథాల్లోని తండ్రులతత్వాన్ని తెల్పాడు. అనుమాండ్ల, ఎండ్లూరి, కల్పన, జింబో వంటివారు నాన్నల్ని ఆవిష్కరించిన తీరును చెప్పాడు. వృత్తులు చేసుకొనే నాన్నలను కవులు ఎలా చూపించారో తెలిపాడు. ప్రాచీన, ఆధునికసాహిత్యాల్లో నాన్నపై జరగవలసిన అన్వేషణ జరగలేదని తేల్చిచెప్పాడు రాచపాళెం. అలాగే ఆవుల వెంకటేశులు రాసిన 'కవితాక్షరాన్నై' సంపుటికి 'సామాజిక సంవేదన' పేరుతో రాసిన ముందుమాటలో 'మానవ సమాజంలో మనిషిని వెదకడానికి రచయిత ప్రయత్నిస్తున్నాడని తెలిపాడు. అదేవిధంగా కుంచె లక్ష్మీనారాయణ రాసిన 'అమ్మపేరే నాకవిత్వం' రచనను అంచనావేస్తూ సాహిత్యంలో కళాన్వేషణ చేశాడని, కావ్యం జీవితంలాగానే ఉందని, తల్లిని పోగొట్టుకున్న వాళ్ళను, తల్లికి దూరమైనవాళ్ళను, అనేక కోణాల్లో చూపుతూ, అమ్మబొమ్మను గీసిన కవితా చిత్రకారుడని రచయితకు కితాబిచ్చాడు. ఏకాంతంలో చదువుకొని కన్నీళ్ళు కార్చే అవకాశం ఇచ్చినందుకు రచయితకు ధన్యవాదాలు చెప్పుకున్నాడు రాచపాళెం.

జానీ రాసిన 'వై' కావ్యానికి 'అరుదైన వస్తువు అందమైనకావ్యం'. అనేపేరుతో ముందుమాట రాశాడు. హిజ్రాల జీవితాన్ని వస్తువుగా తీసుకోవడం గొప్ప సాహసమని, ఇలాంటి కవితలు చదవడానికి పాఠకలోకం సన్నద్ధం కావాలంటాడు. తమ శారీరక నిర్మాణంలో లోపానికి తాము కారణం కాదని, ఇటు కన్నవాళ్ళు, అటు సమాజం నిరాదరణగా చూస్తే ఎలాగంటూ ఆలోచింపజేసే కవిత్వముందన్నాడు. రాఘవేంద్ర రాసిన 'గాయపడ్డ విత్తనం' కవితా సంపుటిలో అనంతపురం కవులనుండి సిరియా

మారణకాండదాకా విస్తరించిన కవిత్వాలున్నాయని, విశ్వంతో ఆరంభమైన సీమ వచనకవిత్వం విశృంఖలంగా ముందుకు సాగుతుందని వివరించాడు. 'అగ్నిపంజరం' కవితా సంపుటిని రాసిన పాలువ శ్రీనివాస్‌ని 'తాజా రాయలసీమ కవి'గా చెప్పుకొచ్చాడు. తనప్రాంత వాస్తవికతని, సమాజ వాస్తవచిత్రణ చేసిన నేటికాలానికి అవసరమైన కవిగా శ్రీనివాస్‌ని గుర్తించాడు. అదేవిధంగా తులసీరామ్ రాసిన 'తులసి పొడుపులు' అనే పొడుపు కవితల సంపుటిని విశ్లేషిస్తూ, అందమైన తెలుగు పదాలతో పిల్లలస్థాయిలో రాశాడని ప్రశంసించాడు. చిదంబర రెడ్డి రాసిన 'మహాభి నిష్క్రమణ' సంపుటికి 'ధర్మాగ్రహం' పేరుతో ముందుమాట రాశాడు. రాయలసీమ గాథలు, గాయాలు కవితా వస్తువులని పేర్కొన్నాడు. బూర్ల వెంకటేశ్వర్లు రాసిన 'రంగుల విల్లు' అనే నానీల సంపుటిని మానవీయ నానీలుగా చెప్పాడు. అయితే కవిలో భావవైవిధ్యం, భావనా వైరుధ్యం ఉండకూడదని, అభిసారిక లాంటి పదాల్ని అన్ని సందర్భాల్లో వాడకూడదని సలహా ఇచ్చాడు రాచపాళెం.

ఆధునిక విమర్శకుడైన రాచపాళెం తన అభిప్రాయాలకోసం కవులు పంపిన పద్యకవితా లోతుల్ని కూడా పరిశీలించి ముందుమాటలు రాశాడు. తన భావజాలానికి విరుద్ధమైన వస్తువుతో సాగిన రచనల్లో కూడా కవిత్వస్థాయికి పరిమితమై సహృదయ విమర్శ చేశాడు. మునుస్వామి రాసిన 'అయ్యప్పస్వామి జననం' లాంటి భక్తిగ్రంథానికి భౌతికవాది ఎలాంటి ముందుమాట రాస్తాడో చదవాల్సిందే. శ్రీశ్రీ అమెరికా వెళ్ళినప్పుడు తనదైనరీతిలో వేంకటేశ్వరునిపై కవిత్వం చెప్పాడుగా, అలాగే సాగింది ఈ పరిచయం కూడా. పద్యకవిత్వం తెలుగుకవి సేద్యంగా రూఢీకెక్కిందని, వివక్షలేని భక్తివుండడం వల్ల శిరిడి, శబరిమల వృద్ధి పొందాయని వివరించాడు. అలాగే రాచపాళెం రఘు రాసిన లోకాయత శతకానికి రాసిన ముందుమాటలో నోటికి, చేతికి మధ్య వైరుధ్యం కనిపించడం లేదని, పద్యాలైనా భౌతికవాద దృక్పథంతో సాగాయని మెచ్చుకున్నాడు. కొర్రపాటి రమణయ్య రాసిన 'సరిహద్దు సైనికుడు' అనే పద్య కవితా సంపుటికి రాసిన ముందుమాటలో ఈనాటి వ్యవస్థలోని కొన్ని సంస్థలు అనుసరిస్తున్న వైఖరికి మాటల వాతలు పెట్టాడు. మతభక్తే దేశభక్తిగా, మతాన్ని ప్రశ్నించడం దేశాన్ని ప్రశ్నించడంగా మారిందని విమర్శించాడు. ప్రజలు కోరుకోని యుద్ధాన్ని రాజకీయ వ్యవస్థలు కోరుతున్నాయని చెప్పాడు. పద్యాలు కాలువనీటిలా సహజంగా ప్రవహించాయని, ఆధునిక భావవ్యవస్థీకరణకు పద్యాన్ని సమర్థవంతంగా ఉపయోగించాడని రచయితను అభినందించాడు.

పాలెం వేణుగోపాల్ రాసిన 'కడపరాయుని అపురూప కీర్తనలు' గ్రంథాన్ని ప్రాదేశి సాహిత్య అధ్యయనంగా పేర్కొన్నాడు. అన్నమయ్య భావవాదే అయినా, వేంకటేశ్వరుని జాతీయం చేశాడని, అలాంటి అన్నమయ్య చెప్పిన ఊర్ల పేర్ల ఉనికిని వివరించిన ఈ గ్రంథం మంచి ప్రయత్నమని కితాబిచ్చాడు రాచపాళెం. అలాగే రామలింగారెడ్డి రాసిన 'మానవతావాది మహాత్మా ఫూలే' పద్యకావ్యానికి 'సామాజిక విప్లవకావ్యం' శీర్షికతో ముందుమాట రాశాడు. 1133 పద్యాలు గల ఈ కావ్యరచన జాషువా, దువ్వూరి, త్రిపురనేని, కట్టమంచి వంటివారి మార్గంలో సాగిందని వివరిస్తూ, సాంప్రదాయులకు వస్తువు నచ్చదని, ఆధునికులకు పద్యం నచ్చదని అయినా, గొప్పకావ్యంగా మలచబడిందని తెలిపాడు.

రాధేయ 'మగ్గం బతుకులు' (వీవర్స్ చామ్స్), నాగేంద్ర నానీలను ఆంగ్లంలోకి అనువదించాడు రమేష్ నారాయణ . ఈ రెండు గ్రంథాలకు ముందుమాట రాసిన రాచపాళెం రచయితను 'తర్జుమార్జునుడి'గా పిలిచాడు. సీమకవిత్వాన్ని సీమ దాటించినందుకు, కవిత్వాన్ని అనువాదం చేయడం అసాధ్యమన్న టాల్‌స్టాయ్ మాటల్ని మింగేసి చక్కటి అనువాదం చేసినందుకు రమేష్‌ను అభినందించాడు. భారతీయులు ఆంగ్లంలోకి తర్జుమా చేసిందికూడా 'భారతీయాంగ్ల సాహిత్యం'గా సిద్ధాంతీకరించాడు.

'శిల్పప్రభావతి' నుండి 'ముందుమాటలు'దాకా వచ్చిన రాచపాళెం గ్రంథాల్లో ఆయన విమర్శనాత్మకశైలిని గమనిస్తే ఆయన కలం ఎంత పదును తేలిందో స్పష్టంగా అర్థమౌతుంది. ప్రాచీనతనుండి ఆధునికత వరకు ఆయన సాగించిన పరిశోధక మార్గం అర్థమౌతుంది. పీఠికలు, సమీక్షలు, ముందుమాటలు వంటివి విలక్షణమైన అస్తిత్వాన్ని కలిగిన వచన రచనాప్రక్రియలు. వీటిలో తనదైన ముద్రవేసుకున్న రాచపాళెం ఆలోచనా విధానం, వాక్యనిర్మాణం, దిశానిర్దేశం వర్తమాన రచయితలకు దారిదీపాలు అనడం అతిశయోక్తికాదు. ఆవశ్యకత. ◆

# అమ్మ కుట్టుమిషను

- డా.పెంకి విజయ కుమార్
9553392949



చీకటికి తెల్లని వెలుగుధైర్యాన్ని జతచేసి
సూరీడుకి ఎరుపురంగు పూసేది మా అమ్మ

పోలియో రాకాసి ఒక కాలిని పీల్చేసినా
బతుకు పోరాటంలో ఒంటి కాలుతో
కుట్టుమిషన్‌కు వేగం పరుగును నేర్పింది
వ్యవస్థ ఆడించే పారా ఒలింపిక్స్ లో విజేతగా నిల్చింది

కత్తెర వేటుకు వేర్పాటయ్యిన గుడ్డలు
అమ్మచేతి సుహృద్భావంతో
సూదీ దారంతో స్నేహగీతం పాడుకొని
అందమైన వస్త్రాలయ్యి మెరిసి మురిసిపోయేవి

మూడుముడులబంధం ముక్కలైనా
గడియారం మూడుముళ్ళతో పరుగులెత్తి
రెప్పలచాటున నిద్రను జోకొట్టి
రెక్కలు ముక్కలుజేసుకొని
బిడ్డల ఆకలిని అణిచేసే అన్నపూర్ణ అయ్యింది

కాలానికి అమ్మను చూస్తే  ఒకింత ఆశ్చర్యం
నా సమయానికి విచక్షణా కిరీటమయ్యి
నన్నో చదువుల రారాజును చేసి
చిరిగిన చీరలో రాజమాత కీర్తిని మూటగట్టుకుంది

నాన్నని ఎత్తుకుపోయిన సారాభూతమే కాదు
ఏ భూతంనీడ తన పిల్లలను కబళించకుండా
తన రెక్కల రక్షణలో ఆత్మస్థైర్యమే ఆలంబనగా
శిక్షణనిచ్చింది తల్లి కోడిలా

అమ్మ కాలికే అవిటితనం కానీ
ఆమె అంతరంగం ... తలెత్తి
సెల్యూట్ చేసేటంత జాతీయ పతాకం

నా బతుకు పుస్తకంలో ప్రతీ పుటా
అమ్మ స్వేదసిరాతో లిఖింప"బడి"ందే
గురువుగా నేను పొందిన మన్ననలు

శాఖోపశాఖలై మహావృక్షమయ్యిందంటే
అందుకు అమ్మ జీవిత శతకంలోని
నీతులే మూలవేర్లు

కుట్టుమిషనుతో పొట్టలు నింపుతూ
అమ్మ  బతుకు పుస్తకంలో ఒదిగిన
శ్రమయేవ జయతే నా సూక్తిసుధారాగం
వైఫల్యాల డొక్కచీల్చి ఢోలు కట్టి
విజయఢంకా మ్రోగించిన
కుట్టు మిషనే? నా జీవన జాతీయ చిహ్నం

నాలో సహనం తొట్రుపడిననాడు
అమ్మ కుట్టుమిషన్ తో ముచ్చటిస్తాను
శత్రువులు చుట్టిముట్టిననాడు
అమ్మ కుట్టు పాఠాలతో స్నేహహస్తంతో కట్టిపడేస్తాను

*(తాను దివ్యాంగురాలైనా.. నాకు దివ్యమైన జీవితాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించిన మా అమ్మకు ఘనమైన నీరాజనాలు అర్పిస్తున్నాను)*



# ఏనుగు అంబారీ

వనజ తాతినేని - 9985981666

అమ్మా..యెలా వున్నావ్. నీరసం తగ్గిందా మందులు వేసుకుంటున్నావా, నీ అకౌంట్‌కి మనీ ట్రాన్స్ఫర్ చేసాను చూడు.

ఇప్పుడే మోటెల్ నుండి నడిచి వస్తుంటే. ఈ ఆకురాలు కాలంలో వీధులన్నీ మన సంక్రాంతికి ప్రతి వీధిలో రంగులలంకరించిన ముగ్గులు గాలికి చెదిరినట్లు కనబడుతున్నాయి. చెట్లన్నీ మౌనంగా ధ్యానం చేసుకుంటూ మనలోకి మనం చూసుకుని రివ్యూ వ్రాసుకోమన్నట్టు చెపుతున్నాయి. సెల్ఫ్ ఫీడ్ బ్యాక్ అవసరం కదా. ఫోన్‌లో మాట్లాడుతూ చాలా విషయాలు చెప్పలేను నీకు. అందుకే ఈ ఉత్తరం వ్రాస్తూ ..

లెర్న్ కమ్ ఎర్నెర్ ప్రాసెస్‌లో చాలా నేర్చుకున్నాను. డబ్బు సంపాదించ లేకపోయినా చాలా అనుభవం సంపాదించాను ప్రపంచమే వొక పెద్ద పాఠశాల. ఇల్లు నేర్పనిది ప్రపంచం నేర్పుతుంది అంటారుగా, నిజమే. ప్రపంచం నుండి యేం తీసుకోవాలన్నది మాత్రం యింటి సంస్కారం నేర్పుతుంది. వుద్యోగం లేకపోయేటప్పటికీ మొత్తంగా నేనిక్కడే ఫెయిల్ అయినట్టున్నాను.

నేర్పవలసినది నేర్పకుండా నేర్చినది మర్చిపోకుండా అసలెన్ని తిప్పలో తెలుసా! ఎన్ని కథలో, ఇదిగో మళ్ళీ రెండవ త వ్రాయకుండా ధ వ్రాసావని వూరికే గొడవచేయకు. నువ్వు నేర్పినవన్నీ గాలిలోకి ఎగిరే ముందే గాలికొదిలేసి వచ్చేసాను. తెలుగులో వ్రాయక మూడేళ్ళపోయింది. మూడు ముళ్ళు ఎప్పుడేసుకుంటావ్ అంటావ్. నువ్వేం కంగారు పడకు. అయితే గియితే యిక్కడ నల్ల జాతీయుడిని లవ్వాడతాను కానీ ఇండియన్‌ని ప్రేమించను. పాపం నల్ల జాతి వాళ్ళు వివక్షకి గురైనవాళ్ళని నాకు బాగా జాలి యేర్పడింది. మనవాడినే ప్రేమించి లేదా ఒప్పందం కుదుర్చుకుని నీ చేత లక్షలు ఖర్చు పెట్టి పెళ్లి చేయించను. ఆడంబరం కోసం అభద్రతలో కష్టపడి సంపాదించుకున్న సొమ్ముకి కాళ్ళొచ్చి పోయేటట్లు అస్సలు చేయను. నేను అంత త్యాగాలు చేయలేనమ్మా. అనవసరంగా కులమూ కులమూ అని వూరికే లబ లాబలాడి పోకు. అన్న

ఎన్టీఆర్ పూనుతాడు నాకు.

సరేలే, ఇంకేంటి సంగతులు? ఏమీ తోచడం లేదు అనుకుంటూ ఇంకా మిషన్ ని అరగదీస్తూనే వున్నావా ? మన ఇంటిప్రక్కన ఆ కిరస్తానీ పిల్ల ఉంది చూడు, అదేనమ్మా శరీరాన్ని బస్తాలో వేసి కుదేసినట్లు గున గునలాడుతూ తిరుగుతూ ఉంటుంది చూడు ఆ పిల్ల. రెండు నెలలకొకసారి ఆఖరి ఇంచ్ వరకూ కుట్లు వేయమని వీలవకపోతే క్లాత్ ఎటాచ్ చేసి ప్యాచ్ వర్క్ అందాలు సృష్టించమని నిన్ను ఊపిరాడనివ్వదు కదా ఆ అమ్మాయి ఇంకా వస్తుందా? ఎందుకమ్మా ఆమెకి నిజం చెప్పలేవు నువ్వు. శరీరాలు పెరిగినంత ఈజీగా బాడీ ఫిట్టింగ్ కుట్టడం ఈజీ కాదని. పైగా ఆమె వెళుతూ వెళుతూ సిటీలో టైలర్‌కి యివ్వకుండా నీతో బ్లౌజులు కుట్టించుకోవడం అంటే పరోక్షంగా మనకి సహాయం చేయడమంటా. వెళుతూ వెళుతూ ఆ మాట నేను వినేటట్లు అని వెళ్ళింది. నువ్వు వినలేదులే, బాధపడతావని నేను చెప్పలేదు. వాళ్ళ బడ్జెట్‌లో వాళ్ళు సర్దుకోవడం చేతకాక దాన్ని కప్పెట్టుకోవడానికి ఎదుటివాళ్ళ మీద పడి యేడుస్తారు. వారానికి నాలుగుసార్లు బిర్యానీలు రోజుకు రెండు కోక్‌లు తాగి గేదల్లా పడుకుంటే వాళ్ళు పెరుగుద్దా తరుగుద్దా. పోవమ్మా ఫో. పోయి సిటీలో ఆ మాస్టర్ టైలర్ దగ్గరే కుట్టించుకో. నీకు వాళ్ళే కరక్ట్ అని సమాధానమిచ్చా ఆమెకు.

ఎంత ఓర్పమ్మా నీకు? కొలతలకు యిచ్చిన బట్టలకి ఇంత మురికి వుందేమిటో.. ఆ కంపు యేమిటో అంటూ వాటిని అంటుకోవడం ఇష్టం లేకపోయినా ఆ అయిష్టాన్ని దాచుకుని వాళ్ళిచ్చే వందరూపాయల కుట్టుకూలి కోసం బ్లవుజులు కుట్టిన నీ పరిస్థితి లాంటిదే యిప్పుడిక్కడ నా పరిస్థితి కూడా. 'అసలా అలాగా జాతోళ్ళ బట్టలు నిన్నెవరు కుట్టమన్నారు అంత అయిష్టంగా వుంటే కుట్టడం మానేయ్, మనకసలకి అంత ఖర్మేమి పట్టిందట? మనం కూటికి పేదైతే నేమి కులానికి పేద కాదన్న సంగతి గుర్తుంచుకో' అనే నాన్న మాటలు గుర్తుకొచ్చి మరీ వెగటు బుట్టుద్ది. నిజం చెప్పు, నాన్నది టూమచ్ ఎస్కెపిజం కదూ..

డబ్బు లేకపోయినా కాస్త అందంగా వుండి బాగా చదువుకుంటున్న నన్ను చూసి పక్కింటివాళ్ళు ఈర్ష్య పడటం వాళ్ళ ఈర్ష్యని చూసి నేను నిజాలు మాట్లాడితే భరించలేరు మరి. వాళ్ళది ఉడుకుమోత్తనం అయినప్పుడు నాది గంద్రతనం యెందుకు కాకూడదు చెప్పసలు. వాళ్ళకు పడీపడీ చదవాల్సిన పనిలేదు. బోలెడన్ని మార్కుల పనీ లేదు. ఏ రోజన్నా సూర్యోదయం అంటే యెఱుగుదురా అనడిగితే కోపం వస్తుంది. అరకొర చదువుతోనే తక్కునెళ్ళి వుద్యోగంలో కూర్చుంటారు. రేసులో ప్రతిభ వుండి కూడా వెనుకబడిన మనలను చూసి నవ్వుకుంటారు. ఏదో విషయం చెపుదామని ఎక్కడెక్కడికో వెళ్ళిపోయా. అన్నట్టు ఆ కిరస్తానీ పిల్ల వాళ్ళ అన్నయ్య నాకు దగ్గరలోనే వుంటున్నాడు. మంచి జీతమే వస్తుంది. వాడి వొంకర తనం ఏమీ తగ్గలేదు. డాలర్ల బలుపు చూసి ఇంకా పెరిగింది కూడా. కల్యాణీ బిర్యానీ అని ముక్కుమూసుకునే మనం ఇక్కడ ప్రక్కనోడు తింటుంటే అయిష్టతని కూడా లోలోపల అణిచిపెట్టి ఫ్లెసెంట్ ని పెదాలకి అద్దుకుంటాం. ఇదిగో ఇలాగే ఇతరుల రుచులను అభిరుచులను అభిప్రాయాలను గౌరవించాలని నేర్చుకుంటామిక్కడ. అది నాకు చాలా నచ్చింది కూడా.

నాన్న లాగా తిని కూర్చోకుండా డెబ్బై ఏళ్ళు వచ్చినా చిన్న చిన్న ఉద్యోగాలు చేసే వృద్ధ బామ్మలు అడుగడునా కనబడతారు. ముఖ సౌందర్యానికి వేలకు వేలు తగలేస్తారు. ఎక్కడ చూసినా అందంగా వుండాలని కనబడాలని శరీరాన్ని హింసించుకునే నారీ మణులు కనబడతారు. అంతా వ్యాపార సంస్కృతే కదమ్మా కొంటూనే ఉంటారు. ఇక్కడ బ్యూటీ పార్లర్ కి వెళ్ళకపోతే మొగుళ్ళు వదిలేస్తారట. మా నల్ల ఫ్రెండ్ చెప్పాడులే. ర్యాండమ్ థాట్స్ మావిద్దరివి. మా దేశంలో పెద్ద పెద్ద కారణాలకు కూడా మొగుళ్ళను పెళ్ళాలు వదిలేయరు అన్నాను. ఆ కారణాలు యేమిటేమిటీ చెప్పమని ప్రాణం తీస్తాడు. నీ కథ చెప్పాను. ముఖం విచారంగా పెట్టి మీ నాన్నపై ఆమెకెందుకు అంత జాలి అని అడిగాడు. నేను పడి పడి నవ్వాననుకో.

అన్నట్టు అసలిక్కడ కులం సంగతి చెప్పకుండా బతకలేము. దేశీవాళ్ళు మనిషి పరిచయమవగానే కుక్కలు నేరస్తుడిని పసి కట్టినట్లు గుచ్చి గుచ్చి నానా రకాల ప్రశ్నలు వేసి కూపీలు తీసి ఆఖరికి కులం కంపు బయట పెట్టేసుకుంటారు. కూటికి పేదోమో కానీ కులానికి పేద కాదు అనే మన స్టాక్ డైలాగ్ ఇక్కడ పనికిరాదు. సూది

గుచ్చుకున్న నొప్పి తెలియకుండా విషభావాలు మెదడులోకి ప్రవేశపెట్టడం అనే విద్య బాగా తెలిసినవాళ్ళు మనవాళ్లే అంటే నమ్మవు నువ్వు. అలా ఎందుకుంటారులే అంటావ్. కుక్కలకిచ్చిన ఇంపార్టెన్స్ తోటి మనిషికివ్వరు. పక్కింటివాళ్ళ కుక్కను కూడా చూసి నవ్వరు. ముఖం చిట్లించరు. అంతా గుంభనమే.

ప్రపంచంలో ప్రతిదీ మార్కెట్. మార్కెట్‌లో ఏవైనా అమ్మబడతాయి. అందుకు సాక్ష్యంగా ఇక్కడ యోగా లెగ్గిన్స్ భలే అమ్ముడు పోతున్నాయి. ఆఖరికి మనసు పడే బాధ కూడా శ్రమ లాగే. డిగ్నిటీ ఆఫ్ లేబర్. ఆ డిగ్నిటీనీ నువ్వు గడప దాటకుండా కుట్టు మిషన్ లో వెతుక్కుంటే నేను విమానమెక్కి ఇంకో మూల ఒక మోటెల్ లో స్టివార్డ్ గా పని చేస్తున్నా. ఉష్.. ఎవరికి చెప్పకు. నాన్నకి కూడా చెప్పవని నాకు తెలుసులే. పరువు తక్కువ కదూ. పాతికేళ్ళ తేడాతో ఎన్ని మార్పులో చూసావు కదమ్మా, భాష మారింది. భావం మారింది. ఆహారం మారింది. నేను మారను అంటే కుదరదమ్మా యిక్కడ. మెడ మీద కత్తి పెట్టుకుని మరీ మారాలి. పొరుగు దేశంలో కూర్చుని నేను నాదేశం అంటూ దేశభక్తి అంటే కుదరదమ్మా ఇప్పుడు మానవుడు విశ్వ మానవుడు. గీతలు గీసుకోవడం అస్సలు కుదరదు. కాకపోతే గీతలు దాటడానికి రూల్స్ రాత కోతలు ఉంటాయి నీకెంతో ఇష్టమైన రాఖీ కూతురు తీసిన రాజీ సినిమాలో ఆయ్ వతన్ పాట విను. దేశమును ప్రేమించుమన్నా గేయాన్ని గుర్తుకు తెస్తుంది. రెండూ ఏ దేశం వాళ్ళైనా పాడుకోగల్గిన గీతాలు. నాదిపుడు ఠాగూర్‌కి ఉన్నట్టు విశ్వ ప్రేమ.

ఈ మధ్య ఏమీ తోచక మాట్లాడేవాళ్ళు లేక పాకిస్తానీ వాళ్ళ హమ్ సఫర్ సీరియల్ సిరీస్ చూసాను. ఆ అమ్మాయి కిజార్ యెంత గట్టి అమ్మాయి తెలుసా. రేపు నీకేదైనా అయితే నేను ఒంటరిదాన్ని అయిపోతే జీవితంలో ఒడిదుడుకులొస్తే ఆ అమ్మాయంత గట్టిగా నిలబడాలని అనుకున్నాం కూడా ! నోటికి ఏదొస్తే అది మాట్లాడమే అని నువ్వు గట్టిగా కూకలేస్తే వినడం నాకొక సరదా అమ్మా ! మరి నువ్వు సర్జరీ చేయించుకోవడం ఆలస్యం చేస్తే ఏ కేన్సరో అయితే ఏమిటి పరిస్థితి చెప్పు. అందుకే ఇలా చెపుతున్నా. ఆరోగ్యంతో ఆటలాడవద్దు మరి. చెప్పినమాట వినాలి మా అమ్మ కదూ ! చదువుకుంటూ నవ్వేసుకుంటావులే, నాకు తెలుసుగా.

అన్నట్టు అప్పుడప్పుడు పుస్తకాలు చదువుతున్నా కూడా. వచ్చే ఏడాది పెన్ వరల్డ్ వాయిసెస్ ఫెస్టివల్‌లో జాయిన్ అవ్వాలని అనుకుంటున్నా. ఇంటర్నేషనల్ లిటరేచర్ ఫెస్టివల్ లో హ్యూమన్ రైట్స్ ఫోకస్ చేస్తూ నిర్వహిస్తారట. ఈ ఏడాది జరిగినప్పుడు హిల్లరీ వచ్చారు. ఆమె ఎంత చక్కగా మాట్లాడారనుకున్నావ్. ఈ ఏడాది కొత్త గొంతుకలు వినిపించడానికొక ఛాన్స్ దొరుకుతుందేమోనని వెయిట్ చేస్తున్నా. ఛాన్స్ వస్తే మనదేశం గురించే మాట్లాడతాను గృహ హింస, లైంగిక వివక్ష గురించి వ్రాసుకోవడానికి స్వేచ్ఛనిచ్చి కులం, మతం లాంటి నిషేధిత అంశాలతో కథలు గట్రా రాకూడదని బిర్రబిగదీసుకు కూర్చున్న పత్రికలు కొన్ని తెల్లారి లేస్తే అదే వార్తలను ప్రముఖంగా ప్రచురిస్తాయి. సాహిత్యం ఆ విషయాలను నోట్ చేయకూడదని ఆంక్షలు విధిస్తుంది. రాజకీయ రాబందుల గూళ్ళల్లో కులం, మతం గుడ్లు పెడుతున్నాయి. పీక్కూతినడానికి ఇవి చాలవు. ఆకలి జ్ఞానం రోగం యేపాటివి చెప్పు. ఎక్కడ చూసినా భావ స్వేచ్ఛ అలా వర్ధిల్లుతూ వుందని నలుగురం కూర్చుని ఉన్నప్పుడు చెప్పుకుని నవ్వుకుంటున్నాం.

బాబాయి కూతురు ఇక్కడ ఎమ్మెస్ చేయడానికి తయారవుతున్నానని చెప్పింది. ఇక్కడికొస్తే లైఫ్ బాగుంటుందన్న భరోసాలేదు. మంచితనమూ లేదు గట్టిదనమూ లేదు. ఇన్నింటిమధ్య సంపూర్ణత్వం ఆశించడం ఫూలిష్‌గా ఉంటుంది అని చెప్పలేకపోయా. గారాబంగా పెరిగిన చెల్లి ఇక్కడ నెగ్గడం కష్టం. కష్టాలే కదా ఎలాగోలా పడదాము అనుకుంటే రావచ్చు. అప్పులు చేసి రావద్దని చెప్పు. మన ఖాళీ గిన్నెలను డాలర్‌తో నింపుకోవాలని మాత్రం రావద్దు అని ఈసారి నేనే ఫోన్ చేసినప్పుడు చెపుతాలే. నువ్వు చెపితే మా పిల్ల వెళితే మేము బాగుపడతామని యిష్టం లేక ఇలా చెపుతుందని పిన్ని బాబాయి అనుకుంటారు.

నిజంగా ఇక్కడ ఏమీ ఆశాజనకంగా లేదమ్మా, హెచ్ వన్ బి వుంది కదా అనుకుంటే సరిపోదు. వర్క్ లోడ్‌తో చిత్ర హింస అనుభవిస్తూ మూడు నెలలకోసారి కాంట్రాక్ట్ జాబ్ పూర్తై క్రెడిట్ కార్డులతో నెట్టుకొస్తూ వుంటారు. అక్కడేమో సిటీలో మంచి లొకాలిటీలో అమ్మ నాన్నలకు ఫ్లాట్, కారు

ఇవ్వాలి. ఇక పెళ్లి కోసం ఓ ముప్పై లక్షలు సంపాదించుకోవాల్సి వచ్చే ముప్పై యేళ్లు దాటేసిన బాల్డ్ హెడ్ యువకులు వాళ్ళతో యవ్వనోద్రేకంతో జతకట్టే అదే పరిస్థితిలో వుండే యువతుల గురించి మీకేం తెలియొద్దు. డాలర్ల కలలు కనండి. కలలు కంటూనే ఉండండి.

ఫోన్ ఆన్సర్ చేస్తే జాబ్ గురించి మాట్లాడాల్సి వస్తుందనో తల్లిదండ్రులు డబ్బులు పంపమని సంకేతం ఇస్తారనో చూసి కూడా చూడనట్టు నటిస్తూ కోపం అసహనంతో తమని తామే తిట్టుకుంటూ విసుక్కుంటూ తరువాత పశ్చాత్తాప పడుతూ బతుకు బరువీడుస్తున్న పిల్లల గురించి ఆలోచించాలి. దూరపు కొండలు నునుపు అని పిల్లలకు ఆశలు రేపొద్దని చెప్పాలి అంటే ఎంత మొహమాటం లేకుండా ఉండాలి. ఆ మొహమాటం లేకుండానే చెపుతున్నానమ్మా .. నన్ను అనవసరంగా పంపావు ఇక్కడికి. అప్పులు చేసి మరీ పంపావు. కట్టాల్సిన అసలు వడ్డీలు కలల్లో కూడా డాన్స్ చేస్తున్నాయి. బిడ్డ భవిష్యత బాగుండాలని తల్లిగా నువ్వు ఆశ పడటంలో తప్పులేదులే. నా కూతురు గొప్ప చదువులు చదివి వేలకి వేలు డాలర్లు సంపాదిస్తుంది అని చెపుతూ నీ చుట్టుపక్కల అమ్మలక్కల కళ్ళల్లో ఈర్ష్యను చూస్తూ హాయిగా నవ్వుకో.

చాలా నేర్చుకున్నా. జీవితమనే ఆట ఆడాలనుకున్నప్పుడు ఆ ఆట రూల్స్ తెలిసుండాలి. కొట్టడమో, తప్పించుకునే గుంట నక్క తెలివితేటలుండటమో కాదు దెబ్బ తగిలితే ఓర్చుకోవడం తట్టుకోవడం తెలియకపోతే యీ ఆట ఆడలేమని తెలుసుకున్నాను. పోరాటమంటే ఏమిటన్నది ప్రతిక్షణం నిన్ను చూసి నేర్చుకున్నదాన్ని కదా మరి.

ఒకటి చెప్పనా అమ్మా ! ఏనుగు అంబారీ చూడటానికి గొప్పగానే ఉంటుంది. ఏనుగెప్పుడు సహనం కోల్పోయి చిందులు తొక్కుతుందోనని భయపడుతూ జారీ పడిపోకుండా పట్టుకుని కూర్చోడం యెంత కష్టమో అంబారీ లో కూర్చున్న వాళ్ళకి తెలుస్తుంది. అచ్చు అలా ఉంటుంది ఇక్కడ మా బతుకు. నా చిన్నప్పుడు ఏనుగు సవారీ చేయడానికి సరదా పడుతున్న నన్ను యెక్కించి ఆ ఏనుగెనుక నడుస్తూ జారిపడిపోతాననే భయంతో ఆ వెనకనే నడిచావు చూడు. అదే గుర్తుకొస్తుంటుంది నాకు. ఇప్పుడు కూడా నేను పడిపోతే పట్టుకోవడానికి నువ్వు ఉండాలి. వడ్డీల సంగతి పక్కన పెట్టి సర్జరీ చేయించుకో, ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో, ఇక ఇంతకన్నా ఎక్కువ ఆశలు పెట్టుకోకు. నిన్ను బ్రతికించుకోవడానికయినా కార్పొరేట్ డాక్టర్స్ ధనదాహం తీర్చడానికి నేను నిత్యం కష్టం ముల్లుతో గుచ్చుకుంటుంటానులే . బెంగపడకు, మనుషులకు విలువలను డామినేట్ చేసే అవసరాలు చుట్టుకుని ఉన్నంత కాలమూ విలువలు వలువలూడ్చినంత తేలికగా ఊడ్చి పారేయడమే.

కొన్ని నిజాలు తెలిస్తే ఏడ్చి ఏడ్చి ఎండుకొమ్మలా పెళ్ళున విరిగిపోతావని నా భయం. అందుకే నీకు ఏమీ చెప్పను. అయినా నీ వద్ద ఏ రహస్యాలు వుండవు కదా, అందుకే కొన్ని మాములుగా కొన్ని అసహనంగా కలగాపులగం చేసి కక్కుతున్నా. ఎవరికీ చెప్పుకోలేకపోతే ఎవరి భుజమూ ఆసరాగా ఓదార్పుగా లేకపోతే మానసిక రోగాలు వస్తాయని నువ్వే చెప్పావుగా. ఈ దేశం ఎప్పుడు తల్చుకుంటే అప్పుడు పొమ్మంటేనూ పోనీ ఎప్పుడైనా నేను రావాలనుకుంటేనూ నాకంటూ ఒకరుండాలి కదమ్మా. నీకన్నా గొప్పగా నాకెవరు ఉన్నారని. ఏడుపొస్తుంది. రెక్కలు కట్టుకుని వచ్చి నీ వొడిలో పడుకుని తనివితీరా ఏడవాలని ఉంది. ఉంటానమ్మా ..నీ దీప.

PS: కేవలం పదిహేనువందల డాలర్ల కోసం నీకు సర్జరీ చేయించడానికయ్యే ఖర్చు కోసం ఎప్పుడూ మీరు అతిశయంగా చెప్పుకునే కులం తొడుక్కున్న నేను మీరు తీసి తీసి పడేసే ఓ కులం తక్కువాడి కింద నెలరోజులు నలిగిపోయాననే నిజం నీకు తెలియాల్సిన అవసరం లేదు. కూటికి పేద కానీ కులానికి పేద కాదుగా. రోగం నయం చేయించుకోవడానికి డబ్బులు లేకపోతే చస్తాను. ఎప్పుడైనా చచ్చేదిగా అని స్టాక్ డైలాగ్ చెపుతావని నాకు తెలుసు. నువ్వు లేకపోయాక మా అమ్మ ప్రాణం ఖరీదు కొన్ని వందల డాలర్లేనా అని ముందు ముందు నేను సిగ్గుపడాల్సి వస్తుందేమో మరి. అందుకే తెగింపు కొచ్చేసాను. కాస్తంత భక్తి నేర్పిన జ్ఞానం కళ్ళల్లో తడి లోపలెక్కడో దాగినట్టే వున్నాయి. ఎప్పుడన్నా కాసేపు ఏడ్చి తెరిపిన పడతాను. కొద్దిగా ఊహించుకుంటే నువ్వు లేనప్పటి దుఃఖం కన్నా చిన్న దుఃఖమే కదా ఇది అనుకుని ఊపిరి పీల్చుకుంటాను.

◆◆◆

అని లెటర్ ముగించి సెండ్ చేయబోయి ఆపేసి కొద్దిగా ఆలోచించింది. అమ్మకి ఈ విషయం తెలియాల్సిన అవసరమేముంది అనుకుని వెంటనే ఆఖరి పేరా తుడిచేసి.. సెండ్ చేసి భారంగా నిట్టూర్చింది. ◆

## తెల్ల పదం!!

- సడ్లపల్లె చిదంబరరెడ్డి
9440073636



కీర్తుల ట్యాగుల్ని తగిలించుకొన్న కార్తులన్నీ
తెల్లపదం పాడి నల్లని మోసాల మేఘాలై
పై బాటలు పట్టి వేరెక్కడికో వెళ్లి పోతే
కలల సీమల మొలకల పొలాలన్నీ
నూనెలందని చీకటి దీపాల రూపాలౌతాయి!!

తేనెబంకా ఆకుముడుతా పీడింపుల చీడ మూకలకు
ఎండిన పైర్లే ఆనందాల ఆహారాల సంక్రాంతవుతుంది
రైతు జాతి ముఖం మాత్రం....
ఆకులు రాలి కొమ్మలు కూలి పక్షులెగిరి పోయిన
నిరాశా నిట్టూర్పుల మోడు చెట్టవుతుంది!!

ఏళ్ల తరబడి తపస్సులు చేసినా పచ్చని వరాలందని
అనామక సన్యాసుల మందల్లా
ఎటు చూసినా కనిపించే బోడి కొండల మీద
నిస్తేజంగా పండుకొని తడిలేని నోళ్లతో తొండలు
కరువుల్ని ఆవలిస్తుంటాయి!!

ఒంటరి తనాన్ని భరించలేక ఎడారివంటి ఆకాశంలో
సూర్యుడు భగ భగా మండి ఎండపొడై రాల్తుంటాడు!!
అన్నింటికీ సాక్షీభూతమైన కాలం ఏమీ పట్టనట్టు
మెల్లగా సాయంకాలం వైపు జారుకొంటుంది!!

గతాన్ని కబళించిన అనుభవాల్తో వర్తమానాన్ని దిగమింగి
భవిష్యత్తులు చెప్పడానికి తీతువులూ గుడ్లగూబలూ
బీళ్ళ నోళ్ల చీకటి బొరియల్లో చేరి తమదైన భాషకు
పాత పదాల్నే సరికొత్తగా ఏరుకొంటాయి!! ◆

## హరిత గాథా వింశతి

- రామ్‌దాస్ టంగుటూరి
9986282507

ధరణి జనితపు దివ్వెలం.. హరిత వర్ణపు వెలుగులం
ఎండ వేడికి వాన ధాటికి... మొలకలెత్తిన తరువులం
దిక్కులన్నీ పిక్కటిల్లే..... గాలి ఘూతపు సడుల కోర్చి
రివ్వుమంటూ రెక్కలిప్పే.... శుక పికాలకు దడులు పేర్చి...
గ్రీష్మ తాపపు తేదనలతో... తల్లడిల్లే బాటసారికి....
చల్లని వింజామరలతో.... సేదతీర్చే సేవచేసి....
బుగ్గి చేసే బొగ్గుపులుసు వాయువులని...
నిగ్గు తేల్చి ఉగ్గ పీల్చి... ప్రాణవాయువు సాయమిచ్చి
ప్రాణికోటికి ఆయువిచ్చే... ప్రకృతి సంభూతులం..
ఇంటిలోపల కలపలం.. ఇంటి బయటకు తలుపులం..
ముగ్గు పేర్చిన ముద్దు వాకిట... ముగ్ధమైన గడపలం..
కవికులానికి... కవన గళానికి... కాగితమై ఊతమిచ్చి...
కావ్య కన్నిక పురుడు పోసే దివ్య యజ్ఞపు సమిధలం..
గాలిలో తేలాడిపోయే.. మేఘమాలిక ఇలను దించి
ఆర్తితో అల్లాడిపోయే....జీవకోటికి వాన నీటిని కానుకిచ్చే
భాగీరధి భ్రాతలం..దాతలం...



తరువు నేడు బరువు ఐతే...బ్రతుకు తెరువుకు కరువు రాదా...
పచ్చ రంగే పలచబడితే... పృథ్వి మనుగడ జటిలమవదా...
చెట్టు నరికే చెడు సంస్కృతి.. మంచికోసం మార్చుకుందాం...!!
మక్కువతో మొక్కనాటి.... చిక్కులన్నీ తీర్చుకుందాం...!!! ◆



# భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం - గిడుగు స్ఫూర్తి

- అప్పిరెడ్డి హరినాథ రెడ్డి
99639171

గిడుగు రామమూర్తి పంతులు అనగానే వ్యవహారిక భాషోద్యమం అప్రయత్నంగా స్ఫుర్తిస్తుంది. కొందరికే పరిమితమైన గ్రాంథిక భాష నుండి సాధారణ ప్రజలు ఉపయోగించే వ్యావహారిక భాష కోసం తన జీవితమంతా గిడుగువారు కృషిచేసారు. నేడు అన్ని వర్గాలకు విద్య, విజ్ఞానం అందుబాటులోకి రావటానికి వ్యావహారిక భాషోద్యమం ప్రధానపాత్ర పోషించింది. గిడుగు రామమూర్తి పంతులు వ్యావహారిక భాషోద్యమానికే కాక భాషాప్రయుక్త రాష్ట్రం నిర్మాణం కోసం విశేష కృషి చేసాడు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఉండిన తెలుగు ప్రాంతాలు విద్య, ఉద్యోగ, సాంస్కృతికంగా నిర్లక్ష్యానికి గురయ్యేవి. తెలుగు ప్రాంతం ఉందనే స్పృహ కూడా బయటి ప్రాంతాలవారికి ఉండేవి కాదు. తెలుగు వారిని కూడా మద్రాసీలుగానే పరిగణించేవారు. బెంగాల్ విభజనతో దేశమంతా రాష్ట్రాల ఏర్పాటు విషయమై చర్చ సాగింది. భాషాప్రయుక్త రాష్ట్రాల భావనలు బలపడినాయి. 20వ శతాబ్దం ప్రారంభం నుండే ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు విషయమై అడపాదడపా వినిపిస్తున్నా 1911లో జొన్నవిత్తుల గురునాథం, ఉన్నవ లక్ష్మీనారాయణ, చెట్టి నరసింహారావులు తెలుగు ప్రాంతాల చిత్రపటాన్ని రూపొందించడంతో ఆంధ్రరాష్ట్ర సాధన ఉద్యమానికి మరింత స్పష్టత ఏర్పడింది. 1912లో రామదాసు పంతులుగారు నిడదవోలులో గోదావరి, కృష్ణా, గుంటూరువాసుల అఖిలాంధ్ర సమావేశం ఏర్పాటు చేసారు. 1913 మే 26న బాపట్లలో ఆంధ్రరాష్ట్ర ప్రథమసభ జరిగింది. ఆ సభలోనే ఆంధ్రమహా సభగా రూపుదిద్దుకొంది. ఆంధ్రరాష్ట్ర ఉద్యమ ప్రారంభరోజులలో దేశవ్యాప్తంగా సహాయ నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహం తదితర ఉద్యమాలు తీవ్రమయ్యాయి. ఆంధ్ర ప్రాంతీయులు కూడా జాతీయోద్యమంలో భాగస్వాములయ్యారు. ఆంధ్రరాష్ట్ర ఉద్యమం కొంత మందగించింది. 1934 నుండి తిరిగి పుంజుకుంది.

గిడుగు రామ్మూర్తి పంతులు 1880లో పర్లాకిమిడి మహారాజ కళాశాలలో ఉద్యోగంలో చేరారు. పర్లాకిమిడి సంస్థానంలో నాలుగు వందల తెలుగు గ్రామాలు, రెండు వందల ఒడ్ర గ్రామాలు ఉండేవి. మహారాజ కుటుంబంతో గిడుగువారి కుటుంబానికి సన్నిహిత సంబంధాలు ఉండేవి. గిడుగు సీతాపతి మద్రాసులో డిగ్రి చదివేందుకు మహారాజ కుటుంబం వారే ఉప కారవేతనం అందించారు. 1911లో గిడుగు వారు ఉద్యోగం నుండి విరమించారు.

1927లో బ్రిటీష్ వారు సైమన్ కమీషన్‌ను రాష్ట్ర పునర్నిర్మాణ సమస్య పరిష్కారం కోసం నియమించారు.

1928లో అఖిలపక్ష మహాసభ వారు నియమించిన మోతీలాల్ కమీషన్ భాషాప్రయుక్త రాష్ట్రాలకు ఆమోదించింది. ఒరిస్సా రాష్ట్ర ఏర్పాటుకు గల అంశాలను ఈ కమీషన్ పరిశీలించింది. ఈ సందర్భంగా పర్లాకిమిడి సంస్థానాధీశులు గాంగ వంశరాజులని, తెలుగువారని కేవలం రాజకీయంగా ఒఢ్రులతో సన్నిహిత సంబంధాలు ఉన్నాయని గిడుగు వివరించాడు. పర్లాకిమిడి ప్రాంతాన్ని ఆంధ్రప్రాంతంలో భాగం చేయాలని కమీషన్‌ను కోరాడు. రాజకుటుంబం వారికి ఇది నచ్చలేదు. గిడుగువారికి వారితో సంబంధాలు దూరమయ్యాయి. రాజకుటుంబంతో వైరుధ్యం ఏర్పడిన తన ఆశయ సాధన కోసం గిడుగు రామ్మూర్తి పంతులు ప్రజలను చైతన్యవంతం చేయడానికి 'యాంటీ అమాల్గమేషన్ పార్టీ'ని స్థాపించాడు. పర్లాకిమిడి ప్రాంతాన్ని ఆంధ్రప్రాంతంలో కలపాలని గవర్నర్ జనరల్‌కు వినతిపత్రాలు పంపాడు. గండికోట సత్యనారాయణమూర్తి, వాసా సూర్యనారాయణ శాస్త్రి తదితరులు గిడుగువారికి అండగా నిలిచారు.

పర్లాకిమిడి ప్రాంతం పరిశీలనకు 'ఒడోనెల్' ఆధ్వర్యంలో పరిశీలనా సంఘం వచ్చింది. పర్లాకిమిడి రాజులు ఒఢ్ర రాజులుకారని అనేక శాసనాధారాలను కమిటీ ముందుంచాడు. ఈ ఆధారాలను కమిటీ పరిగణనలోనికి తీసుకుంది. పర్లాకిమిడి రాజులు తమ సంస్థానాన్ని ఒరిస్సాలో చేర్చాలని, బొబ్బిలి రాజుల సహకారంతో ఢిల్లీ వైశ్రాయిని సంప్రదించారు. 1932 డిసెంబర్ 24న ఒరిస్సా రాష్ట్రం ఏర్పడుతుందనే ప్రకటన వెలువడింది.

ఈ సందర్భంలోనే పర్లాకిమిడి తాలూకా బోర్డు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో తాలూకా అంతటా గిడుగువారు తెలుగు అభ్యర్థులను నిలబెట్టాడు. పర్లాకిమిడి ప్రాంతాన్ని ఆంధ్రలో కలపాలనే ప్రజాభిప్రాయాన్ని ఈ ఎన్నికల ద్వారా వ్యక్తం చేయాలని పిలుపునిచ్చాడు. రాజ వంశీకులు అనేక అరాచకాలకు పాల్పడిన తాలూకా అంతటా తెలుగు అభ్యర్థులు గెలుపొందారు. గిడుగు సీతాపతి తాలూకా బోర్డు ప్రెసిడెంటుగా, దుక్క రాజన్నరెడ్డి వైస్ ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యారు. ఆ ప్రాంత ప్రజలు ఆంధ్ర రాష్ట్రంలో కొనసాగాలనే ఆకాంక్షలకు ఇది నిదర్శనం.

రాజవంశీయులు 1933లో ఇంగ్లాండ్ వెళ్లి పర్లాకిమిడిని ఒరిస్సాలో భాగం చేయాలని జాయింట్ పార్లమెంటరీ కమిటీని కోరారు. అందుకు ప్రతిగా గిడుగు రామ్మూర్తి పంతులు తన సొంత మొత్తాన్ని వెయ్యి రూపాయలతో పాటు, మరికొంత విరాళాలను సేకరించి 1933 జూన్ 22న సీతాపతిని ఇంగ్లండ్‌కు పంపించాడు. బ్రిటన్ పార్లమెంటుకు పర్లాకిమిడి విషయమై అనేక ఆధారాలను సీతాపతి అందించాడు. దీనితో పర్లాకిమిడి ప్రాంతాన్ని ఒరిస్సాలో కలిపే విషయమై తాత్కాలికంగా నిలుపుదల చేయగలిగారు. 1934లో రాజవంశీయులు మరోసారి లండన్ వెళ్లి కనీసం 200 గ్రామాలనైనా ఒరిస్సాలో విలీనం చేయాలని కోరారు. ఇందుకు బ్రిటీష్‌వారు సమ్మతించారు.

ఈ నేపథ్యంలోనే గిడుగువారు 1934 సెప్టెంబర్ నెలలో 'ప్రబుద్ధాంధ్ర పత్రిక' లో 'ఎలాంటివారికి రాష్ట్రం సిద్ధిస్తుంది' అనే వ్యాసం రాసారు. అందులో 'ఆంధ్ర నాయకులనేకులు ఆంధ్రరాష్ట్ర సమస్య నుండి దృష్టిని మరల్చి అఖిల భారత విషయములందు నిమగ్నమై ఉండుటయే మన సమస్య వెనుకబడి ఉండుటకు కారణం' అని పేర్కొన్నాడు. అదే సమయంలో గిడుగువారు ఉన్నవ వారితో 'జనసామాన్యమునకు అర్థమయ్యేభాషలో దేశ రాజకీయ కార్యకలాపాలన్ని జరుపుట ఆవశ్యకర్తవ్యం. రాష్ట్రాలు శీఘ్రంగా అభివృద్ధి చెందవలెనన్నా రాష్ట్ర భాషల మూలంగానే ఆయా రాష్ట్రాలలో వ్యవహారాలన్నీ జరుపుటతప్ప మరో మార్గంలేదు' అని తెలిపాడు. గిడుగువారి పై అభిప్రాయాలనుబట్టి చూస్తే రాష్ట్రభాషల అభివృద్ధి, భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుపై ఉన్న అవగాహన అర్థమవుతుంది.

1936 ఏప్రిల్ 1న ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటుపై ప్రకటన వెలువడింది. అదే రోజు తెల్లవారుజామున గిడుగువారు డెబ్భైమూడేండ్ల వయసులో, యాభైఆరేండ్ల పాటు నివసించిన పర్లాకిమిడి ప్రాంతాన్ని వదిలిపెట్టాడు. చివరగా రైల్వేస్టేషన్‌లోనూ ఆంధ్రరాష్ట్ర విషయమై ఉపన్యాసం చేశాడు. 'ఒరిస్సా రాష్ట్రంలో కలిసిపోతున్న తెలుగు ప్రాంతం ఆంధ్రులకు దక్కేవరకు మళ్లీ అడుగు పెట్టనని' ప్రతిజ్ఞ చేసి రాజమండ్రికి వెళ్లిపోయాడు. పెద్ద కొడుకు సీతాపతి తప్ప మిగిలిన ముగ్గురు కొడుకులు ఆయన వెంటే వచ్చేశారు.

1936 అసెంబ్లీ ఎన్నికలలో పర్లాకిమిడిలో సీతాపతి పోటీచేయగా డిపాజిట్ కూడా దక్కలేదు. తరువాత కాలంలో మద్రాసు వెళ్లి మ్యూజియంలో ఉద్యోగం కోసం ప్రయత్నించాడు. అది రాకపోవడంతో గూడవల్లి రామబ్రహ్మం

# వంచనా శిల్పం

- మార్ని జానకిరామ్ చౌదరి
9440338303

తరచి తరచి చూసినా
రాజకీయ చరిత్రలన్నీ..
సగటు మనిషి పాలిట
వంచనా శిల్పాలే !
నాలుగున్నర వసంతాలు గడిచినా
గుండెకయిన గాయం పచ్చిగానే ఉంది
రెండుగా చీలిన దేహం
వెచ్చటి నెత్తురు చిమ్ముతూనే ఉంది
'హోదా'లు 'ప్యాకేజీ'లంటూ
పిడికెడు మట్టిని, చెంబుడు నీళ్ళనూ
నీ సమాధికోసం సిద్ధం చేస్తాడు
మన ఒంటిమీది చర్మాన్నే ఒలిచి
మనకే జిఎస్‌టి బ్రాండ్
ఉన్నికోటు తగిలిస్తాడు
డిమానిటైజేషన్ పేరుతో
కాళ్ళకింద నిప్పుల తివాచీ పరచి
జీవితాల్ని వెలిగిస్తున్నానంటాడు
మసీదులూ, మందిరాల పేరుతో
నెగళ్ళు సెగళ్ళను రగిలిస్తూ
రావణ కాష్ఠాలు రాజేస్తుంటాడు
సంపదను తన్నుకుపోతున్న
రాబందుల దోపిడీకి గేట్లు తెరిచి
పంజరంలో గింజలు తింటున్న



పక్షులపై తుపాకి గురిపెడతాడు
అర్ధరాత్రి అప్రజాస్వామికంగా
దేహం నుండి తలను వేరుచేసినట్టు
అడ్డంగా అడ్డగోలుగా చీల్చినప్పుడే
వీళ్ళ 'వంచనా శిల్పం' బయటపడింది
ప్రత్యేక హోదాను తుంగలో తొక్కి
'పేకేజి' అని పేరు మార్చినప్పుడే
ఊసరివెల్లి తనానికి తెరలేచింది
కాషాయ కషాయాన్ని కక్కుతూ
మతోన్మాద విషబీజాల్ని నాటుతూ
మనుగడ సాగించే మనుధర్మ నియంతల
అస్తిత్వాన్ని బద్దలు చేయాలి
కేంద్రం నయవంచనకూ,
రాష్ట్రం విభజనకూ మధ్య
వంచిత ప్రజ గుండెల్లో
ఎగసిన అగ్నిగోళం
శతఘ్నిలా దూసుకెళ్ళి
చీకటి చెక్కిన వంచనా శిల్పాన్ని
నిలువునా దహించాలి. ◆

---

సూచనతో కొన్ని సినిమాలలో వేషాలు వేసాడు. ఒక సినిమాలో పర్లాకిమిడి ఎన్నికల ఇతివృత్తంగా కూడా వెలువడింది.

1932లో సీతాపతిని ఉద్యోగం నుండి తొలగించినా, గిడుగు కుటుంబాన్ని రాజద్రోహులుగా చిత్రించినా ఎన్నో అవమానాలు ఎదుర్కొన్నా, ఆర్థికంగా చితికిపోయినా మొక్కవోని దీక్షతో తెలుగు ప్రాంతాల ఐక్యత కోసం ఉద్యమం నడిపిన గొప్పదనం గిడుగు రామ్మూర్తి పంతులకే దక్కుతుంది. కనీసం తెలుగు వారికి 400 గ్రామాలైనా దక్కాయి. ఈ మేరకు తెలుగు గ్రామాలను నిలుపుకోవడమన్నా అది గిడుగువారి త్యాగఫలమే అవుతుంది. 1936లో శ్రీపాద వారు ప్రబుద్ధాంధ్ర పత్రికలో 'మూడు లక్షల ఆంధ్రులైన సమ్మతిని, తీవ్రమైన ప్రాభవ్యాన్ని కేంద్రీకరించి ఏకముఖం చేసి రోశాగ్నిగా మార్చి పంతులు గారు దానిని ఆంధ్రుల మధ్య ఉంచారు. భావదాస్యంతో మగ్గిపోతున్న ఆంధ్రులు దీనిని ఎంత వరకు అవగాహన చేసుకోగలుగుతారో, ఇప్పుడు ఏమి చేస్తారో చూడవలసి ఉంది' అని పేర్కొన్నాడు.

గిడుగు రామ్మూర్తి పంతులు భాషారాష్ట్ర స్ఫూర్తిని తెలుగు ప్రజలు స్వీకరించి వుంటే 1953లో బళ్లారి, హోసూరు, మద్రాసు తదితర ప్రాంతాలను ఆంధ్రదేశం పోగొట్టుకొని వుండేది కాదు. 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అన్ని ప్రాంతాల సమానఅభివృద్ధి, పరస్పర విశ్వాసం, భాషాభిమానం పెంపొం దింపజేసి ఉంటే 2014లో విభజన జరిగి వుండేది కాదు. కనీసం ఇప్పటికైనా ప్రస్తుతం మనుగడలో ఉన్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కలిసి ఉండేందుకు అనువైన పరిస్థితులు కల్పించాలని ప్రభుత్వాల్ని నిలదీయాల్సిన బాధ్యత గిడుగువారి వారసులుగా, భాషాభిమానులుగా మనందరిపై ఉంది. ◆




# ముప్పై కావ్యాల విలక్షణ పరిచయం

- శ్రీరామ్
9963482597

రాధేయ ఈ మూడు పదులు ముప్పై కావ్యాలన్న పుస్తకం ఎందుకు రాశాడన్నది నాకొచ్చిన మొదటి సందేహం. 1988 నుండి 2017 దాకా, అంటే ఖచ్చితంగా ముప్పై ఏళ్ళ కాలంలో ఉమ్మడిశెట్టి అవార్డు వచ్చిన కావ్య సంపుటాల మీద విశ్లేషణాత్మక వ్యాసాలతో ఈ పుస్తకం అచ్చేశారు. 31 వ సంవత్సరంలోకి అడుగేస్తూ రాధేయ ఇంటిపేరును సాహిత్యలోకంలో చిరస్మరణీయం చేసిన అవార్డిది. ఈ కావ్యాలు రాసిన కవులందరూ ఈనాడు సాహిత్య వినీలాకాశంలో ప్రకాశవంతమైన తారల్లా వెలుగొందుతున్న వాళ్ళు. చాలామందివి తొలి సంపుటాలు కూడా. వాళ్ళందర్నీ గుర్తించి సత్కరించడం రాధేయ చేసిన మంచి పని. ఈ పనులు వ్యవస్థీకృత ప్రభుత్వ అకాడమీలు కూడా నిరాఘాటంగా చేయలేవని కాలం నిరూపించింది కూడా. ఎందుకంటే ఎంతో వైవిధ్యభరితమైన 'అనంతరం' (కోడూరి విజయ కుమార్) వచ్చినపుడో, 'ఎడతెగని ప్రయాణం'(యాకూబ్) ప్రకటించినపుడో, 'గాలికట్ట'(విద్యా సాగర్), ఇంకా మిగతా సంపుటాలు తయారైనపుడు, కాలంతో పోటీ పడి ఆ కావ్యాల్ని ముందుగా గుండెలకి హత్తుకున్నది ఉమ్మడిశెట్టి. ఆ ప్రేమ రాధేయ కీర్తిని అజరామరం చేస్తుంది.

అయితే ఈ ముప్పై పుస్తకాలమీద చాలా సమీక్షలు వచ్చి ఉంటాయి కదా ? మరిప్పుడీ కొత్త ప్రయత్నం ఏమిటి ? అన్నింటిమీదా ఒక్కడే పూనుకుని మళ్ళీ విశ్లేషణ రాయడం సాహసం కాదూ ? ఎందుకు సాహసమంటే ముప్పై పుస్తకాలూ విలక్షణమైన భావజాలాన్ని, లోతైన అభివ్యక్తిని తమదైన గొంతునీ కలిగి ఉన్నవి. సౌభాగ్య మొదలు శ్రీసుధ వరకూ ఎవరికివారు వాళ్ళ వాళ్ళ ప్రతిభాపాటవంతో పాఠకులపై గాఢమైన ముద్ర వేసిన వారే. లేకపోతే ఇవన్నీ ఇంత ఆదరణ పొందేవి కూడా కాదు. మరలాంటివాటిని ఒకేచోట, ఏకబిగిన రాధేయ ఒక్కడే ఆపాదమస్తకం నిర్వచించడం సులువైన పనా? "జాతీయ జండాకి బదులు ఆకాశం నిండా కండోమ్స్ ఎగరేయండన్న" నిర్మలనో, "నువ్ జెప్పిన రజాకార్ల కథలు నను మంటల ఊయలలూపినయ్" అని తైదల అంజయ్య అన్నపుడో మనం ఒక కుదుపుకి గురవుతాం. వాళ్ళగురించి ఈ నాల్గు పేజీలు చాల్లేదనిపిస్తుంది. శైలజామిత్ర 'రాతి చివుళ్ళు' గురించి కూడా కాస్తంత అసమగ్రంగానే ఉంటుంది. ప్రసాదమూర్తి గురించి, మౌళి గురించి, స్వామి నాయుడి గురించి చెప్పినపుడు రచయిత ఆనందాన్ని దాచడం కష్టతరమైన పనే. అంత మునిగి తేలిపోతాడు. వాళ్ళ శిల్ప పరమైన ప్రత్యేకతని స్పష్టంగా వివరిస్తాడు. కన్విన్స్ అవుతాం. తోటపల్లి నిర్వాసిత గాయాన్ని (గౌర్నాయుడు), అనేక సామాజిక రుగ్మతల వికృత రూపాల్నుంచి పారిపోలేనితనాన్ని (ప్రభు) విశ్లేషించినపుడు వీళ్ళిద్దరి కవిత్వంలో ఉన్న బాధ మనకి

తర్జుమా అవుద్ది. కొప్పర్తి, అన్వర్, దర్భశయనం గురించి చెప్పినపుడూ అంతే. వాళ్ళ వాళ్ళ కవితా పంక్తుల్ని ఉటంకిస్తున్నపుడు, వాటిని దాటి వాళ్ళ గురించి ఇంకాస్త తెలుసుకోవాలన్న కుతూహలం కలుగుతుంది. దాన్ని చాలా వరకూ తీరుస్తుంది కూడా ఈ పుస్తకం. కవిత్వం విశ్వజనీనమనే భ్రమలు బద్దలయిన కాలంలో అఫ్సర్ ఇవాళ వచ్చిందంటాడు. నాళేశ్వరంలో వస్తువూ, కవిత్వమూ వేర్వేరుగా ఉండదన్న విచిత్రమైన వాక్యం పక్కనబెడితే, దూదిమేడలోని వినూత్న ప్రతీకల పరిచయం చాలా బాగుంటుంది. కవుల కవిత్వం లానే విశ్లేషకుడి వచనం కూడా చాలా చోట్ల రక్తాన్ని మరిగిస్తుంది. చిల్లర భవానీ దేవి వ్యాసంలో వచన చాయలు కనిపించకపోవడమే కవిత్వానికి గుర్తింపన్న వాక్యం ఆసక్తి రేపుతుంది. కందుకూరి శ్రీరాములి శైలినీ, అభివ్యక్తినీ బాగా వర్ణిస్తాడు. హైద్రాబాద్నీ, ఆశారాజుని ఎందుకు విడదీయలేమో, అవసరంలో అత్యవసరంలో ఈతకోట కవిత్వమెలా పలుకుతుందో, కవిత్వం కానపుడు పాపినేని గారు ఎందుకు మరణిస్తాడో చెప్పిన తీరుకి ముగ్ధులమవుతాం. శిఖామణి జ్వలనాన్ని చాల నేర్పుగా పట్టుకుంటాడు. సుధామని, సౌభాగ్యనీ, దాసరాజు, మందరపు, విద్యాసాగర్, జూపల్లి లాంటి వాళ్ళ కవిత్వంలోని విభిన్నతని, గొప్పతనాన్ని చెప్పే ప్రయత్నం చేస్తాడు. ఇదేం మామూలు విషయం కాదని ఇట్టే తేలిపోతుంది కూడా.

ఒక్కటి మాత్రం నిజం. రాధేయ కన్న బిడ్డల గొప్పతనం గురించి తల్లి తండ్రులు పడే యాతన పడ్డాడు. మావాడు ఇంతవాడండీ, అంతవాడండీ అని మురిసిపోయే పిచ్చి తల్లి మాదిరి కనిపిస్తాడు. సందేహమే లేదు. ఈ కావ్య పరిమళం సామాన్యమైనది కాదు. ఎనిమిది కావ్యాలు రాసినా, ఆరు విమర్శా గ్రంధాలు రాసినా రానంత సంతృప్తిని, ఈ అవార్డు జయపతాకంలా ఎగరేస్తుంది. కావ్యగత లక్షణాలతో ఈ ముప్పై పుస్తకాల మూల ప్రాణాంశ అందినప్పటికీ, చంద్రుడిలోనూ మచ్చలున్నట్టు, ప్రతీ కావ్యంలోనూ ఏదో కొరుకుడు పడనితనం ఒకటుంటుంది, చన్నీళ్ళల్లో మునిగినట్టో, నిప్పుని ముట్టుకున్నట్టో ఒక ప్రత్యేక లక్షణముంటుంది. కొంత ఇలా ఉండకుండా ఉంటే బాగుండేదేమో అని కూడా అనిపిస్తుంది. భాషలోనో, భావ వ్యక్తీకరణలోనో, అలంకార వినియోగంలోనో, వస్తు ఎంపికలోనో, నిర్మాణ పద్ధతుల్లోనో ఆయా కవి ఆయా కాలాల్లో చూపిన ప్రతిభ, ఏదన్నా చేసిన పొరబాటు, కావ్య మూల్యాలు, సరిదిద్దుకోతగినదేదన్నా ఉన్నపుడు అది విశ్లేషకుడు చెప్పి తీరాలి. అదొక్కటి కాస్త ఖాళీగా కనిపిస్తుంది. ప్రతీ వ్యాసంలోనూ వైయక్తికత డామినేట్ చేస్తుంది కనుక కేవలం ప్రశంసే వినబడుతుంది గాని విమర్శ తోచదు. ఇది విశ్లేషణే అని ముందుగానే రచయిత చెప్పినప్పటికీ, విశ్లేషణ విమర్శలో పునాదిరాయి లాంటిదని మరువలేము. ఇన్నేళ్ళ అవార్డు నిర్వహణ చరిత్రలో, అతనెన్నుకున్న జడ్జీల ప్రస్తావన కూడా జోడించి ఉంటే ఇంకాస్త జీవ లక్షణం ఎక్కువగా తొణికిసలాడేది. నిర్వివాదంగా ఉందామనుకోవడమే దీనికి కారణం కావొచ్చు. ఏది ఏమైనా, ముప్పై కావ్యాల్ని పరిచయం చేసే మంచి పుస్తకమిది. ఇన్నేళ్ళ కవితా లోకం పట్ల మనకొక అవగాహన వచ్చేయడం ఖాయంగా ఖాయం. అన్నింటినీ శ్రద్ధగా చదవాల్సిన అవసరమెంత ఉందో నేటి యువకవులకి ఈ పుస్తకం మార్గ నిర్దేశం చేస్తుంది. ఆ కావ్యాల్ని వెతుక్కునేట్టు చేస్తుంది. అపురూపమైన పుస్తకాలు దొరకబుచ్చుకోవడం ఎంత కష్టమైనా, ఆ పని మరెంతటి రసాత్మక అనుభూతిని మిగుల్చుతుందో తెలియజేస్తుంది. అవార్డీల మనోగతాలూ ఆసక్తిగా చదివిస్తాయి. రాచపాళెం గారన్నట్టు ఒక్కో కావ్యం గురించి ఒక్కో విమర్శకుడి చేత వ్యాసాలు రాయించి ఉంటే ఆ అనుభవం ఇంకోలా ఉండేది, కాదనలేం. కానీ ఈ పుస్తకం నిండా రాధేయ అనంతమైన ప్రేమ పరుచుకుని ఉంటుంది. అది మాత్రం అంత తేలిగ్గా దొరికేది కాదు. ఆయనకా ముప్పై పుస్తకాలమీద, మనకాయన మీద. అదొక మత్తు లాంటిది. అనుభవించి తీరాల్సిందే. ♦

**రచనా సూత్రాలు**

'చిన్న కథకి ప్రధాన లక్షణం కేంద్రీకరణం. కథలో ప్రతిచిన్న విషయమూ ఆ కేంద్రాన్ని సూచిస్తూ వుండాలి. కథానికకు కేంద్రంగా ఒక విస్పష్టమైన సంఘటన, ఒక విచిత్రమైన వ్యక్తి, ఒక మన్నస్థితి, రెండు స్వభావాల తారతమ్యం వల్ల వచ్చే నాటకీయత ఇలా ఏదో ఒకటి వుండాలి. కథానిక ఒక మెరుపువంటిది. దానిలో వేగం ప్రధానం. వైచిత్రి కథానికకు ప్రాణం. కథానికకు ప్లాట్ అనేది అనవసరమని నా అభిప్రాయం. శిల్పం మీద దృష్టిని కేంద్రీకరించి మరీ రాయాలి. లేకపోతే కళ్లెంలేని గుర్రంలా అది తిరిగి తిరిగి, దిక్కులేని ప్రదేశాన్ని చేరుకుంటుంది.

**- పాలగుమ్మి పద్మరాజు**

# చీకట్లో చిగురించిన దేశం

- మల్లారెడ్డి మురళీ మోహన్
8861184899



అర్ధరాత్రి చీకట్లో చిగురించిన దేశం
దశాబ్దాలు దాటుతున్నా వెలుగు చూడలేకుంది

నాలుకలు ఆయుధాలుగా చేసుకున్నా నాయకుల
ఉచిత వాగ్దానాల బొంకుల దిబ్బమీద
మూడు కాళ్ల కుర్చీపై ప్రజాస్వామ్యం మూల్గుతోంది

ధరలు సవారీ చేస్తున్న రూపాయి బండి చక్రాల కింద
సామాన్యుడి కలలు నలిగి నజ్జవుతున్నాయి

వారాంతాలు మత్తెక్కి మైకంలో మునిగిపోయి,
అంకెల బందీఖానాలో ఆధునిక బానిస జీవితాలు
చిక్కుకున్నాయి

కార్పొరేట్ పంజరాల్లో మెట్రో సంకెళ్లు తగిలించుకున్న
కాందిశీక చిలుకలు సొంత పలుకు మర్చిపోయినవి

రద్దీ మాల్స్ అన్నీ మధ్య తరగతి నిట్టూర్పుల్లో మునిగి,
నిరాశా పూరిత జీవికలు వంచింపడుతున్నాయి

ఏకత్వం ముసుగులో భిన్న వాదాలు గుద్దులాడుతుంటే
పాడుబడ్డ పాళీల కంచె మధ్య
నవ్వని నాగలి సమ్మెకు దిగింది

అకాల చినుకులు మురుగు కాల్వల రహస్యాలు విప్పుతుంటే
కీటక జాతికీ, మానవ జాతికీ మధ్య నిత్య సమరంతో
నగరం ఎప్పటికప్పుడు ఓ కొత్త హైస్‌ని ప్రసవిస్తోంది

దశాబ్దాలు దాటుతున్నా వెలుగు చూడని దేశం
ఎన్నికల చదరంగంలో అయిదేళ్లకోసారి ఓడిపోతూనే ఉంది

◆

---

# నానీల సేద్యం

- సుమనశ్రీ
9642390940



గెలిపించండని
రోడ్లూడుస్తుంటే
శభాషని ఓటేశాం
దేశాన్నూడ్చేశాడు

క్రూర మృగాలు
అడవిలో
అంతరిస్తున్నాయి
సమాజంలో సంచరిస్తున్నాయి

యంత్రం ఒక విప్లవం
కూలీల గొంతుకు
ఉరితాళ్ళు కూడా
అదే పేనింది

బుర్రలో కవిత్వం
ఆరని లాంతరు
భూగోళానికి చెట్లు
పచ్చాని నెత్తురు

వ్యాపారం
మనిషి వ్యక్తిత్వమైంది
మద్యం పద్యం మానం మట్టి
అంతా సరుకే

అడవిలో పెరిగిన
మనిషి పాస్టెన్స్
మనిషిలోని అడవే
ప్రెజెంట్ నాన్సెన్స్

వేల పేజీల సందేశం
కొన్ని అక్షరాల్లోకి
నింపడం
నానీల సేద్యం

పిడికెడు మట్టి
పిసరంత విత్తు
వృక్షం పూలు ఫలం
మట్టి పరుసవేది

మధ్యతరగతి జీవి
బ్రతుకంతా యుద్ధ భూమిలో
విశ్రాంతి
రుద్ర భూమిలో

చెవి పోటుతో వెళ్లి
గుండె పోటుతో వచ్చాడు
వెళ్ళింది
కార్పొ'రేటు' ఆస్పత్రి

నాలుగు వాక్యాల
వంతెనపై
నగ్న సత్యాల మార్చ్
నానీ యాత్ర

◆

కథ

# దేవుణ్ణి చూసినవాడు

- దేవరకొండ బాలగంగాధర తిలక్





01.08.1921 - 30.06.1966

గవరయ్య పెళ్ళాం లేచిపోయిందన్న వార్త ఊరు ఊరంతా ఉత్సాహంగా వ్యాపించింది. అంతకుముందు రోజునే చైనా ఇండియా సరిహద్దులలో దురాక్రమణ చేసిందనీ, యుద్ధం జరుగుతున్నదనీ వచ్చిన వార్త చటుక్కున అప్రధానమై పోయి అందరూ మరచిపోయారు కూడా. ఆడది లేచిపోవడంలోని విశిష్టతని ఈ వూరువారొక్కరే గుర్తించారా అనిపిస్తుంది యింత తెలుగుదేశంలోనూ !

రోడ్ల కూడలిలో, కాఫీ హోటలులో ( ఆ వూళ్ళో ఒకటే వుంది) పొలం గట్లనీ, పంచాయితీ బిల్డింగ్ దగ్గరా పురుషులూ; పెరటి గోడల దగ్గరా, బావులూ, నీలాటి రేవుల దగ్గరా ఆడవాళ్ళూ ఈ విషయాన్నే చిత్ర విచిత్రంగా చెప్పుకుంటున్నారు. వట్టి లేచిపోవటమే అయితే యింత సంచలనం కలిగించకపోను; అందులోను ఎందుకూ పనికిరాని ఎదురింటి అరుగుమీది మిషన్ కుట్టుపనివాడితో లేచిపోవడమే మరీ విడ్డూరంగా వుంది. ఇంతకన్న మరో ఏ పెద్దమనిషితో లేచిపోయినా యింత అప్రదిష్ట ఉండకపోనని వూళ్ళో అనుభవజ్ఞులైన పెద్దలు అనుకున్నారు. చాలామంది యువకులు గవరయ్య భార్య తమని నిష్కారణంగా అవమానించినట్టూ, అన్యాయం చేసినట్టూ బాధపడ్డారు.

“వాడిలో ఏం చూసి లేచిపోయిందత్తా” అని మూడోసారి అడిగింది తన అత్తని ఒక పడుచు తన కుతూహలం ఆపుకోలేక.

“పోనీ నువ్వే వాడితో లేచి పోకపోయావూ నీకు తెలిసొచ్చును” అంది అత్తగారు విసుగుతో, కోపంతో.

“గవరయ్యకి బాగా శాస్తి అయ్యింది” అని ఏకగ్రీవంగా ఆబాల గోపాలమూ తీర్మానించారు. గవరయ్యను చూసి జాలిపడినవాడూ సానుభూతి తెలిపినవాడూ ఒక్కడూ లేడు.

గవరయ్య అంటే ఆ వూళ్ళో అందరికీ అసహ్యం. మనిషి కూడా నల్లగా ఎగుడు దిగుడుగా వుంటాడు. మొహంమీద స్ఫోటకం మచ్చలు, పెదాలు లావుగా మోటుగా వుంటాయి. కనుబొమ్మలు గుబురుగా గొంగళీ పురుగులు అతికించినట్లు వుంటాయి. ఊరికి శివారున వున్న పెద్ద పెంకుటింటి లోగిలిలో గవరయ్య వుంటాడు.

“నాకు తెలుసును, యిలాంటిదేదో జరుగుతుందని” అన్నాడు కన్నులరమూసి అవధాని. అవధాని ఆ వూళ్ళో ధర్మకర్త.

మునసబు చలపతీ, కరణం నరసింహమూ తల వూపారు. దాంతో మరికాస్త ఉత్సాహంతో

ఉపనిషద్వాక్యంలాంటి పై వాక్యానికి వ్యాఖ్యానం చెప్పాడు ధర్మకర్త.

"వేణు గోపాలస్వామి వూరికే పోనిస్తాడా? ప్రథమ కళత్రం చావనే చచ్చింది. ఇంక ఈ రెండో ఆవిడ చావుకన్న ఘోరమైన పని చేసి వూరుకుంది. ఒక్క ధర్మ కార్యం చేశాడా? ఒక్క మంచి మాట చెవిని పెట్టాడా"?

మున్సబు చలపతి చేతికర్రను నేలమీద తాటించి అన్నాడు "ఒక్కరినీ దగ్గరకు రానిచ్చాడా, కర్కోటకుడండీ యీ గవరయ్య. ఎంత అహం ఎంత పొగరు...."

"పాపపు సొమ్మండి పాపిష్టి ఆర్జితం! దాని ఫలితం వూరికే పోతుందా? మొన్న కుర్రాళ్ళందరూ వెళ్ళి భజన చందాకి ఒక్క రూపాయి - ఒఖ్ఖ రూపాయి యిమ్మంటే తరిమి కొట్టాడట...." అన్నాడు కరణం.

గవరయ్య యిరవై ఏళ్ళ క్రితం ఇరవై ఏళ్ళనాడు ఈ వూరొచ్చాడు. ఈ వూళ్ళో అతనికో మేనత్త వుంది. తల్లీ తండ్రి లేని అతను యీ మేనత్త దగ్గరకు వచ్చిపడ్డాడు. వస్తూనే కొంత డబ్బు కూడా తీసుకుని వచ్చాడు. ఈ వూరికి రెండు మైళ్ళ దూరంలోనే టౌను వుంది. రోజూ ఉదయమే టౌనుకి వెళ్ళి చీకటి పడ్డాక తిరిగొచ్చేవాడు. కొన్నాళ్ళకి తోళ్ళ వ్యాపారం చేస్తున్నాడని తెలిసి అందరూ "హరి హరీ" అని చెవులు మూసుకున్నారు. మేనత్తతో యిది చాలా పాపమనీ, బెడిసి కొడుతుందనీ చెప్పారు. కాని మేనత్త ఏమీ మాట్లాడలేదు. కొందరు చొరవ చేసి గవరయ్యతో జంతు చర్మ విక్రయం మంచిది కాదని చెప్పారు. "జంతువులేం ఖర్మ మనుషుల తోలునే అమ్ముతాను. మరీ పల్చన కాబట్టి పనికిరాదు కాని" అని సమాధాన మిచ్చాడట గవరయ్య. గవరయ్య ఒంటెత్తు మనిషి, ఎవరితోనూ మాట్లాడడు, కలవడు. అసలు గవరయ్య నవ్వడం ఎవరూ చూడలేదు. అదే కాక గవరయ్యకి "పాపం" "పుణ్యం" అనే భేదాలు వున్నట్టుకూడా తెలియదు.

ఈ యిరవై ఏళ్ళల్లోనూ అతను లక్ష రూపాయలకి పైగా సంపాదించాడని ప్రతీతి. ఊళ్ళో పెద్దలు - ఉదారులూ, ధర్మపరులూ కాబట్టి, అతని పాప వ్యాపారాన్ని క్షమించి అతని శ్రేయస్సుకోరి, అతని ఆముష్మిక సుఖం కోసం దానధర్మాలు చేయమనీ గుడి మండపం కట్టించమనీ, పాఠశాల బిల్డింగుకి చందా యిమ్మనమనీ, సప్తాహాలు చేయించమనీ చెవిలో యిల్లు కట్టుకుని చెప్పారు. గవరయ్య గుండ్రంగా లోతుగా వున్న కళ్ళని కుంచించి మోటైన పెదాలమధ్య చుట్టని నొక్కి పెట్టి, విసుగ్గా, విసురుగా "నేనొక్క కానీ యివ్వను, పోయి మీ అబ్బతో చెప్పుకోండి" అనేవాడు. మంచి లేదు, మర్యాద లేదు వీడికి అనుకున్నారు వాళ్ళందరూ పరోక్షంగా. అతనికి లక్ష రూపాయలుండడం వల్ల అతని ఎదురుగా అలా అనలేదు. వాళ్ళు సహజంగా జ్ఞానులు కాబట్టి.

గవరయ్య మేనత్తగారింటికి చేరిన కొద్ది రోజులలోనే మొదటి భార్యను తీసుకొచ్చాడు. ఆ భార్యనెక్కడికీ పంపేవాడు కాదు. పొరుగిళ్ళకు కూడా వెళ్ళేది కాదు. మేనత్తా, భార్యా, గవరయ్యా - ముగ్గురూ మూడు దెయ్యాలలా వుండేవారు. ఒక పుకారు కూడా వూళ్ళో వుండేది. గవరయ్య పెళ్ళాన్ని ఏదో భూతం ఆవహిస్తూంటుందనీ, ఊళ్ళో ఎవరికి తెలియకుండా అందరూ నిద్రపోయే అర్థరాత్రివేళ భూతవైద్యుడెవడో వచ్చి ప్రయోగాలు చేస్తాడని ధూపాలు వేస్తాడనీ చెప్పుకుంటూంటారు. ఇంత ఒంటరిగా సంఘ జీవితంలో కలవకుండా వీళ్ళెలా వుంటున్నారో ఎవరికీ అర్థం కాలేదు. కొంత కాలానికి గవరయ్య పుట్టిన వూరునుండి వచ్చానని చెప్పుకుంటూ కొన్నాళ్ళు ఆ వూళ్ళో ఒక గాజుల వర్తకుడు తిరుగుతుండేవాడు. అతను గవరయ్యను గురించి భోగట్టా అందజేశాడు.

గవరయ్య తండ్రి చాలా దుర్మార్గుడట. జూదమూ, తాగుడూ రెండింటినీ సమపాళంగా అభ్యసించి ప్రాక్టీసు చేశాడుట. తల్లి రోగిష్టిదై మంచానపడి ఉండేది. అందువలన గవరయ్య తండ్రి పొరుగూళ్ళో ఒకావిడని వుంచుకొన్నాట్ట. గవరయ్య చిన్నతనంలో తల్లి సంరక్షణ ఏమీ ఎరగనివాడు. తండ్రికున్న చెడ్డ పేరువలన గవరయ్యతో ఎవరూ కలిసేవారు కాదు. ఆఖరికి ఆ వూరి బళ్ళో కూడా చేరనివ్వలేదు. ఆ స్కూలు స్థాపించినాయన అక్కడ పేరొందిన భూస్వామి. ఆ భూస్వామితో గవరయ్య తండ్రికి ఎడతెగని వైరం. భూస్వామి పలుకుబడీ దైవభక్తి వున్నవాడు. ప్రతిఏటా సుబ్బారాయుడి షష్ఠి ఉత్సవాలూ, అన్న సంతర్పణా చేయించేవాడు. ఒకానొక ప్రాణావసర సమయంలో గవరయ్య తండ్రిచేత యిచ్చిన దానికన్న రెండు రెట్లు తనఖా వ్రాయించుకొని వున్న భూమి కాస్తా అన్యాయంగా కాజేశాడని గవరయ్య తండ్రి ఆరోపణ. కాని వూళ్ళో పెద్దలు ఒక రౌడీ మాటల్ని నమ్మేటంత అవివేకులు కారు. అదేకాక వాళ్ళు చాటుమాటుగా వడ్డీ వ్యాపారం ఆ భూస్వామి పద్ధతిమీదే చేస్తున్నారు కాబట్టి పెద్ద మనిషీ, పరమ భక్తుడూ అయిన భూస్వామి యిలాంటి అక్రమం

చేస్తాడని కలలో కూడా ప్రజాసామాన్యం నమ్మదలచుకోలేదు.

గవరయ్య ఒంటరితనాన్ని చూసి బాధపడి తండ్రి ఒక కుక్కపిల్లనీ, రెండు పిల్లి పిల్లల్ని తెచ్చి యిచ్చి ఆడుకోమనేవాడు. "మనుషులకంటె యివే నయం" అనేవాడు. రోగిష్టి అయిన భార్యతో, గవరయ్య బాల్యమంతా కుక్కలతో, చెట్లతో, గోడలతో ఆడుకుంటూ గడిపారు. కొన్ని నాళ్ళకి రోగిష్టి తల్లి చనిపోయింది. ఆమె చనిపోవడంతో గవరయ్య తండ్రి దుండగాలెక్కువైపోయాయి. గవరయ్య తండ్రికి భార్య అంటే చాలా ప్రేమ. ఆమె జబ్బుకోసం చాలా డబ్బు ఖర్చు పెట్టాడు. ఇప్పుడీ మెకు చివరి రోజుల్లో వైద్య సహాయం చేయించలేకపోవడం భూస్వామి పాలేరు పొలంలోంచి వస్తూండగా ఎవరో వాడి తల రెండు చెక్కలయ్యేట్టు యినుప కడ్డీతో కొట్టారు. భూస్వామి తన అనుమానమంతా గవరయ్య తండ్రి మీద ఉందన్నాడు. గవరయ్య తండ్రిని అరెస్టు చేశారు. కేసు మోపారు. ఊళ్ళో అందరూ బలమైన సాక్ష్యం ఇచ్చారు. వాళ్ళు స్వయంగా చూసినా చూడకపోయినా, భక్తిపరుడైన భూస్వామి ఆజ్ఞల్ని దైవాజ్ఞ శిరసావహించారు. గవరయ్య తండ్రికి యావజ్జీవ శిక్ష పడింది. తండ్రి ఆఖరి మాటగా కొడుకుతో 'ఎవర్నీ నమ్మకు. నీ కాళ్ళ మీద నువ్వు నుంచో, ఈ మనుషులందరూ దొంగవెధవలు, విషసర్పాలు' అని చెప్పి మరీ పోలీసులతో వెళ్ళాడు.

తల్లి లేని, తండ్రి లేని గవరయ్య ఆ యింట్లో బెంబేలెత్తిపోయాడు. బెంగతో రెండు రోజులు తిండీ తిప్పలు లేక యింట్లో మూలగా కూర్చుని పధ్నాలుగేళ్ళ గవరయ్య హోరుమని ఏడ్చాడు. ఎవరూ ఆ ఛాయలకి రాలేదు, పలకరించలేదు. రౌడీ, హంతకుడూ అయిన తండ్రి దుర్గుణాలు వీడికీ సంక్రమించి వుంటాయనీ, వీడికెంత దూరంలో వుంటే అంత మంచిదని ఆ వూళ్ళో మంచివాళ్ళందరూ అనుకున్నారు కాబోలు. గవరయ్యకి జ్వరం వచ్చింది. మందులేదు. మాకులేదు. జ్వరం స్ఫోటకంలోకి మారింది. ఆ యింట్లోంచి రాత్రిళ్ళు "అమ్మా చచ్చిపోతున్నానేవ్" అనే కేకలు వినవచ్చేవి భయంకరంగా, దీనంగా

మశూచీ అని తెలియగానే ఆ పొలిమేరలలో కూడా జనం నడవడం మాని వేశారు. "ఈ కొడుకు కూడా పోతే వూరికి పీడా వదిలిపోతుం"దన్నారు కొందరు. ఇలా వుండగా ఒకరోజు సాయంత్రం ఒక గుర్రబ్బండీ గవరయ్య ఇంటిముందాగింది. దానిలోంచి నలభై ఏళ్ళ స్త్రీ దిగింది. ఒంటినిండా నగలున్నాయి. మనిషి పొడుగ్గా, బలంగా ఉంది. చెంపల దగ్గరైనా జుట్టు నెరవలేదు. ఆ వీధి వీధంతా వింతగా ఆమె కేసి చూస్తూ నుంచున్నారు. కాని ఆమె పక్కకి కూడా చూడకుండా సరాసరి లోపలికి వెళ్ళిపోయింది. నౌకరు పెట్టెలన్నింటినీ లోపల పెట్టి తలుపులు దభాల్న వేసేశాడు.

నౌకరు ద్వారా ఆమె గవరయ్య తండ్రికి యిలాకా ఉన్న ఆవిడనీ, ఆరునెలల పుణ్యక్షేత్రాలు సేవించి రెండు రోజుల క్రితమే తిరిగి వచ్చిందనీ, గవరయ్య తండ్రికి యావజ్జీవ శిక్ష పడడమూ కొడుకు దిక్కులేనివాడై ఉండడమూ తెలిసి యెకాయెకిని సామాన్లు పట్టించుకుని ఆ వూరు వచ్చేసిందనీ తెలిసింది. అంతే, నాటినుండీ గవరయ్య ఆమె సంరక్షణలో పెరిగాడు. జబ్బునుంచి కోలుకున్న గవరయ్య మరీ వికృతంగా వున్నా ఆమె లక్ష్యం చేయలేదు. తండ్రితో సంబంధమున్నంత మాత్రాన ఈ చాతకాని వికారపు కొడుకు బాధ్యత తీసుకోవడంలోని అవివేకాన్ని ఒకరిద్దరు చొరవగల స్త్రీలు ఆమెకి చెప్పి చూశారు. కానీ ఎవర్నీ లక్ష్యం చేయని గుణం ఆమెలో వుంది. కొన్నాళ్ళకి ఒక పిల్లని వెతికి తెచ్చి గవరయ్యకి పెళ్ళి చేసింది. గవరయ్య ఇరవయ్యోయేట ఆమె మరణించే ముందు గవరయ్యకి తన నగలూ, పదివేల రూపాయల నగదూ యిచ్చివేసింది.

తర్వాత అతనీ వూరిలో మేనత్త ఇంటికి రావడం, తోళ్ళ వ్యాపారం చేయడమూ, ఏడెనిమిదేళ్ళకు మొదటి భార్య పోవడమూ ఊళ్ళో అందరికీ తెలిసినదే. ఈ చరిత్ర అంతా గాజు వర్తకుడి ముఖతః విన్న తర్వాత గవరయ్య అంటే ఉన్న వాళ్ళ అసహ్యభావం ఈసారి తార్కికమైన ఆధారంతో మరింత గట్టిపడింది. తండ్రి దుర్మార్గుడు, హంతకుడు. వీడు చిన్నతనం నుండి పిల్లులతో, కుక్కలతో కలిసి జంతు లక్షణాలు అలవరచుకున్నాడు. పైగా వీడి పెంపకం ఒక చెడిన స్త్రీ చేత. ఇంతటి అమానుషుడు వచ్చీ వచ్చీ ఈ ఊళ్ళో పడ్డాడనే బాధ ఒకవైపున పీడించింది నలుగుర్నీ.

అయినా అవధాని మొదలైన పెద్దలు మొదట నిరాశ చెందలేదు. గవరయ్య దుర్మార్గుడు నిజమే. వికృత రూపుడు – అదీ నిజమే – పిసినిగొట్టు. ఎవరికీ కానీ రాల్చడు – ఒప్పుకున్నాం – ఒటెత్తు మనిషి, సభ్యత లేనివాడు – అందరికీ తెలుసును; అయితేనేం ధనవంతుడు. ఆ ధనాన్ని సత్కార్యాలకు ఉపయోగించేటట్టు చేస్తే అతనికీ, పెద్దలకీ ముక్తి ఉంది. ఇంత ఉదారాశయంతో ఎన్నో విధాల ఎన్నోసార్లు గవరయ్యని

కదిపిచూశారు. వేణుగోపాలస్వామి ఉత్సవాలన్నారు. మండపం కట్టించాలన్నారు. ఒకవైపు ఒరిగిన ప్రాకారం బాగు చేయించాలన్నారు. దేనికీ గవరయ్య లొంగి రాలేదు. చివరికి గుళ్ళోకి వచ్చి దైవ దర్శనం చేసుకుని ప్రసాదం తీసుకోమన్నారు. అది ఖర్చు లేనిపని. ఎప్పటికైనా గవరయ్య రాతి గుండెలలో భక్తి విత్తనం నాటుకుంటుందని వాళ్ళ ఆశ. కాని ఏనాడూ గవరయ్య గుడి ఛాయలకి కూడా రాలేదు.

ఒక తోడివాడు నాస్తికుడై పాపియై పోతూంటే ఊరుకోలేని మంచితనం వలన, కార్యదీక్ష వలన ఊరి పెద్దలతని మీద బహిష్కరణాస్త్రం ప్రయోగించారు. కానీ అదేమీ పని చేయలేదు. ఎందుకంటే గవరయ్య ఊరినే బహిష్కరించాడు మొదటి నుండి. చాకలీ, కోమటి, మంగలీ అతనికి చాటుచాటుగా వాళ్ళ వాళ్ళ సేవలందించడం మానలేదు కూడా. నిక్కచ్చిగా వాళ్ళందరికీ జీతాలిస్తాడేమో గవరయ్య బేరాన్ని పోగొట్టుకోవడానికి వాళ్ళెవరూ ఇష్టపడలేదు.

మొదటి భార్య కాలు జారి నూతిలో వడి మరణించినప్పుడు అవధానీ తదితరులూ గవరయ్యని పరామర్శించారు. ఇదంతా కర్మ ఫలితమనీ, యిప్పటికైనా మేలుకోమనీ హెచ్చరించారు. కాని గవరయ్య ఖాతరు చేయలేదు. పైగా ఏడాదిలో తనకన్న పదిహేనేళ్ళు చిన్నదైన ఒక పిల్లను పెళ్ళి చేసుకుని యింటికి తీసుకొచ్చాడు. ఆ పిల్ల అందం మాట ఎటున్నా ఫ్యాషన్‌గా అలంకరించుకునేది. ఆమెని ఎంతో అప్యాయంగా ప్రేమగా చూసేవాడని గవరయ్యని గురించి అనుకునేవారు. అయితే ఆమె అయినా యిల్లు దాటి యీవలికి వచ్చేది కాదు. ఎవరేనా కుతూహలం కొలదీ వెళ్ళి పలకరిస్తే కబుర్లు సరదాగా చెప్పేది. ఎవరేనా గవరయ్య రూపాన్ని గురించి గాని, వయస్సు గురించి గాని వ్యంగ్యంగా హేళన చేస్తే 'ఆయన చాలా మంచివారు" అనేదిట. నాలుగు రోజుల కొకసారి ప్రక్క టౌన్‌కి బండిమీద వెళ్ళి సినిమా చూసి వచ్చేదిట. గవరయ్య తన నిబంధనల్ని ఈ భార్య విషయంలో సడలించాడని ఆశ్చర్యపోయారు. కానీ ఆ సడలింపు కూడా కొంత వరకే. ఆ యింటిలో వున్నవాళ్ళు అలాగ మనుషులకీ, వూళ్ళో జరిగే సంఘటనలకీ దూరదూరంగా వుండవలసిందే.

ఎదురింటి అరుగుమీద వున్న మిషన్ కుట్టువాడితో యీమెకి లేచిపోవడం దాకా యింత చనువు ఎలా ఏర్పడిందో ఎవరికీ తెలియదు. కాని ఈ దుస్సంఘటనతో మున్సబూ, కరణమూ తదితరులూ మహదానందం పొందారు. కటిక చీకట్లో వాళ్ళకి మళ్ళీ ఆశాకిరణం గోచరించింది. ఇనుము వేడెక్కినప్పుడే సాగగొట్టాలన్నారు. నలుగురూ కలిసి ఒక రోజున గవరయ్య యింటికి వెళ్ళారు. ఇల్లు చాలా పెద్దది. మండువా లోగిలి. ఇంటి చుట్టూ పెద్ద దొడ్డి; వెనకాల గడ్డివామూ, దూడల పాకా, చెట్లు, చేమలూ వున్నాయి. ఆపైన యింకేమీ యిళ్ళు లేవు. అన్నీ పొలాలే, మేనత్త వున్న చిన్న లోగిలిని క్రమ క్రమంగా పెంచే యింత యింటిని చేశాడు గవరయ్య.

ఆ ఇల్లు అన్ని ఇళ్ళల్లా వుండదు. కలకలలాడుతూన్నట్టు వుండదు. ఏదో భయంకరమైన ఏకాంతం ఆ ఇంట్లో పేరుకున్నట్టు వుంటుంది. రాత్రుళ్ళు దెయ్యాలు గదిలోంచి గదిలోకి వంకర కాళ్ళతో తిరిగి తిరిగి పగటి వేళకు అటక మీదా, చూరుమూలల్లోను దాక్కున్నట్టు వుంటుంది. పలుకుబడి, స్తోమతూ సహజంగా ధైర్యం వున్న ఆ నలుగురికీ ఆ ఇంట్లో అడుగు పెడుతూంటే కొంచెం బెదురుగా వుంటుందన్నమాట నిజం.

గోడకు చేరబడి కళ్ళు మూసుకుని వున్నాడు గవరయ్య. బనీనులోంచి అతని బలిష్ఠమైన రొమ్మూ, కండలూ మశూచికపు గుంటలతో నాట్లు తిన్న తుమ్మబాదుల్లా వున్నాయి. అడుగు చప్పుడు విని కళ్ళు తెరచి చూశాడు. కళ్ళు ఎర్ర జీరలతో తాగినవాడి కళ్ళలా వున్నాయి అవధానీ, మున్సబూ, కరణమూ, మరొక పెద్ద మనిషి తేరి చూస్తున్న గవరయ్యకి దగ్గరగా వున్న బల్లమీద కూర్చున్నారు. గవరయ్య ఏమన్నట్టుగా ప్రశ్నార్థకంగా చూశాడు.

"నీకు రావల్సిన కష్టం కాదోయ్ గవరయ్యా. నిమ్మకు నీరోసినట్టు వుండే స్వభావం నీది. ఒకరి జోలీ శొంఠి అక్కర్లేదు. విషయం తెలియగానే 'అరే! పాపం' అని మనస్సు కొట్టుకుపోయిందంటే నమ్ము" అన్నాడు కరణం.

గవరయ్య మాట్లాడలేదు. అలాగే చూస్తున్నాడు.

పన్నులు కట్టడంలో కానీ, పాలేళ్ళకి జీతాలివ్వడంలో కానీ – తన ధర్మం తాను టైముకి నెరవేర్చుకునేవాడు. ఒకరి సొమ్ము ఎప్పుడు తన దగ్గర వుంచుకోలేదు. సుబ్బయ్య గాడికి సొలు తిరక్కముందే ధాన్యం కొలిచి యిచ్చేసాట్ట గవరయ్య. "వాడు తెగ చెప్పుకోవడమే – మా కామందు మహ దొడ్డ మనిషి అని..." అన్నాడు మున్సబు. గవరయ్య అలాగే చూస్తున్నాడు. అతను వీరి మాటలు వింటున్నాడో లేదో తెలియదు.

"కాని ఒక్క మాట గవరయ్య బాబూ!" మందంగా,

గంభీరంగా, అందులోనే ఒక విశేషమైన దయా, మృదుత్వాన్నీ కలిపి వాచా చమత్కారియైన అవధాని ధర్మకర్తృత్వపు హోదాతో పలికాడు. "భగవంతుడి ఆసరా లేకుండా ఎటువంటి వాడూ యీ సంసార సాగరాన్ని సుఖంగా దాటలేడనుకో, నువ్వా ఉత్తముడివి. ముక్కుకి సూటిగా పోయేవాడివి. అయితేనేం; నీ వ్యాపారం వుంది చూడు – అది కేవలం ధర్మ విరుద్ధమని శాస్త్రాలు నొక్కి చెబుతున్నాయి. అయితే కలియుగంలో కొన్ని మినహాయింపులు చేశారు మనుషులు. అందుకని ఫరవాలేదు. కాని ఒక్కటి చెప్పారు – ఏమైనా ఆ భగవంతుని స్మరించడం మానకుండా వుంటే అన్ని కష్టాలూ మంచులా విడిపోతాయి. ఫలం, పుష్పం, పత్రం, తోయమ్– అన్నారు – భగవంతుడు అల్ప సంతోషి...."

క్రమంగా అందరి మొహాలలోను విజయాన్ని సూచించే నవ్వు అలముకుంది. ఎప్పుడూ కసురుకొని విసుక్కునే గవరయ్య యీ వేళ మౌనంగా వున్నాడు. అభేద్య మనుకున్న కోటగోడకు పగులు ఏర్పడింది. ఇంక మెల్లమెల్లగా గవరయ్యని మార్చివేయ వచ్చుననే భావం వారిలో ఏర్పడింది. అందరూ లేచారు, వెళ్ళివస్తామన్నారు. కాని గవరయ్య అలాగే శిలాప్రతిమలా కళ్ళప్పజెప్పి చూస్తూ కూర్చున్నాడు.

ఒక ఏడాది గడిచింది. అప్పుడప్పుడు కరణము, మున్సబూ వగైరాలు గవరయ్య ఇంటికి వచ్చి పోతున్నారు. గవరయ్యని దైవదర్శనానికని, హరికథకనీ, మరొకటనీ చెప్పి పిలుచుకు వెళుతున్నారు. ఊళ్ళోవాళ్ళు కూడా గవరయ్య వీధిలో వెళుతూంటే నమస్కారాలు పెడుతున్నారు. గవరయ్య మాత్రం ఏమీ మాట్లాడడు. మంత్రించిన వాడిలా ఆ దేవాలయంలో కానీ, హరికథలో కానీ కూచుంటాడు. సగంలో ఒక్కొక్కసారి చటుక్కున లేచి వెళ్ళిపోతాడు. పెద్దలు తల పంకించి 'రాక్షస ముండా కొడుకు. ఒక్క రోజులో మారతాడా"? అనేవారు.

"మారకేం చేస్తాడు. సంఘాన్నీ, ధర్మాన్నీ కాదని ఎక్కడికి పోతాడోయ్ వీడు" అనేవాడు అవధాని.

వేణు గోపాలస్వామి గుడి ప్రాకారం పూర్తిగా పడిపోయేటట్టు వుంది. ఇంక జాగుచేస్తే లాభం లేదనుకున్నారు వూళ్ళో పెద్దలు. పాతిక వేలైనా వుంటే గాని యీ పని జరగదు. అంత మొత్తాన్ని ఒక్క గవరయ్య తప్ప యివ్వగలిగినవాడు మరొకడు లేడన్నారు. ఈ యేడాదిలోనూ గవరయ్య చాలా లాభాలు సంపాదించాడు. తోళ్ళ వ్యాపారం అలా వుండగా, పట్టణంలో నూనె మిల్లులో ముప్పాతిక వాటా కొన్నాడు. ఒక్క వేరుశనగ నూనెలోనే ఒక లకారం వచ్చిందని వూరంతా ఎంతగా చెప్పుకుంటున్నారు. ఈ అభివృద్ధికి కారణం అతనిలో పొడచూపిన దైవభక్తి అని వాళ్ళనుకోవడమే కాకుండా అతడు ఏమరిపోతాడేమోనని అతని వద్ద మరీమరీ పని కట్టుకు చెప్పేవారు. ఒక మంచి రోజున మున్సబు, కరణమూ, ధర్మకర్తా యింకా వూళ్ళో మోతుబరులూ, అందరూ కలిపి గవరయ్య యింటికి వెళ్ళి ప్రాకారోద్ధరణను గురించి చెప్పారు. అతనే పూనుకోవాలన్నారు. "నీ పేరు చిరస్థాయి అయిపోతుంది. గవరయ్యా, నీ పేరుమీదుగా రోజూ పూజా పునస్కారాలు జరిపిస్తాం" అనీ చెప్పారు.

"దేవుడికి అసలు గుడెందుకు? ఆ గుడిచుట్టూ గోడెందుకు?" అన్నాడు గవరయ్య చుట్ట చివరని నోట్లో నములుతూ.

నిశ్చేష్టులయారందరూ, "అపచారం! అపచారం!" అని లెంపలు వాయించుకున్నాడు కరణం.

ధర్మకర్త కరణానికి కన్ను గీటాడు. "గవరయ్య వేసిన ప్రశ్న సామాన్యమైనది కాదు. తత్వవేత్తల్నీ, మహర్షుల్నీ కూడా ముప్పుతిప్పలు పెట్టిన జటిల ప్రశ్న అది. అయితే గవరయ్యలో మనకి తెలికుండానే గొప్ప సాధన జరుగుతోంది. నాలుగు రోజులు మనం ఓపిక పడితే గవరయ్య వంటి పెద్దమనిషి తన ప్రశ్నకి తనే జవాబు పొందుతాడు. భగవదనుగ్రహం నేరుగా ఒక్కసారి రాదోయ్. అంచెలంచెలుగా వస్తుంది. అలాగ వచ్చిన రోజున గవరయ్య ఏది – మన గవరయ్యే వచ్చి "ఇదిగో అవధానిగారూ, ఈ పదివేలు దగ్గిరుంచండి – ప్రాకారం కట్టించెయ్యండి" అని అనడూ?

గవరయ్య ఎప్పుడూ చెయ్యనివాడు అవధానికి నమస్కారం చేశాడు. "సెలవు తీసుకోండి నాకు పనుంది. టౌనుకెళ్ళాలి" అని అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు. అవధాని ఆశ్చర్యపడ్డాడు. అందరూ మొహమొహాలు చూసుకున్నారు.

"అవధానీ జయించావోయ్. తల వంచి నీకు నమస్కరించాడు కూడా! వీణ్ణి తగలెయ్యా – మారుతున్నాడు, మారిపోతున్నాడు" అన్నాడు కరణం హుషారుగా.

"ఈ వర్షాకాలం వెళ్ళేసరికి – నే చెబుతున్నాగ – పాతికవేలూ మన ముందు పడేస్తాడు. ఆ ప్రాకారంతో పాటు మన యిళ్ళకీ ప్రహరీ గోడలు లేస్తాయి!" అన్నాడు మీసాల్లో ముసిముసినవ్వులు నవ్వుకుంటూ మున్సబు.

## -3-

వర్షాకాలం రానే వచ్చింది. రావడంలో మంచి వూతంగా, కోపంగా బలంగా వచ్చింది. కుంభవృష్టిగా వర్షం, దట్టమైన మేఘాలతో నల్లబడిన ఆకాశం మెరుపులూ, ఉరుములూ ప్రకృతి పెళ్ళిపందిరిలా హడావిడిగా వుంది. రోడ్లు బురదైనా కుచ్చెళ్ళ నెత్తిపట్టుకుని ఆడవాళ్ళు, అందులో కొత్తగా పెళ్ళయిన వధువులు సరదాగా పేరంటాలకి వెడుతూ వస్తున్నారు. రైతాంగం అంతా పొలం పనుల్లో పడిపోయారు. మున్సబు పెళ్ళానికి కీళ్ళు నొప్పులూ, అవధాని కూతురికి వేవిళ్ళూ అయినా గ్రామం ఉమ్మడి సౌఖ్యాలకి అవేమీ ఆటంకంగా లేవు. కరణం విధవ చెల్లెలు కిటీకీలోంచి ఎదురింటికి చుట్టంచూపుగా వచ్చిన బస్తీ అబ్బాయికేసి అదేపనిగా చూస్తూ చెయ్యి వూపుతున్నా, షార్టు సైటూ మబ్బునీడలూ మూలాన అతనికి ఆ సిగ్నల్స్ కనబడటం లేదు. ఎండైనా వానైనా గ్రామం శివార్లల్లో వున్న కూలీ, నాలీ జనం, మురికి గుంటలూ, పందులూ, జబ్బులూ అన్నీ సక్రమంగానే వున్నాయి. పంచాయితీవాళ్ళు కట్టించిన లైబ్రరీ బిల్డింగులో పేకాట నిరంతరం సాగుతోంది.

ఇలాంటి చల్లని సుఖమైన వాతావరణంలో పిడుగువంటి వార్త చటుక్కున ఊరంతటినీ దద్దరిల్ల చేసింది. మున్సబూ, ఒకరిద్దరు పెద్దలూ మున్సబు యింటి అరుగుమీద కూర్చుని శాలువ కప్పుకొని వెచ్చగా చుట్టలు కాలుస్తూ ఆధ్యాత్మిక గోష్ఠి సలుపుకుంటున్నారు. ఆ సమయంలో పానకాలు అక్కడికి పరుగెత్తుకుని వచ్చాడు. వాడి కళ్ళల్లో విపరీతమైన కంగారు ఉంది. వాడి వాలకం చూస్తే వాడి వెనకాలే భూకంపమో, వరదో గ్రామానికి వచ్చినట్టుంది.

"ఏంరా ! ఏం జరిగిందిరా" అన్నాడు మున్సబు

"అదొచ్చిందండీ. తిరిగి వచ్చిందండీ" అన్నాడు పానకాలు

రెణ్ణెల్ల క్రితం మున్సబు గారి గిత్తదూడ కట్టు తప్పించుకొని పారిపోయింది. మున్సబు చిరునవ్వుతో "అయితే ఇంకేం నేవచ్చి చూస్తాలే. కొట్టాంలో కట్టేయ్" అన్నాడు.

"గిత్త కాదు బాబూ! గవరయ్య పెళ్ళాం" అన్నాడు పానకాలు మెల్లగా. అందరూ చటుక్కున నిటారుగా కూర్చుని "ఆఁఆఁ ఏమన్నావ్!" అన్నారు ఏకకంఠంతో.

పానకాలు చెప్పిన వివరణ యిది. రాత్రి చాలా పొద్దుపోయాక పట్నంలో రెండో ఆట సినిమా చూసి వస్తున్న బట్టల కొట్టు నరసింహం వూరు సమీపించే వేళకి రోడ్డుకి పక్కగా చెట్ల నీడల్లో ఎవరో కదులుతూండడం చూశాడు. అతనికి దయ్యమేమో అని అనుమానం భయమే కలిగి గుండెలు దడదడలాడాయి. అక్కడికి కాస్తదూరంలో పాకలో పడుకున్న పానకాలుని కంగారుగా లేపాడు. ఇద్దరూ వచ్చి చూశారు. రేగిన జుట్టూ, నల్లని మాసిన బట్టలూ, నడవలేక ఒక్కొక్క అడుగు వేసే ఆడకూతుర్ని చూశారు. ఆమె చేతిలో చిన్న మూట వుంది. ఎవరా అని దగ్గర్నుంచి చూశారు. పోల్చుకోలేకపోయారు. పలకరించారు. ఆమె మాట్లాడలేదు. ఆమె నడక వేగం హెచ్చించింది. వీళ్ళిద్దరూ అంతదూరం నుంచే ఆమెను అనుసరించారు. ఆమె పొలాలమ్మటే వెళ్ళి గవరయ్య యింటి పెరటినానుకున్న పాకలోకి వెళ్ళింది. ఆ పాక గవరయ్య యింటి పెరటికి, పొలాలకీ మధ్యగా వుంది. పాకలో కర్ర పేళ్ళూ, పాత సీనా రేకు డబ్బాలూ లాంటి చెత్తా చెదారం అంతా వుంది. గవరయ్యను లేపి చెపుదామంటే యింత రాత్రివేళ లేపితే తంతాడని భయం వేసింది.

మళ్ళీ యిప్పుడా సంగతి జ్ఞాపకం వచ్చి పాకవేపు వెళ్ళి చూశాడు. ఎవరో కాదు ఆ ఆడమనిషి – గవరయ్య పెళ్ళామే ! కడుపు చాలా ఎత్తుగా వుంది. నెలలు నిండినట్టున్నాయి. గడ్డిమీద పడుకుని మూలుగుతూ వుంది.

"ఈ సంగతి గవరయ్యకు తెలుసునంటావా...." అన్నాడు మున్సబు

"తెల్దుబాబూ, తెల్లారగట్లనే లేచి టౌనుకెళ్ళిపోతాడుగా గవరయ్య" అన్నాడు పానకాలు.

మున్సబు తొందరగా లేచాడు. చెప్పులు వేసుకుని బయల్దేరాడు అవధాని యింటికి. దారి పొడుగునా అందరూ పలకరిస్తున్నారు. "ఏం మున్సబూ, గవరయ్య పెళ్ళాం తిరిగొచ్చిందంటగా, ఈ వూరు, ఈ మడుసులు, ఏమైపోతన్నారు బాబూ. మంచీ, చెడ్డా, పున్నెం పాపం అన్నీ మట్టికొట్టుకుపోతన్నయా! లేచిపోయి కడుపులు సేసుకున్నోళ్ళని మళ్ళీ ఏలుకుంటావుంటే ఊళ్ళో పిల్లలు రెచ్చిపోరటయ్యా? ఏమొచ్చింది బాబూ ఈ ఊరికి, పెద్దలకీ!" అంది అరవై ఏళ్ళు దాటిన ఒకావిడ అరుగుమీద నుంచుని. అవధాని యింటికి వెళ్ళే లోపుగానే మున్సబుకి తెలిసిపోయింది. ఊరంతా గవరయ్య పెళ్ళాం గురించి మాట్లాడుకుంటున్నారని. అవధాని చాలా చిరాగ్గా, కోపంగా వున్నాడు.

"మీకు తెలుసా" అన్నాడు మున్సబు మెల్లెకుతూ.

"ఆబాల గోపాలానికీ తెలుసును! మునసబుగిరీ చేస్తున్న

నీకే తెలవదు. ఎంత ధైర్యం వుండి ఆ పాపిష్టిది యీ వూరొచ్చిందట! ధర్మ భయం, దైవ భయం ఎక్కడైనా వున్నాయా అని!''

కాస్సేపట్లో కరణమూ, వూరి పెద్దలూ అందరూ అక్కడ సమావేశమయ్యారు. గవరయ్య తక్షణం ఆ చెడిపోయిన దాన్ని తరిమేస్తాడో, లేక తనే వూరి నుంచి వెళ్ళిపోతాడో తేల్చుకోవాలన్నారు. ఆ రోజు ఉదయమే మాలగూడెంలో ఎవడికో కలరా తగలిందనీ దానికి కారణం యీ పాపిష్టిది వూళ్ళో అడుగు పెట్టడమే అనీ ఒకరన్నారు. అవధాని పెద్దక్కగారు తలుపు రెక్క ఓరగా తీసి యిలా అంది. "మేమందరం సిగ్గుతో చచ్చిపోతున్నాం, ఇలా బరి తెగించిన వాళ్ళు వూళ్ళో వుంటే సంసారుల గతి ఏమవుతుంది ఆలోచించండి అన్నయ్యా. మమ్మల్ని వూళ్ళో వుండమంటారో లేదా గంగలో దూకమంటారో చెప్పండి".

"ఇంతకీ గవరయ్య యింట్లో లేడుగా. రాగానే పెద్దలు మీరు వెళ్ళి చెప్పండి! మీ మాట వినకుండా వుంటాడా! ఏమైనా చెప్పండి అవధాని గారూ! గవరయ్య యిదివరకటి వాడు కాదు. పాపం పుణ్యం అంటే ఏమిటో తెలుసుకున్నాడు. దైవభక్తి, అంతకన్నా మీరంటే భక్తి కలిగున్నాడిప్పుడు" అన్నాడు ఊళ్ళోకి పెద్ద కామందైన శేషగిరి.

"గవరయ్య మీద యింకా ఎన్ని ఆశలు పెట్టుకున్నాం!" అన్నాడు మున్సబు నిట్టూరుస్తూ గుడి ప్రాకారాన్ని, పాతిక వేలనీ తలచుకొని.

"గవరయ్య మేనత్త వుంది కదా! ఆవిడేం చేస్తోంది. ఊరుకుందా?"అన్నాడు కరణం.

"ఏం మేనత్తలే బాబూ, ఖాయిలా పడి మంచాన్నంటుకు పోయి వుంది పాపం. బాగా ముసిల్దయిపోయింది'' అన్నాడొకడు.

కనుచీకటి పడేవేళకి గవరయ్య యింటి ముందు సైకిలు దిగాడు. ఇంట్లోకి అడుగు పెట్టగానే అవధాని, కరణం మునసబుని చూశాడు. కనుబొమలు పైకెత్తి ప్రశ్నార్థకంగా తల ఆడించాడు. అవధాని అంతా చెప్పాడు. గవరయ్య కళ్ళు ఎర్రబడ్డాయి. అతని లావాటి పెదవులు వణికాయి. గబగబా వెళ్ళి మూలనున్న గునపం చేత్తో పైకి ఎత్తాడు. "చంపేస్తాను, తప్పుడు ముండని" అని అరిచాడు. అవధాని కంగారుగా "వొద్దు వొద్దు అంత పని అక్కర్లేదు. గవరయ్య బాబూ, నీ ధర్మ నిష్ఠ తెలియనిదా, ఇప్పుడు మళ్ళీ ఖూనీ కేసు ఒకటా! నీ పీకే కాక మా పీకల మీదికి కూడా వస్తుంది. దాన్ని యింట్లోంచి తోలేసెయ్యి చాలు" అన్నాడు. గవరయ్య అతని మాటలు వినిపించుకోలేదు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ లోపలికి వెళ్ళిపోయాడు. ఈ సమయంలో అక్కడ వుండటం తమకే ముప్పని గ్రహించిన ఆ పెద్దలు ముగ్గురూ అక్కడినుంచి జారుకున్నారు. గవరయ్య పాకలోకి వెళ్ళాడు. అక్కడ జీబురుగా, చీకటి చీకటిగా వుంది. పాత సామానులతో, దుమ్ముతో నిండి వుంది. గవరయ్య పరకాయించి చూశాడు. ఒక పక్కగా నేలమీద వెల్లకిలా పడుకున్న పెళ్ళాన్ని చూశాడు. దగ్గరగా వెళ్ళి గునపం పైకెత్తాడు. ఇంతలో ఏదో సంశయం కలిగింది. "ఇది చచ్చిందా! బతికే వుందా" అనుకున్నాడు. మోకాళ్ళమీద వంగి మొహంలోకి చూశాడు. పీక్కుపోయి పాలిపోయింది మొహం. ఎండి అట్టలు కట్టిన జుట్టు అసహ్యంగా నేలమీద భుజాల చుట్టూ పరచుకొని వుంది. దీనంగా మృత్యువిహ్వలగా, భయంకరంగా, అసహ్యంగా వుంది ఆమె మొహం. "చిట్టీ" అని పిలిచాడు గట్టిగా భుజాలు పట్టుకుని కుదిపాడు. చిట్టి కళ్ళు తెరిచింది. గవరయ్యను ఆనమాలు కట్టింది. ఆమె కన్నులమ్మట నీళ్ళు కారుతున్నాయి. వణుకుతున్న తన రెండు చేతులనీ పైకెత్తి నమస్కరించింది. "నన్నేం చేయకు నేను వెళ్ళిపోతాను" అంది నీరసంగా. తన తల్లి చచ్చిపోయే ముందు యిలాగే తన తండ్రికి చేతులెత్తి దణ్ణం పెడుతూ దీనంగా చూసిన చూపు జ్ఞాపకమొచ్చింది గవరయ్యకు. మళ్ళీ చిట్టి చేతులు రెండూ కిందకు వేలాడిపోయాయి. కాసేపు అలాగే కూచుని ఏమనుకున్నాడో లేచి లోపలికి వెళ్ళి ఒక చెంబుతో నీళ్ళూ, ఒక గిన్నె నిండా అన్నమూ తీసుకువచ్చాడు. "చిట్టీ" అన్నాడు. చిట్టి కళ్ళు తెరిచింది. "లే, ఈ అన్నం తిను తెల్లారగానే వెళ్ళిపో. నీ మొహం నాకు చూపించకు తెలిసిందా" అన్నాడు. చిట్టి తల వూపింది. గవరయ్య లేచి నుంచుని "తెల్లవారేక యీ పాకలో కనిపించేవా నీకు చావు తప్పదు" అని యింట్లోకి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి గవరయ్యకి అన్నం సహించలేదు. అతనికి కాళ్ళకింద మంటలు పెట్టినట్లుంది. అవతల ఆకాశం మీద మబ్బులు దట్టంగా పట్టాయి. గాలి రివ్వుమని చెట్ల ఆకుల్లోంచి చప్పుడు చేసుకుంటూ ఇంటి చూరుని తాకి వెర్రిగా అరుస్తూ వెనక్కి తిరిగిపోతోంది. పక్కమీద దొర్లుతున్న గవరయ్యకి కునుకు పట్టింది. గవరయ్యకి భయంకరమైన కల వచ్చింది. తన తండ్రిని, తల్లిని ఒక స్తంభానికి కట్టి చుట్టూ మంటలు పెట్టారు. ఆ మంట

పెట్టినవాళ్ళు అవధానిలాగ, కరణంలాగ, మనసబులాగ కనిపించారు. తల్లీ తండ్రీ "బాబోయ్, బాబోయ్" అని అరుస్తున్నారు. తల్లీ తండ్రీ ఎర్రగా నల్లగా బూడిదలా కాలిపోయారు. ఆ బూడిదలోంచి ఒక వ్యక్తి బయటికి వచ్చాడు. ఆ వ్యక్తి గబగబా అడుగులేసుకుంటూ తన పెరట్లో పాకవైపు వెళ్ళాడు. ఆ వ్యక్తికి ఒక చేతిలో శంఖం, మరొక చేతిలో చక్రం, నుదుట నామాలూ వున్నాయి. గూళ్ళో తను చూసిన వేణుగోపాలస్వామి విగ్రహంలా వున్నాడు. వేణుగోపాలస్వామి కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. దేవుడేడుస్తున్నాడు. చిట్టీ పక్కలో వున్న పిల్లవాణ్ణి చేతులతో తీసుకొని "నీకేం భయంలేదు. నేనున్నానుగా" అని చిట్టిని ఓదారుస్తున్నాడు. అంతలో మండుతున్న కాగడాలు పట్టుకొని ఊళ్ళో జనం కేకలు వేసుకుంటూ వచ్చి పాకను అంటించేస్తున్నారు. పాక నలువైపులా భగ్గుమని అంటుకుంది. జ్వాలలు మిన్నుముడుతున్నాయి. దేవుడు మంటల్లో కాలిపోతున్నాడు. చిట్టి కాలిపోతోంది. నోరెరుగని చిట్టి పిల్లాడు కాలిపోతున్నాడు.

ఉలిక్కిపడి లేచాడు గవరయ్య. అతని నుదురంతా చమటతో తడిసిపోయింది. కిటికీ తలుపులు గాలికి కొట్టుకుంటున్నాయి. హోరుమని గాలివాన. ఉరుములూ, మెరుపులూ అంతా భయంకరంగా వుంది. గవరయ్య మొహం తుడుచుకున్నాడు. పక్కనున్న కూజాలోని ఒక గ్లాసుడు మంచినీళ్ళు గడగడా తాగాడు. చీకటిలోంచి బయటకు చూశాడు. వానతో కలిసిన చీకటి. నల్లని విషంలాగా ఆకాశం మీంచి కారుతోన్నట్లు నల్లని పావం సముద్రంలా పొంగుతోన్నట్టు వుంది. ఆ భయంకరమైన చీకటిలో యీ మనుషులు, ఇళ్ళూ, వాకిళ్ళూ, భయాలూ, కోర్కెలూ, అన్నీ అబద్ధంలా కనిపించాయి. ప్రకృతి యొక్క ప్రచండ తాండవంతో ఏదో సత్యం కొరడాతో ఛెళ్ళున కొట్టినట్లు, అర్థమైనట్లు అన్పించింది. ఒక పెద్ద మెరుపు మెరిసింది. ఆ మెరుపులో వేణుగోపాలస్వామి గోపురాగ్రం మెరిసింది. గవరయ్య మనసు లోతులలో ఏదో మెరిసింది. గవరయ్య దగ్గాడు. లాంతరు పట్టుకుని పెరట్లోకెళ్ళాడు. పెరడు చాలా పెద్దది. వర్షంలో తడుస్తూ గాలివూపుకి తట్టుకుంటూ పాక దగ్గరకి వెళ్ళాడు. పాకలోంచి కీచుగా, గట్టిగా మూలుగులు వినబడుతున్నాయి. లోపలకు వెళ్ళాడు. బాధతో వలయం తిరిగిపోతోంది చిట్టి. చూడలేక దీపం అక్కడ పెట్టి బయటకు వచ్చి నిలుచున్నాడు. అలా వర్షంలో చలి గాలిలో ఎంతసేపు నుంచున్నాడో తెలీనే తెలీదు. ఇంతలో ఒక మెరుపు మెరిసింది. దగ్గర్లోనే ఎక్కడో పిడుగుపడిన భయంకరమైన చప్పుడు. "బాబోయ్" అని అరిచింది చిట్టి. గవరయ్య ఒక్క నిముషం సేపు నిశ్చేష్టుడయ్యాడు. ఇంతలో "కేర్, కేర్" మని ఏడుపు వినిపించింది. కఠినమైన అసహ్యమైన గవరయ్య మొహం మీద లావాటి పెదవుల సందులనుంచి వచ్చిన చిరునవ్వు తాలూకు వెలుగు అలుముకుంది. గవరయ్య అంత వర్షంలోనూ, అంత చీకటిలోనూ మెరుపుల సహాయంతో వూళ్ళో మంత్రసాని కోసం పరిగెత్తుకెళ్ళాడు.

ఉదయం ఎనిమిది గంటలయింది. గవరయ్య ఇంటి వరండాలో అవధాని, కరణం, శేషగిరి, మున్సబూ అందరూ కూర్చుని వున్నారు. వర్షం తగ్గి లేత ఎండ కాస్తోంది. ఆ ఎండలో రాత్రంతా తడిసిన చెట్ల ఆకులూ, పచ్చికా, గవరయ్య యింటిమీద వాలిన కాకి నల్లని రెక్కలూ మెరుస్తున్నాయి. అవధానీ, మున్సబూ, వాళ్ళ మొహాలు మాత్రం మెరవటం లేదు. నిరాశాహతమైన వారి కళ్ళల్లో కోపం సుళ్ళు తిరుగుతోంది. గుమ్మం అవతల వాళ్ళ వెనకాలే వచ్చిన వెట్టివాడూ, ఒకరిద్దరు నౌకర్లూ తమరేం చెప్పినా చేసేస్తామన్నట్టుగా విధేయతా, పట్టుదల మూర్తీభవించినట్లు చేతులు కట్టుకు నుంచున్నారు.

కాసేపటికి ఇంట్లోంచి గవరయ్య వచ్చాడు. నడుస్తున్న ఇనుప గర్డరులా వున్నాడు. చిన్న కళ్ళు కుంచించి సూటిగా, నిర్లక్ష్యంగా వాళ్ళకేసి చూశాడు. అవధాని భీకరంగా కంఠం మార్చి "ఇలా చేస్తావనుకోలేదు గవరయ్యా! ఇంకా పెద్దమనిషివి అనుకున్నాను. చెడిపోయిన దాన్ని ఇంట్లోకి తీసుకొచ్చి పెట్టుకుంటావా? ఎవడివల్లో పుట్టిన కొడుకుని ఇంట్లో తెచ్చి పెట్టుకుంటావా! నీకు సిగ్గూ, అభిమానమూ రెండూ లేకపోవడమే కాదు, పాపం, మహాపాపం, ఘోర పాపం చేశావు. దేముడింక నిన్ను క్షమించి సహించి వూరుకుంటాడా?" అన్నాడు గుక్కతిప్పుకోకుండా. గవరయ్య తాపీగా గోడకానుకుని కూర్చున్నాడు. బోడ్లోంచి పొగాకు కాడ తీసి చుట్ట చుడుతూ, "నాకు దేవుడే చెప్పాడు" అన్నాడు. "ఏం చెప్పాడు" అవధాని.

"ఆ పిల్లాణ్ణి నేను పెంచుకుంటాను. ఆ పిల్ల ఇంట్లో పడివుంటుంది" అన్నాడు గవరయ్య.

"లేచిపోయిందాన్ని ఏలుకుంటావా?" అన్నాడు శేషగిరి తన చెవుల్ని తానే నమ్మలేక!

"ఏలుకోడం సిగతరగ – నాకంటే సగం చిన్నదాన్ని

# మళ్లీ కొత్తగా పుట్టాను

- లక్ష్మీ కందిమళ్ళ
98493 68808



అవును
ఇప్పుడు నీ పరిచయంతో
కొత్త శరీరాన్ని తొడుక్కున్నాను
మనసులో
సెలయేటి పరుగంత సంబరం
కొన్ని క్షణాలు
నీవి నావిగా మనవిగా
క్షణం క్షణం
మళ్ళీ పుడుతున్నట్టు
ఒక మెలుకువ
లేత కిరణంలా
నీ నవ్వు నన్ను స్పర్శిస్తుంటే
ఇప్పుడంతా భలే బాగుంది
ఇకనుంచి కూడా
బాగానే ఉంటుందనుకుంటున్నాను
ఏకాంతంలోకి
నన్ను నేను తోసుకుంటుంటే
నువ్వు నా వెనకే ఉంటుంటే
మాటిమాటికీ నిన్నే చూసుకుంటూ
నాలోకి నేను ప్రవహిస్తుంటాను
ఎన్నో సంతోషాలను పోగేసుకొని
రంగులు మార్చని స్వచ్ఛతతో
ఇదంతా చూసి
నువ్వు నవ్వుకుంటుంటావు
తెలుసు తెలుసు
నువ్వు ఎంతగా నవ్వుతున్నావో
ముసిముసిగా
నా కోరిక ఇదే
మన పయనం ఎప్పుడూ
ఇలాగే సాగుతుండాలని!!!! ◆

---

పెళ్ళి చేసుకుంటే లేచిపోక ఏం చేస్తది. ఇపుడు పోమ్మంటే ఎక్కడికి పోతది. తిండీ బట్టా యిస్తే కుర్రాణ్ణి సాకుతూ యిక్కడే పడివుంటుంది" అన్నాడు గవరయ్య. అవధాని వికటాట్టహాసం చేశాడు. "దేవుడు చెప్పాడా నీకు? ఏ దేవుడయ్యా! రంకు దేవుడా? మహా తపస్సు చేసిన వాళ్ళకి దిక్కులేదు కాని...."

"నాకు దేవుడు కనిపించాడు. నేను దేవుణ్ణి చూశాను" అన్నాడు మొండిగా గవరయ్య. అపుడతని కళ్ళు మెరిశాయి.

"ఇప్పుడయినా దాన్నీ, ఆ పిల్లాణ్ణీ ఎక్కడికేనా పంపించేసేయ్. ఇంతటి అన్యాయాన్ని మేము ఒప్పుకోం" అన్నాడు కరణం. "నిన్ను గుడి ఛాయలకి కూడా రానివ్వం" అన్నాడు అవధాని. "ఊరు వూరంతా ఏకమవుతుంది గవరయ్యా! మంచిగా చెబితే వినడంలేదు నువ్వు. మేమంతా చేతులు కట్టుక్కూర్చోలేదు జాగ్రత్త" అన్నాడు మున్సబు.

ఒక్కసారి గవరయ్య లేచాడు. గోడవారనే వున్న గునపం తీశాడు. "ఎవఱ్రా! నాయాల. నామీదకొచ్చే వాడెవఱ్రా, నేనొకరి సొమ్ము తిన్నానా. అసలు మిమ్మల్నిక్కడకు రమ్మన్నానా? నువ్వెవడివయ్యా నాకు నీతులు చెప్పడానికి? నా యవ్వారంలో జోక్యం చేసుకుంటే ఒక్క ఏటుకి తెగేస్తాను. రమ్మను ఎవడొస్తాడో" అని అరిచాడు గవరయ్య. అతని వొళ్ళు ఆవేశంతో వూగిపోయింది. అతను పేలుతున్న అగ్ని పర్వతంలా వున్నాడు. అతని ఆకారం అతని రౌద్రం చూసేసరికి వెట్టివాడు భయపడి నోరావలించాడు. అవధాని లేచాడు. తక్కిన వాళ్ళందరూ కూడా లేచారు. "అయితే దాన్ని వదలవన్నమాట" అన్నాడు అవధాని.

"వదల్ను" అన్నాడు గవరయ్య.

"అయితే నిన్ను వెలేస్తున్నాం. చాకలి, మంగలి రానేరారు సరికదా నీ పొలం పనులకి, పాలేరు తనానికి ఎవరోస్తారో చూస్తాను" అన్నాడు అవధాని.

మున్సబు వెట్టివాడికేసి చూసి "ఈవేళ వూళ్ళో టముకు వెయ్యరా" అన్నాడు.

గవరయ్య ఉగ్రంగా వురిమి చూసి "పొండయ్యా పెద్ద మనుషులూ ఇలాంటి యెదవ్వూళ్లో వుండమన్నా వుండను. నా పిల్లాణ్ణి యీ యెదవల మధ్య తిరగనివ్వను. థూ!" అని కాండ్రించి వుమ్మేశాడు. వెళ్ళిపోయే అవధాన్నీ, బృందాన్నీ చూస్తూ.

వారం రోజులు తిరిగేసరికి గవరయ్య ఇల్లు తాళం వేసి వుంది. గవరయ్య టౌనులో ఇల్లు కొన్నాడనీ, ఇక్కడ ఊళ్ళో ఇల్లూ, పొలమూ అమ్మకం పెట్టేడని తెలిసింది.

**(జ్యోతి మాసపత్రిక - 1964)** ◆






# గతానికి చేయూత విధ్వంసానికి ఎదురీత

- డా. డి. శ్రీనివాసులు
9494696990

"ఒంటరి" తాజాగా తానా బహుమతి పొందిన నవలల్లో ఒకటి. రచయిత సన్నపురెడ్డి వెంకటరామి రెడ్డి. ఒంటరి నవల ప్రధానంగా వర్షాభావంతో, కరువు కాటకాలతో, అభివృద్ధి పేరుతో ప్రపంచీకరణ పేరుతో జరుగుతున్న విధ్వంసంతో ఒంటరిగా పోరాడుతూ ఆధునికతను సంతరించుకుంటున్న సమాజానికి దూరంగా ఉంటూ వాటి ప్రలోభాలకు లొంగకుండా ఆధునికతనూ, అది అందిస్తున్న జీవన సౌకర్యాలనూ అనుభవించకుండానే ప్రకృతితో మమేకమై ఆ ప్రకృతి ఒడిలో హాయిగా, ఆరోగ్యంగా జీవిస్తున్న కష్టజీవి, మట్టిమనిషి, ఎవరినీ దేహీ అని అడగని స్వాభిమాని, ఆదర్శప్రాయుడూ అయిన ఒక రైతు జీవితాన్ని ఆవిష్కరించింది. ఈ నవల పేర్కొన్న సమకాలీన సమస్యలు, వాటి పట్ల రచయిత వైఖరి, దృక్పథం చర్చించదగ్గవి.

నవల్లో కథకుడైన రాఘవ ప్రధాన పాత్రగా కనబడుతున్నా కథానాయకుడు మాత్రం రైతు నరసయ్యే. కథకుడు రాఘవ, రైతు నరసయ్యలు ఇంచుమించు ఒకే భావజాలం, ఆలోచనా విధానం కలవాళ్ళు. కానీ జీవితాన్నీ దాని పరమార్థాన్ని అర్థం చేసుకోడంలో, జీవితానికీ ప్రకృతికీ ఉన్న సంబంధాన్ని గుర్తించడంలో, జీవకారుణ్యంలో, సాహిత్య సామాజిక అవగాహనలో అనేక పర్యాయాలు నరసయ్య ముందు రాఘవ తేలిపోతాడు. నాగరికుడు, అక్షర సంపన్నుడైన రాఘవను గ్రామీణుడూ, అల్పాక్షరకుక్షి అయిన నరసయ్య ముందు ఓడగొట్టడం రచయితకు ఇష్టమైన కార్యం. అయినా ఇద్దరిలో ఉన్నది రచయితే. "ఇందులో డాక్టర్ రాఘవనూ నేనే. రైతు నరసయ్యనూ నేనే" అని ఆయన స్వయానా చెప్పుకున్నారు.

గతకాల జీవన సంప్రదాయాన్ని నెమరు వేసుకోవడం ఈ నవల్లో ప్రధానంగా కనబడుతుంది. అది కాస్తా ముదిరి గతకాలపు జీవన విధాన వ్యామోహం (నోస్టాల్జియా)గా కూడా అనిపిస్తుంది. రచయిత కాలాన్ని మునుపటిలా కార్తెల్లో కొలవడాన్ని ఇష్టపడతారు. తను బాల్యంలో రుచిచూసిన సంగటిముద్ద, బెండకాయ పచ్చడి, ఊరిమిండి, ఉల్లిగడ్డ నంజుడు ఉన్న మజ్జిగ సంగటి, కొర్రన్నము పచ్చిపులుసు, వరిబువ్వ గోవాకుపచ్చడి, తెల్లావాయికారం లాంటి వాటి పట్ల అభిమానం ప్రకటిస్తారు. గతంలో మనుషులందరూ ఆరెకలు, కొర్రలు, సామలు లాంటి తృణధాన్యాలను ప్రధాన ఆహారంగా తీసుకుంటూ ఆరోగ్యంగా జీవించేవారని గతకాల జీవితం పట్ల మొగ్గు చూపుతారు. ఆరెకలు, వాటిని పండించడం, కల్లం జెయ్యడం, రాలగొట్టడం, బియ్యం జెయ్యడం, వాటి పొట్టు దిబ్బలో కూడా కుళ్ళకపోవడాలను తలచుకుని మురిసిపోతారు.

ఆయిలింజన్లు ఆపై కరెంటుమోటార్లు వచ్చాక వాడకం నుండి తొలగిపోయిన కపిలను దాని అనుబంధాలైన బొక్కెనగుండు, కపిలబిల్ల, పుల్లీసులు, కపిలమోకు, బారిగుంత, నీల్లదోని, కొమరుగొయ్యలు, చౌకట్లను అలాగే వాళ్ళమ్మ ఏకులతో దారం వొడుకుతూ ఉండిన రాట్నాన్ని నరసయ్య గతస్మృతులుగా ఉంచుకున్నాడని అంటారు.

రచయిత అంతరించిపోతున్న తృణ ధాన్యాలను పరిరక్షించుకోవాలనే తపనతోనే ఈ నవల రాశారు. డా. రాఘవ చక్కెరవ్యాధి నుండి తన ఆరోగ్యాన్ని రక్షించుకోవడానికి అంతరించిపోతున్న ఆరెకలు ఉన్న ప్రాంతాన్ని అన్వేషించడం, అందులో భాగంగా జ్యోతిక్షేత్ర(కాశినాయన) సమీపంలోని ఒంటికొట్టం చేరుకొని రైతు నరసయ్యను ఒప్పించి ఆరెకల పంట సాగు జెయ్యడం, నరసయ్య రైతుగా తన అనుభవాన్ని, వ్యవసాయ తాత్త్వికతను ఉపయోగించి, ప్రకృతికి ఎదురొడ్డి పంటను తీయడం ఇందులో ప్రధాన ఇతివృత్తం. కథ మధ్యలో కాస్త దారితప్పినట్టు(రాములమ్మ ఆకర్షణలో) కనిపించినా రచయిత లక్ష్యం మాత్రం ఆరెకలే. రచయిత బాల్యంలో రుచిచూసిన ఆరెకలు, కొర్రలు, సామలు, ఉలువలు లాంటి తృణధాన్య జాతులను సజీవంగా నిలుపుకోవాలని తాపత్రయం ప్రదర్శిస్తారు.

ఈనాడు ప్రపంచీకరణ, ఫలితంగా ప్రకృతి విధ్వంసం విచ్చలవిడిగా జరుగుతున్నది. ప్రకృతిని అందులో భాగాలైన వృక్షజాతులను, వన్యప్రాణులను రక్షించుకోవాలన్న తపన ఈ నవల నిండా కనబడుతుంది. ప్రపంచీకరణ, ఆధునీకరణ ఫలితాలుగా పొలాల్లో ఉన్న వృక్షాలను అమ్మి సొమ్ము చేసుకోవాలని, కుంటల్లో ఉన్న అడవిని నరికి పొలాలుగా మార్చుకోవాలని పట్టుబట్టే కొత్తతరం కొడుకులకూ గతకాలపు గుర్తులుగా అడవి జీవాలకు, పక్షులకూ ఆవాసాలుగా ఉన్న ఆ వృక్షాలను, అడవులనూ రక్షించుకోవాలని చూసే పాతతరం తండ్రులకూ మధ్య నలుగుతూ చిన్నాభిన్నం అవుతున్న ఉమ్మడి కుటుంబాలను చూసి రచయిత బాధను వ్యక్తం చేస్తారు. పాత జీవిత విధానమే ప్రకృతికి రక్ష అని దానివైపు మొగ్గు చూపుతారు. కథకుడు రాఘవ కబోది పక్షులను కాపాడ్డానికి వృక్షాలను అమ్మి నరికివేయబోతున్న రైతుల నుండి కొని మరీ వాటిని రక్షించాడని కథనం చేసారు. రాఘవ, నరసయ్యలు తోడేళ్ళు, పెద్దనక్కలు, రాబందులు అంతరించి పోతున్నాయని తెలిసి చాలా బెంగపడ్డారు. అడవులకు పోయి వాటిని చూడాలని ఉత్సాహపడతారు.

ఉమ్మడి కుటుంబ వ్యవస్థను ఛిద్రం చేసే ప్రపంచీకరణ ఫలితాలైన రోడ్డు బస్సు టౌను వీటి మీద మోజును, నరసయ్య కొడుకు నరసింహలా పల్లెలు వదిలి టౌన్లకు వలసపోవడాన్ని, చదువులు చదివి పని చెయ్యకుండా బతకాలని అనుకోడాన్ని రచయిత ఒప్పుకోడు. దాన్నే నరసయ్య చీదరింపుల్లో వ్యక్తం చేస్తాడు. ఇంటిల్లిపాదికీ తల్లిలా సేవలు చేసే ఇల్లాలు ఓబులమ్మలూ, మగాడిలా తల్లిదండ్రులకు సేద్యంలో చేయూత నిచ్చే కూతురు రాములమ్మలూ, ఎంత సేవ చేసినా కోడళ్ళను తిట్టిపోసే ముసలి గంగమ్మలూ ఉన్న ఉమ్మడి కుటుంబ వాతావరణాన్ని రచయిత అభిమానిస్తాడు.

మానసిక శారీరక ఆరోగ్య పరిరక్షణ, ఇంద్రియ శక్తుల ఉన్నతీకరణ రచయితకు అభిమానపాత్రమైన విషయాలు. ఆధునిక వైద్యానికి లొంగని రోగాలు సహజసిద్ధమైన ప్రకృతివైద్యంతో నయం అవుతాయని ఆయన అభిప్రాయం. తలకాడు వద్ద ఒక సాధువు కథకుడు రాఘవకు అతని మధుమేహ వ్యాధికి "ఆరికల భోజనం, ఆకునీడల్లో నివాసం, పొలం మట్టిలో నడక, పచ్చని గరికపై విశ్రాంతి, సెలయేటితో సావాసం, నీటిగుంటలతో సాయంత్రం కొండకోనల్లో విహారం, కొమ్మల్లోని ఫలాల ఆహారం" అంటూ ఒక పాట రూపంలో వైద్యం చెప్పాడంట. రైతు నరసయ్యకు సహజంగా అబ్బిన స్పర్శశక్తిని, వినికిడిశక్తిని, వాసనను పసిగట్టగల శక్తిని తాను కూడా కూడగట్టుకోవాలని కథకుడు రాఘవ చాలా ప్రయత్నిస్తాడు. కూతల్ని బట్టి పిట్టల్ని గుర్తించాలని, ఆకుల్ని చూసి ఏ చెట్టో కనుక్కోవాలని కుతూహలపడతాడు. మనిషికి నరసయ్య లాగా తింటూ తింటూ నాలుక కొరుక్కునేటంతగా, శరీరం చెమటలు కక్కేంత వేడివేడి సంగటి తినేటంతగా ఆకలి ఉండాలని, రెప్పవాల్చగానే నిద్ర ముంచుకు రావాలని రచయిత అభిప్రాయపడతాడు.

ఒకప్పటి కడపజిల్లా గ్రామీణ జీవితాన్ని, పల్లె వాతావరణాన్ని బయటి ప్రపంచానికి అందించడం కూడా రచయిత ఉద్దేశంగా కనబడుతుంది. కొట్టపిల్లూ, దాని చుట్టూ తడిక, ఇంటిలో ఉలవపొట్టునూ ధాన్యాలనూ దాచుకునే మచ్చు(అటక), వాటిలో విత్తనపు తృణధాన్యాలను దాచుకునే సొరకాయలు, పొదిగిన కోళ్ళు, గొర్రెపిల్లలు, పాడిపశువులు, నులకమంచాలపై వదురుతూ ఉండే ముసలమ్మలు, ఆడవాళ్ళు మజ్జిగ చిలికే జుర్రుబర్రులు, పొరకతో ఊడ్చే

గరగరలూ ఉన్న ఇంటి వాతావరణం పట్ల మక్కువ కనబరుస్తారు. వేప ఉత్తరేణి పుల్లలతో పళ్ళు తోముకోడాన్ని గొప్పగా చెబుతారు. ఆధునిక విలాస వస్తువైన కారుకు ఎగురుకుంటా వొచ్చి చెట్టుకింద వాలిన తెల్లకొంగ, ఎదకొచ్చిన పల్లావు, సాకిరేవు నుండి సుడిగాలికి ఎగిరొచ్చిన తెల్లపంచె, కొండదడిలో మొయిలు లాంటి సహజ గ్రామీణ ఉపమానాలను నరసయ్య చేత చెప్పిస్తారు. ప్రకృతి నుండి ఎంత అననుకూలత ఎదురైనా పంట పండించి తీరుతాననే రైతుదనాన్ని మెచ్చుకుంటారు. పాత్రోచిత భాషగా కడప యాసను శక్తివంతంగా(ఇతరుల్లా కలగాపులగం చెయ్యకుండా) ప్రయోగించి దాని కమ్మని వాసనల్ని ఆస్వాదింప జేశారు.

పాతకాలంనాటి ఆటలు, కళలు అంతరించి పోతున్నాయని, వాటిని పునరుద్ధరించాలని రచయిత తహతలాడతారు. పశువుల్ని కాయడానికి వచ్చిన నరసయ్య తరంనాటి ముసలాళ్ళు చిత్తకట్టె తిప్పాలని, కులుకుడుభజనలో అడుగులు వెయ్యాలని, చెక్కపలకలు ఊపాలని ఇంకా బలిగుడు, సిర్రిపట్టె, డోలుపట్టె, పుట్టచెండు, రాతిగోలిగుండు, బొంగరాలు ఆడాలని ఉబలాటపడతారు. వాళ్ళు సద్దెన్నం పంచుకు తినడాన్ని రచయిత అపురూపంగా వర్ణిస్తారు. ఆ దృశ్యాల్ని కథకుడు రాఘవ ఫోటోలు, వీడియోలు తీశాడని అంటారు.

జీవితవాస్తవాలను అవి ఎలాంటివైనా జీర్ణించుకోవాలనే అభిమతం ఈ నవల్లో కనబడు తుంది. భర్త ఆదరణ లేని రాములమ్మ తను దైహికవాంఛలకు అతీతంగా మగాడిలా మారిపోయా నంటుంది. తన అత్త తననుండి తన బిడ్డను దూరం చేస్తే పాలుపట్టలేక రొమ్ములు గడ్డలు కట్టి నొప్పులు భరించలేకపోతే తన తల్లి ఓబులమ్మ తన రొమ్ముల నుండి పాలు పిండి పడేసేదని చెబుతుంది. పొలం వద్ద పొదల్లో లైంగికవాంఛలు తీర్చుకుంటున్న ఒక యువజంట కథకుడు రాఘవ కంటబడుతుంది. ఇలాంటి పరిస్థితిలోనే ఒకసారి వయసు మళ్ళిన నరసయ్య, ఓబులమ్మ దంపతులు కూడా అతని దృష్టిలో పడతారు. వీటి ద్వారా రచయిత మనిషి కడుపుకు ఆకలి లాగే దేహానికి శృంగారం అవసరమని దానికి వయస్సు, స్థలం, సమయం, సందర్భం ఇలాంటి వాటితో పనిలేదని చెప్పకనే చెప్పారు. అలాగే కథకుడు రాఘవ తనకెలాంటి శారీరక వాంఛలు లేకున్నా ఆడ తోడు కోసం, ఆయన భాషలో ఫ్రెండ్ కోసం(రాములమ్మ కోసం) ఒంటికొట్టంలోనే ఉండిపోవాలని నిర్ణయించుకుంటాడు. పాతకులు కూడా తమ చివరి జీవితాన్ని పల్లెకోసం పల్లెలో గడపమని రచయిత కథకుని చేత వాచ్యం చేయిస్తారు.(ఆ చెప్పేదేదో జీవితమంతా పల్లెలో గడపమని చెప్పుంటే అందులో సిన్సియారిటీ కనబడేది)

రాఘవ మాటల్లో రచయిత పైకి భౌతికవాదిగా కనిపించినా వైద్య రంగంలో ఎంతో ఎత్తుకు ఎదిగిన కథకుడు డా. రాఘవకు ఆరెకల గురించి ఖండాలాలో సిద్ధపురుషుడు, తలకాడు వద్ద ఓ సాధువు సూచిస్తే గాని తెలియలేదనడం, బ్రహ్మంగారి మఠం, జ్యోతి క్షేత్రాల్లో ఏదో మహత్తు ఉందని ధ్వనింపజేయడం ఆయనలోని భావవాదాన్ని తెలుపుతున్నది.

మనిషి తన బాల్యం నాటి ప్రకృతి, జీవన సంప్రదాయాలూ విరూపం కావడాన్ని జీర్ణించు కోలేడు. కానీ మార్పు అనేది సహజం. అడవులు నరకివేయబడి పంటచేలు కావడం, పంటచేలు చదును చేయబడి మడికయ్యలుగా మారడం, మడికయ్యల రూపం మారి వాటిపై భవనాలు లేయడం, అలాగే ఆహారధాన్యాల వాడకం, వంటా-వార్పులు, వేషభాషలూ, పండుగలూ-పబ్బాలూ, ఆచార-వ్యవహారాలూ క్రమంగా మార్పుకు గురి కావడం... ఇదంతా నాగరికతా పరిణామంలో తప్పదు. ఇందులో రచయితలూ, మేధావులూ, ఉద్యమకారులూ చెయ్యగలిగింది ఈ మార్పులు పెడదారి పట్టకుండా అడ్డుకుని మానవ సంక్షేమ మార్గం తొక్కించడమే. ఈ రెండు రకాల తపనా రచయిత ఇందులో చక్కగా పండించారు.

ఒకటి మాత్రం వాస్తవం. వెంకట్రామిరెడ్డి గారు ఆవేదన పడింది, చిత్రించింది తినడానికి తిండి, కట్టడానికి బట్ట, ఇండ్లు, వాకిండ్లూ, భూములు, బావులు, బోర్లు, కుంటలు, పశుసంపద ఉన్న రైతు జీవితాన్ని గురించే గాని అవేవీ లేకుండా ఆ రైతుల కాళ్ళ వద్ద బానిస బతుకులు బతికే పేద బడుగు జనాల గురించి ఎంత మాత్రం కాదు. చివరకు కథకుని(అతని రూపంలో ఉన్న రచయిత)నోట తన కారు డ్రైవర్ గురించి ఒక వాక్యం కూడా రాలేదు. గొర్లకాపర్ల గురించి నాలుగు మాటలు ఉన్నా అది కూడా దొంగగా రైతుల పంటపొలాలు మేపుకుపోయ్యేవారిగా మాత్రమే. పూర్వం ఒకానొక చోట ఒక సంత జోరుగా సాగుతూ ఉందట. అప్పుడు అక్కడ ఒక మోస్తరు వాన కురిసింది. సరుకులన్నీ తడిశాయి. వ్యాపారస్తులంతా వగచినారు. ఆ సంతకు వెళ్ళిన ఒక

# ఆకలి కేకలు

- పి.వి.ఎల్. సుజాత
7780153709



సరిగమలతో రాగాలల్లి
జనులను రంజింప చేసే స్థితి కాదు వారిది
నీరసించిన గుండె సవ్వడిని
డప్పుల చప్పుడుగా మార్చి
తిండి లేక తేలికపడ్డ శరీరాన్ని
అలవోకగా తాడుపై ఆడిస్తూ
రాలిన మెతుకులతో
ప్రాణాన్ని పూటలు దాటించే
గారడీ మనుషులు వాళ్ళు
వారి ఎండిన డొక్కల
ఆకలి కేకలకు స్పందించేవారేరి..?
అదే ఆట టీవీలోనో, యూట్యూబ్‌లోనో
కనిపిస్తే ఆశ్చర్యంగా
కళ్ళు, కాలం అప్పగించేస్తాం..
అదే మన వీధిలోనో, రహదారిలోనో ఎదురైతే..
మనం బిజీ మనుషులం
వారి ఆకలి చప్పుడు
మన చెవులకి చేరదు
వారి చిక్కిన దేహాలు
మన కళ్ళని ఆకర్షించలేవు
వారి డప్పులు, తిప్పలు
మెప్పులకోసమో, గొప్పలకోసమో కాదు
మెతుకులకోసం, బ్రతుకుటేరు దాటడం కోసం
వారికోసం పోరాడమనడంలేదు!!
వారిని ఆదరించి,
అందలం ఎక్కించమనడం లేదు
వినోదం కోసం మీరు వెచ్చించే
మీ విలువైన కాలంలో ఐదు నిమిషాలు
ఒక్క ఐదు నిమిషాలు వారి జోలెలో వెయ్యండి
మీ సరదాలకు వెచ్చించే డబ్బులో
ఐదో, పదో కూడా....
వారు ముష్టివారు కాదు కష్టజీవులు..!!
వారికి తెలిసిన కళని
కడుపు నింపుకోవడం కోసం
వాడుకునే శ్రమజీవులు..!! ♦

---

గ్రామీణుడు తన గ్రామానికి వచ్చి వ్యాపారస్తుల వగపును వర్ణిస్తూ "ఉప్పోడూ పులిశ, పప్పోడూ పులిశ, తమలపాకులోడు మాత్రం సంతంతా పొర్లి పొర్లి ఏడిశ" అని చెప్పాడంట. ఈ నవల్లో వ్యవహారం కూడా తమలపాకులవాడి లానే ఉందని వేలెత్తి చెప్పనక్కరలేదు.

ఈ మధ్య కొంతమంది కవులు తమ మనసులో ఏముందో, తమ ధ ృక్పథం ఏమిటో పద్యంలో అభివ్యక్తి చెయ్యలేక తమ పద్యాలకు తామే ప్రతిపదార్థ తాత్పర్యాలు, భావాలూ రాస్తూ తమ పద్యంలో ఏదో చిదంబర రహస్యం దాగున్నట్లు చూపించడానికి నానా తంటాలు పడుతున్నారు. కొంతమంది రచయితలు నీతుల్ని, లోక రీతుల్ని, బోధల్ని ప్రసన్న కథాకథన పద్ధతిలో ధ్వనింపచెయ్యలేక వాచ్యం చేస్తున్నారు. తమ ద ృక్పథానికి వస్తురూపం ఇవ్వలేక పనిగట్టుకుని విశ్లేషిస్తూ, వ్యాఖ్యానిస్తూ తమ చాపల్యాన్ని వెల్లడించుకుంటున్నారు. నన్నయకు, అల్లసానికి వారసులైన మన కవులూ రచయితలూ ఇకనైనా ఈ సూక్ష్మాన్ని **(technic)** గ్రహింతురు గాక. ఒంటరి నవల్లో కూడా ముగింపు వాచ్యం కావడం వల్ల అది ధ్వనికావ్యగౌరవం పోగొట్టుకున్నట్టయింది. ఏది ఏమైనా అంతరించిపోతున్న ఆరోగ్యదాయినులైన తృణ ధాన్యాలను పరిరక్షించుకోవాలని ప్రపంచీకరణ, ఆధునీకరణల వల్ల విరూపమైపోతున్న ప్రకృతి అనుకూలమైన పాత గ్రామీణ జీవన సంప్రదాయాన్ని, ఉమ్మడి కుటుంబ వ్యవస్థను పునరుద్ధరించాలని ఒంటరి నవల బలంగా ఆకాంక్షించింది అనడంలోనూ, సదరు ఆకాంక్షను ప్రతిభావంతంగా, ప్రభావవంతంగా చిత్రీకరించింది అనడంలోనూ అతిశయోక్తి లేదు. ♦

# పెళ్ళి మంత్రాల్లో సమాజ దర్శనం



- సింహాద్రి నాగశిరీష

మానవ జీవన ప్రస్థానాన్ని ఒక్కసారి పరికించి చూస్తే, వానరంగా, ఆదిమమానవునిగా జీవనాన్ని ఆరంభించి, క్రమంగా నాగరిక జీవనంలోకి నరునిగా రూపాంతరం పొందాడన్నది వాస్తవం. అయితే ఇక్కడ అనాగరిక, నాగరికత అనే అంశాలను పరిశీలిస్తే... ఎలాంటి కట్టుబాట్లు లేక ఆటవికంగా, జంతుప్రాయంగా బ్రతికిన కాలాన్ని అనాగరిక దశ అని, బుద్ధి వికసించి మంచి చెడు విచక్షణలు తెలుసుకుని క్రమశిక్షణతో కూడిన జీవనాన్ని గడపడాన్ని నాగరిక దశ అని చెప్పుకునే అవకాశం ఉంది. ఈ క్రమంలో మనిషి ఎన్నో ఆటుపోట్లు, ఎదురుదెబ్బలు తిన్నాడు. మంచి అనుకున్నది కొనసాగించాడు. చెడు అనుకున్నది విసర్జించాడు. కానీ ఏది మంచి? ఏది చెడు? అనేది ఏయే ప్రమాణాల ఆధారంగా నిర్ణయించాడనేది కొంచెం ఆలోచించాల్సిన విషయమే. ఎందుకంటే.... అంతా మంచినే అవలంబిస్తే... ధనిక-బీద అనే భేదాలెందుకు ఏర్పడినట్లు? ఉత్తమ కులం-అధమ కులమనే శాఖలు ఎలా ఏర్పడినట్లు? ఇలా చాలా చాలానే సందేహాలు మొదలౌతాయి. సరిగ్గా ఇక్కడే మనకు 'మమ' అనుకోమనే మధ్యవర్తుల అసలు రూపం కనబడుతుంది. ఇదంతా ఒక ఎత్తు అయితే... మనిషి నాగరిక ప్రాణిగా మారిన నాటి నుండి, ఇతర గ్రహాలపై కాలుమోపుతూ, పంచభూతాలపై కూడా పట్టు సాధించుకునేంతగా శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందిన నేటి వరకూ మనిషి జీవితంలో ఓ ప్రత్యేక స్థానం ఏర్పరచుకున్న ఓ తంతు ఉంది. అదే 'పెళ్ళి'. తాపీ ధర్మారావు తమ 'పెళ్ళి-పుట్టుపూర్వోత్తరాలు' అనే పుస్తకం ద్వారా అసలు ఈ వివాహతంతు ఎలా మొదలైంది అనే అంశం మొదలుకొని సూత్రాలుగా మొదలైన ఇలాంటి ఆచారాలే శృంఖలాలై ఎలా కట్టిపడేశాయో కూలంకషంగా చర్చించారు.

అయితే ముఖ్యంగా నేటి యువత కాస్త ఆలోచించాల్సిన విషయం ఒకటుంది. అదే... పెళ్లి తంతులో చదివే మంత్రాలకు అర్థమేమిటి? ఆ సందర్భంలో పురోహితుడు జరిపించే క్రతువులకు అర్థమేమిటి? పగటిపూట అరుంధతీ నక్షత్ర దర్శనమేంటి? ఈ కాళ్లు కడగటాలేంటి? అగ్ని చుట్టూరా ప్రదక్షిణాలేంటి? బహుశా వివాహం చేసుకునే సందర్భంలో కూడా ఏ వధూవరులకూ ఇదంతా ఎందుకు? అనే ఆలోచన వచ్చి ఉండకపోవచ్చు. తెలుసుకోవాలనే ఆలోచన ఉంటే మాత్రం వెనిగళ్ళ సుబ్బారావు రచించిన 'పెళ్ళి మంత్రాల బండారం' అనే పుస్తకాన్ని చదవాల్సిందే. మంత్రాల అర్థం తెలియదు కాబట్టి ఈ అర్థంకాని మంత్రాల గొడవ మనకెందుకులే అనుకునో లేక పెళ్ళి పేరుతో వృథాగా ధనం ఖర్చుచేయటం దండుగ అనుకొనో చక్కగా రిజిస్టరు మ్యారేజీ చేసుకుంటున్నవారూ లేకపోలేదు. కొంతవరకూ ఇది కూడా సబబే. కానీ విషయాన్ని పూర్తిగా తెలుసుకోకుండా వదిలేసే

బదులు, అసలు విషయాన్ని అంతుతేల్చి ఉద్వాసన చెబితే పోయేదేముంది. విషయజ్ఞానం తెలియటం తప్ప... దానివలన మనం చేస్తున్న పనికి నూటికినూరుపాళ్ళూ న్యాయం చేసినవాళ్ళమవుతాము కదా...

ఈ పెళ్ళి మంత్రాలలో మనకు బాగా సుపరిచితమైన శ్లోకాలూ, సాధారణంగా మనం చూస్తూవస్తున్న క్రతువుల బండారం ఏంటో చూద్దామా.....

"అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజ
హెూతారం రత్న ధాతమమ ॥ (ఋగ్వేదం1-1)

తా॥ యజ్ఞదేవత, హెూత, ఋత్విజుడు, యజ్ఞఫల రూపమైన రత్నాలను ధరించువాడు, పురోహితుడు అయిన అగ్నిని నేను ప్రార్థించుచున్నాను.

దీనిని బట్టి పురోహితుడంటే సర్వభక్షకుడైన అగ్నిహెూత్రుడని పూర్వులే నిర్ణయించారు. ఈ విషయాన్ని ఇంతగా ఎందుకు నొక్కిచెప్పవలసి వచ్చిందో ముందుముందు అర్థమవుతుంది.

"అగ్ని ప్రాశ్నాతు ప్రథమస్సహి వేద యదాహవ్ని ।
అనష్ట మస్మాకం కృన్వన్బ్రాహ్మణో బ్రాహ్మణేభ్య ॥"

దేవతలలో మొదటివాడు, బ్రాహ్మలలో శ్రేష్ఠుడు అయిన అగ్నిహెూత్రుడు మాకు నష్టాన్ని కలిగించక ఆజ్యాది హవిస్సు ఏ రీతిగా ఉంటుందో తెలుసుకుని భక్షిస్తాడు అని కన్యాదాన సమయంలో వరుడు కోరుకుంటాడు. దీనికి సంబంధించి భారత సభాపర్వంలోని కథను చాలా ఆసక్తికరంగా వివరించారు వెనిగళ్ళ.

ఇక నిశ్చితార్థసమయంలో తిథులు, నక్షత్రాలు వగైరా పరిశీలించి, ముహూర్తాలు నిర్ణయించుకుని, తాంబూలాల తంతు ముగిశాక, బంధువులకు సుగంధద్రవ్యాలు సమర్పిస్తారు. పురోహితులవారిని ఆనందపరుస్తారు. అప్పుడు ఆయన

" ధ్రువంతే రాజావరుణో ధ్రువం దేవో బృహస్పత్ని
ధ్రువంత ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం
ధ్రువం ధ్రువేణ హవిషా తస్మై దేవా అధి బ్రువన్
ఆయంచ బ్రహ్మణస్పత్ని ॥"

తా॥ మీ దాంపత్య జీవితసామ్రాజ్యాన్ని ధరించునట్టి రాజైన వరుణుడు, దేవుడైన బృహస్పతి, ఇంద్రుడు, అగ్ని, వేదమూర్తి అయిన బ్రాహ్మడు శాశ్వతత్వాన్ని కలిగింతురు గాక.

ఆ సందర్భంలో రచయిత ఒక మాట అంటారు.

'ఊర్వశి అంగాంగ సౌందర్యాన్ని చూసి ఉక్కిరిబిక్కిరై ఆవిడ సంగమాన్ని కోరిన వరుణుడు, నిండుగర్భిణి వదిన అయిన మమతను బలవంతం చేసి సంభోగించిన బృహస్పతి, గురుపత్ని అహల్యను అదునుచూసి, ఆవిడ పొందుతో విందారగించిన దేవేంద్రుడు, సప్తఋషుల సతీమణుల్ని చాటుగా సంభోగించి కడుపులు చేసి, వారి కాపురాలు కూల్చిన అనాచారపు దిట్ట అయిన అగ్నిభట్టారకుడు, వేదాలనే వేశ్యవృత్తిలో దేశాన్నే భోగిస్తున్న భూసురులు అయిన బ్రాహ్మలు ఈ వధూ దాంపత్య సామ్రాజ్యాన్ని ఏ విధంగా స్థిరపర్చగలరో ఆలోచించవలసిన అవసరం లేదా?' అని. మరి ఉందో లేదో గమనించగలరు.

కన్యాదాన సమయంలో చెప్పే.....

"అష్టవర్షా త్వియం కన్యా పుత్రవత్పాలితామయా
ఇదానీం తవదాస్యామి దత్తాం స్నేహేన పాలయ"

తా॥ పుత్రుడితో సమానంగా పెంచబడిన ఎనిమిది సంవత్సరాల వయస్సు గల ఈ కన్యను నీకు ఇస్తున్నాను. నీవు ఆమెను ప్రేమాభిమానాలతో కాపాడు అని అర్థం.

ఎనిమిది సంవత్సరాల వయస్సు ఉన్న కన్యను పెళ్ళిచేసుకుని, ఆ పెళ్ళికొడుకు ఏం చేసుకుంటాడు. అచ్చనకాయలు ఆడుకుంటాడా లేక గుజ్జనగూళ్ళు తినిపిస్తూ జోలపాడుతూ కాపాడుతూ ఉంటాడా. ఇప్పటి పరిస్థితుల ప్రకారం అటువంటి కన్యాదానాలు ఎవరైనా చేస్తే ఆ కన్యాదాతను, కన్యాదాన గ్రహీతను ప్రభుత్వం వారు కటకటాల వెనుక కూర్చోబెట్టి, 'శతం జీవ సుఖీభవ' అని ఆశీర్వదిస్తారనే వెనిగళ్ళ వారి చురక ఆలోచించవలసిందే. నిజమే కదా! అప్పటి కాలమాన పరిస్థితులకు అనుగుణంగా ఆ శ్లోకం సరైనదే కావచ్చు. నప్పవచ్చు. కానీ ఇప్పటి సమాజం అది కానప్పుడు, అలా లేనప్పుడు సందర్భశుద్ధి లోపించినట్టే కదా! ఆ శ్లోకానికి కాలం తీరినట్టే కదా!

ఇక తెర తొలగించిన తర్వాత దంపతులిరువురూ ఏకంగా కూర్చుంటారు. వారి బదులు 'పురోహితుడు' ప్రాణాయామము చేసి మనమిరువురమూ కలిసిమెలసి మంచిపనులు చేయాలి. సంతానం కనాలి అని సంకల్పిస్తారు.

వధువు పాపిటయందు దర్భతో తుడిచివేస్తాడు. ఆ తర్వాత జరిగే తంతుకీ, చదివే మంత్రాలకూ వెనుకనున్న ఆంతర్యం తెలుసుకున్న తర్వాత.... ఏ ఆడపిల్లా ఇలాంటి వివాహానికి అంగీకరించదు అనటంలో అతిశయోక్తి లేదు. ఎందుకంటే...

ఇవి చెప్పేందుకే కాదు, వినేందుకు కూడా హేయంగా ఉన్నాయి గనుక. ముఖ్యంగా స్త్రీల స్వాభిమానాన్ని దెబ్బతీస్తాయనటంలో ఏమాత్రం అనుమానంలేదు.

ఇక మాంగళ్యధారణ సమయంలో చెప్పే మంత్రం అందరికీ సుపరిచితమే. కానీ ఎటొచ్చీ అర్థమే తెలియదు. అదేంటో చూద్దాం.

శ్లో॥ మాంగళ్య తంతునానేన

మమజీవన హేతునా

కంఠే బధ్నామి సుభ గే

త్వం జీవ శరదశ్శతం ॥

తా॥ మంచి భగము గల ఓ అమ్మాయి! నా జీవన సుఖానికి కారణమైన ఈ మంగళసూత్రాన్ని నేను నీ మెడలో కట్టుచున్నాను. నీవు నూరు సంవత్సరాలు జీవించు.

ఇక్కడ ముఖ్యంగా తెలుసుకోవలసిన మంత్రం ఒకటి ఉంది. అది పాణిగ్రహణ సమయంలోనిది.

మం॥ సోమ్ణ ప్రథమో వివదే గంధర్వో వివిధ ఉత్తర్ణ తృతీయో

అగ్నిష్టెపతి స్తురీయస్తే మనుష్యజ్ఞా

తా॥ ఓ చిన్నదానా! చంద్రుడు మొదట పెనిమిటై నిన్ను పొందాడు. గంధర్వుడు రెండవ పెనిమిటై నిన్ను పొందాడు. అగ్నిహోత్రుడు మూడవ పెనిమిటై నిన్ను పొందాడు. మనుష్యజాతిలో పుట్టిన నేను నీకు నాల్గవ పెనిమిటినయ్యాను.

పెళ్ళి తంతులో జరిగే ప్రతి క్రతువుకీ, ప్రతి ఒక్క మంత్రానికీ అర్థాన్ని చెబుతూనే అందులో ఉన్న లోపాలు ఎత్తిచూపారు రచయిత. కొన్ని మంత్రాలను వింటుంటే ఒక బూతు తంతులా భావించి చెవులు మూసుకోవలసివస్తుంది కూడా. తప్పదు మరి.

ఒకనాడు వావి వరుసలు కూడా లేకుండా వర్తించాడు మనిషి. ఒక స్త్రీ అనేక మంది పురుషులతో జతకట్టటం, అది కూడా కన్నబిడ్డలతో జతకట్టటం జరిగేది. అది ఆనాటి వ్యవస్థ. నాటి కుటుంబానికి పెద్ద స్త్రీ. అది మాతృస్వామ్య వ్యవస్థ. అలాంటి సమాజం నుంచి పుట్టిన కథే ఒకటి చూద్దాం.

ఆది యుగంలో ఆదిశక్తి (దేవి) మూడు గ్రుడ్లు పెట్టి, ఆ గ్రుడ్ల నుండి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను తయారుచేసిందట. దేవి ఆజ్ఞల వల్ల వీరు ముగ్గురూ వరుసగా సృష్టి(పుట్టించటం), స్థితి( పోషించటం), లయ (నాశనంచేయటం) చేస్తారట. దేవి బ్రహ్మ, విష్ణువులను తన కామతృష్ణ తీర్చమని అడిగిందట. అందుకు వారు అంగీకరించనందువల్ల చిన్నవాడైన శివుడ్ని అడుగగా అతడు ఆమె మూడవ కన్ను, త్రిశూలము తనకిస్తే తల్లి కోరిక తీరుస్తానన్నాడట. అందువల్ల ఆమె మూడవ కన్ను, త్రిశూలము శివుడికీయగా, శివుడు తల్లియైన ఆదిశక్తిని ఆలిగా చేసుకొని సంతానం కన్న కథ.

దీనిని బట్టి చూస్తే మాతృస్వామ్య వ్యవస్థ గోచరమౌతుంది. నాటి కాలంలో .. కుటుంబం మొత్తం అంటే వ్యక్తులే కాదు, ఉత్పత్తి సాధనాలు కూడా తల్లి అనగా స్త్రీ అధీనంలోనే ఉండేవి. తర్వాత క్రమంగా ఒక స్త్రీకి ఒకే పురుషుడు అనే క్రమం, ఆ క్రమంలోనే ఉత్పత్తి సాధనాలు పురుషుని అధీనంలోకి వెళ్ళాక, చివరికి స్త్రీ కూడా ఒక ఉత్పత్తి సాధనమే అయింది. కాగా... వృత్తుల ఆధారంగా కులవ్యవస్థ ఏర్పడిన తర్వాత, తెలివిగల మధ్యవర్తులకు పెత్తనం ఒప్పజెప్పాక, వారు అతితెలివి ప్రదర్శించి, తమను తామే అగ్రవర్ణాలుగా చెప్పుకుంటూ, తమకు లాభం చేకూర్చేవారిని అందరినీ చెప్పుచేతల్లో ఉంచేసుకుని అందుకుగాను కావలసిన నీతిసూక్తులన్నీ రాసిపారేశారు.

మనిషనే ప్రతీవాడూ ఒకేలా జన్మిస్తాడు. ఒక్క భాగం నుంచే జన్మిస్తాడు. అదీ ఒక్క స్త్రీ నుంచే జన్మిస్తాడు. తలా తోకా నుండి, ఒక పురుషుని నుండి.... అది కూడా జననాంగం నుంచి కాక, కాళ్ళు వేళ్ళ నుంచి జన్మించే అవకాశం ఉందా? ఒక్కసారి ఆలోచించాలి.

ఇప్పుడంటే గోహత్యను ఖండిస్తున్నాం. కానీ ఒకప్పుడు యాగాది క్రతువుల్లో ఋషులకు, బ్రాహ్మణులకు ఇష్టమైంది అదే గోమాంసం. వేదాల్లోనే ఈ విషయం తేటతెల్లమైంది. పోనీ ఈ వేదాలు, పురాణాలు హేతువాదులు రాశారా అంటే అదీ కాదే..... బ్రాహ్మణులు తమ తెలివితేటలతో క్షత్రియుల్ని ఎలా చెప్పుచేతల్లో ఉంచుకున్నారో, మహాదానాల పేరిట ఏమేం దోచుకున్నారో అన్నీ వివరించారు రచయిత . ఒకే తప్పుకు ఒక్కో కులం వారికీ ఒక్కో శిక్ష, వైదికం పేరుతో, దోష నివారణ పేరుతో, పెళ్ళికూతురితో ముందుగా పురోహితులు సంభోగించటం అర్థరహితంగా, అమానుషంగా లేదూ...

ఇవన్నీ ఇప్పుడు లేకపోవచ్చు. కానీ పెళ్ళినాడు చదివే మంత్రాలకూ, క్రతువులకూ అర్థం మాత్రం ఇదే. ఇక్కడ ఆలోచించవలసిన మరో విషయం ఏంటంటే.... నాటి

సమాజంలో పెళ్ళి ముందు వరకు , ఒక స్త్రీకానీ, పురుషుడు కానీ ఎందరితోనైనా యథేచ్ఛగా సంభోగించటం సహజం. కనుక స్త్రీని శుద్ధి అనో, దోషనివారణ అనో శుద్ధిచేశారు అనుకుందాం. అటువంటప్పుడు అదే శుద్ధి పురుషునికి వర్తించదా???? అంటే కరడుగట్టిన పురుషాధిక్యత అని దీనిని అనవచ్చు కదా... మనకు తెలియని ఎన్నో విషయాలతో పాటు తెలుసుకోవలసిన మరిన్ని విషయాలు ఎంతో సమగ్రంగా వివరించారు వెనిగళ్ళ. కాబట్టి వాస్తవాలు తెలుసుకోగోరే యువతీయువకులు తప్పక చదువవలసిన పుస్తకం ఇది.

సాహితీ విశ్లేషకుల మాటనే ఇక్కడ ఉదాహరణగా తీసుకుందాం. ఏ సాహిత్య ప్రక్రియ అయినా సరే... కథ, కవిత, పాట, విమర్శ - ఆయా సమాజపు స్వభావాన్ని ప్రతిబింబించేదిగా ఉంటుంది. అప్పటి సమాజపు కట్టుబాట్లు, లొసుగులు, లోటుపాట్లు అన్నీ వాటిలో స్పష్టంగా గోచరమౌతాయి. అలాంటప్పుడు ఈ శ్లోకాలూ, ఆచారాలు కూడా ఇందుకు మినహాయింపు కాదు. ఎలాగంటారా? ఒకనాటి సమాజంలో పిల్లలు కన్న స్త్రీలనే భార్యలుగా స్వీకరించేవారు. పిల్లలు లేని స్త్రీని స్త్రీగానే చూసేవారు కాదు. అందుకు సాక్ష్యాలే 'వధూద్గర్భిణీ', 'కన్య' అనే మాటలు. కన్య అనే మాటకు నేడు చెప్పే అర్థం వేరు. పోనీ ఈ అర్థమే సబబు అనుకుందాం. మరి అటువంటప్పుడు పెళ్ళికి ముందే కర్ణుడిని కన్న కుంతి 'కన్య' ఏవిధంగా అయింది. ఇటువంటి కన్యలు మరికొందరిని చూడాలంటే పుస్తకం తిరగేయాల్సిందే. ఇక్కడ మరో మాట. ఆ పురాణపాత్రలను తప్పుపట్టటం ఈ పుస్తకం ఉద్దేశం కాదు. నాటి సమాజం తీరును వ్యక్తం చేయటం మాత్రమే. వాస్తవాలను వెల్లడిచేయటమే రచయిత ఉద్దేశం.

మంత్రాలతో, క్రతువులతో స్త్రీని మాత్రమే పవిత్రురాలిని చేయటం, గొప్పగా 'శుభగే' అని చెప్పటం, అలా పవిత్రం చేసే క్రమంలో ముగ్గురికి భార్య అయ్యాక నాలుగోవాడినైన నాకు పెళ్ళానివి అనటం. అంతటితో ఆపక...

'ఇమాం త్వమింద.....' అంటూ .... దాని అర్థం కూడా విని తరిద్దాం.

" ఓ చంద్రుడా! ఈ స్త్రీని యోగ్యమైన తనయులు కలదానినిగానూ, మంచి భగముకల దానిని గానూ చూసి, దీనియందు దీర్ఘాయుష్మంతులైన పదుగురు తనయులను కలుగజేసి, పుత్రుల సంఖ్యలో పదకొండవ వానిగా నన్ను జీవింపజేయుము" అనటంలో ఏమన్నా అర్థం ఉందా? ఇంతకంటే దౌర్భాగ్యం మరొకటుందా.....

ప్రత్యేకంగా వివాహ సమయంలో అగ్నిగుండం ఏర్పరచి, అగ్ని రగిల్చి, నెయ్యిని వేయటం వెనుక చెప్పే కారణం ఏంటో..... ముఖ్యంగా వధూవరులకు ప్రాముఖ్యత ఉండాల్సిన 'పెళ్ళి' తంతులో ఈ పురోహితుల పెత్తనం ఏంటో....మధుపర్కాలు అంటే ఏమిటో..... ఒక్కటి కాదు ప్రతీ ఒక్క దానిని గురించీ కూలంకషంగా ఈ పుస్తకంలో చర్చించటం జరిగింది.

ఇక్కడ వాస్తవం ఒకటి. వల్లెవేతలు మరొకటి. ప్రతి విషయాన్నీ ఎంతో కూలంకషంగా అర్థంచేసుకుని మరీ అడుగువేయాల్సిన నేటి యువత, ఇలాంటి అర్థంపర్థంలేని మంత్రాలను, క్రతువులను హర్షించగలదా? మారుతున్న సమాజానికి అనుగుణంగా , ఆలోచనలను, ఆచరణలను మార్చుకుంటున్న యువత... పెద్దలు చెప్పారనో, సంస్కృతీసంప్రదాయాలనో భ్రమలో ఏమాత్రం సందర్భశుద్ధిలేని ఇలాంటి వివాహ విధానాన్ని సమర్థించటం చాలా బాధాకరం. తెలియనిదానిని గుడ్డిగా ఆచరించటం కంటే... తెలుసుకుని వ్యతిరేకించటం ఎంతైనా సముచితం. సత్యాన్వేషకులైన యువతీయువకులకు ఈ పుసస్తకాన్ని 1979లోనే వెనిగళ్ళ సుబ్బారావు అంకితమిచ్చారు. అందుకోసమై ఎంతో విలువైన సమయాన్ని, ఎన్నో సంస్కృత గ్రంథాలు, వేదాలు, పురాణాలు తిరగేశారు. అసలు ఇటువంటి పుస్తకం ఒకటి ఉందనే విషయం కూడా మనలో చాలా మందికి తెలియకపోవడం విచారకరం.

ఆటవిక దశ నుంచి నాగరిక దశ వరకూ స్త్రీపురుషుల కలయికకు ఔనన్నా, కాదన్నా కారణం ఒక్కటే. అదే మానవజాతివృద్ధి. జంతువులకు కూడా అదే కారణం. కానీ విచక్షణ అనేది మనిషిని, జంతువును వేరుచేసిందనేది వాస్తవం. అటువంటప్పుడు నాగరిక ప్రాణి 'పెళ్ళి' అనే తంతు ఏర్పాటుచేసుకున్నాడు. మరి ఆ ఏర్పాటుకు ఆరంభం కూడా పారదర్శకంగానే ఉండాలి కదా! ఎందుకో, ఏమిటో తెలియని సతమతాల మధ్య కాదు. దీనికి రెండే మార్గాలు. ఒకటి రిజిస్టరు మ్యారేజి లేదా దండల పెళ్ళి. ఇక రెండవది కాలం చెల్లిన మంత్రాలను మార్చిరాయటం. పునాదులను పటిష్టం చేసుకోవటం. ◆

# కంచెలు దాటుకుంటూ...

- శ్రీ వశిష్ట సోమేపల్లి
9966460536



కంచె తెగింది
వికసిస్తున్న సామ్యవాద సంకేతం కాదిది
కొండల్లో.. అడవంచున.. దూరంగా వున్న
పోడు మనుషులను కబళిస్తున్న పెట్టుబడి సామ్రాజ్యం

పాపం వాళ్ళకేం తెలుసని
పాదు తీసి దుంపల్ని గుప్పెట్లోకి తీసుకోవటం
పోడుతో పంటని పండించటం తప్ప
అమ్మని కౌగిలించుకున్నట్టు కొండను వాటేసుకుని
పడుకునే గిరిపుత్రులు వాళ్ళు
నిన్నూ నన్నూ కూడా
ఓ చెట్టునో పుట్టనో పలకరించినట్టు ఆత్మీయంగా హత్తుకునే
నిజమైన మనుషులు

అసలు వాళ్ళకేం తెలుసు ఈ వాదాలు..
తెలిసిందల్లా ఒక్కటే
చెమటతో కడుపు
ప్రేమతో మనసుని నింపుకునే మార్గాలే
అమ్మకడుపులో ఉన్నది మట్టిగడ్డ కాదు ఖనిజపు దిబ్బంటూ
విరిగిన కర్రలు వీపుపై పొమ్మని రాస్తుంటే ఎక్కడికని
పోతారు
సొంత తల్లి ఒడిలోనే కంబారీలయ్యారు..
అయినా అడవి ఆత్మీయత గాలులు పీలుస్తున్నామనే ఆశతో
వెలుగే మిణుగురులు

వేర్ల గుప్పెట్లోని మట్టి ముద్ద ఎప్పుడన్నా లావా చిమ్మిందా?
వేళ్ళు గొంతుల్ని నలిపేస్తుంటే నిప్పు కణికల్లానే చెట్లలో
కారతారు
అందుకే
చేను గట్టున అస్తమించిన సూర్యుడు అడవిలో ఉదయిస్తాడు
మరో తెల్లవారు ఝామున తెగిన పట్టాలై ఎదురొస్తాడు

గుండెను గుద్ది రక్తాన్ని చిమ్మించే రాయి ఇప్పుడు నిప్పును
రాజేస్తుంది
రాయిని రాయి తాకినట్టు
గుండె బండయ్యిందని విసిరే చేతికి చెప్పకు
ఏ ఘనంలో ఏ గని ఉందోనని గుండె కోసి వెతుకుతారు

అణిచే కాళ్ళకు గుండెలు కార్చే ఎరుపే ఇష్టం
అదే అరుణం చొక్కాలై తిరిగితే
తుపాకీలు అడవిని దువ్వుతాయి
ఒక్కో రాయినీ తూటాలతో పగలకొట్టి నెత్తురు నేలకు
రాస్తాయి

ఏదైతేనేం పేలు ఏరేశాం
అనుకుంటూ ఈ సారి దున్నటానికి
యంత్రాలు సిద్ధం చేసుకుంటాయా కృష్ణబిలాలు

మింగే నోళ్ళకు తెలీదు
ఓ తడికోసం ఎదురుచూస్తున్న ఎముకల విత్తులు
నేలింకించుకున్న రక్తాన్ని పీల్చుకుని మరో మొక్కగా
అడవిలో కలుస్తాయని
తనలో మరో మొక్కని కలుపుకుని అరణ్యం అలై
పోటెత్తుతుందని

అందుకే నరికేయాలి
ఇప్పుడు కాదు
రాళ్ళు తగలకముందే
కంచె తెగకముందే
అడవి గుండెలో తుపాకీ విత్తుగా మొలవకముందే
కబళిస్తున్న సామ్రాజ్యవాద వూసుల్ని నరికేయాలి
అణుస్తున్న ఫాసిస్టు ఆలోచనలను నరికేయాలి

చెట్టుకు పూసిన ఎండు మొలకల్లాంటి పిట్ట గూట్లో
ఫ్రీ కానుకలు పెట్టనవసరం లేదు
కొమ్మని కొట్టకుండా వుంటే చాలు
సామ్యానికి సామాన్యుడికి మధ్య కంచెలు దాటుకుంటూ
వంతెన లేకపోతే
అడవి ఆకులు ఎర్రగానే మండేది

కొంచెం నీరు పోయాలి..
ఆకులపై జల్లితే సెగలే కక్కుతాయి
వేర్లని తడిపితే హరిత శోభితమౌతాయి ◆



# అంకురం

అనిల్ ప్రసాద్ లింగం - 8185949365

దట్టంగా వ్యాపించిన పొగ మంచును మెల్లగా చీల్చుకుంటూ ముందుకు సాగుతుంది బస్సు.

"అంకుల్ కొంచెం అడ్డరోడ్డు దగ్గర ఆపరా" లేచి ముందుకొచ్చిన యువతి కోరింది.

"అడ్డరోడ్డు కాడా? ఏ ఊరెళ్ళాలమ్మా?" అడిగాడు డ్రైవరు.

"గుడివాడ"

"అవునా! ఎవరమ్మాయివి?" మళ్ళీ ప్రశ్నించాడు.

"బాబూరావుగారమ్మాయినండీ" చెప్పింది ఆ అమ్మాయి.

"ఏది... మెడికల్ ఆఫీసర్ బాబూరావుగారమ్మాయివా? మీ నాన్నగారు నాకు బాగా తెల్సమ్మా. మాదీ పక్కనే నందివాడ. బెంగుళూరులో ఉద్యోగం చేసేది నువ్వేనా? మీ నాన్నగారు అప్పుడప్పుడూ బస్సులో సీటు రిజర్వేషను కోసం వస్తూ ఉంటాడులే బస్టాండింగుకి" మాట్లాడుతూనే బస్సు నడిపిస్తున్నాడు. తల ఊపి గేటు దగ్గరే నిలుచుంది నిష్కళ.

మంచువల్ల రోడ్డు సరిగా కనిపించడం లేదు గానీ, మెల్లగా వెళ్ళుతుండటం చేత బస్సు తాను దిగవలసిన స్టాపు దాటుతుండటం గమనించి, "అంకుల్... ఇక్కడే.. ఆపండి" అంది గట్టిగా.

"కొంచెం ముందు ఆపుతానుండమ్మా" అంటూ జేబులో నుంచి ఫోను తీసి, "ఏరా ఎక్కడున్నా? తొందరగా చింతతోపు కాడికిరా. అర్జెంటు" అని పెట్టేసి "నాన్నగారొస్తారమ్మా ఇంత చలిలో?" అని అడిగాడు.

"లేదండీ! నేనే వెళతాను. ఆపేయండి" అంది మరింత కంగారుగా.

"ఆ! ఆపుతానమ్మా. మరేం లేదు తల్లీ మా వోడు ఇక్కడే అటో తోలుతా ఉన్నాడు. అడ్ని రమ్మన్నాను. నిన్నెక్కించుకెళతాడు" అని బస్సుని పక్కకి తీసి ఆపాడు. వెంటనే ఓ ఆటో వచ్చి బస్సు ముందాగింది. "ఒరేయ్.. మన మెడికల్ బాబూరావుగారమ్మాయి. జాగ్రత్తగా తీసుకెళ్ళు. తల్లీ నువ్విక్కడున్నా నాత్రోజులు ఎక్కడికన్నా వెళ్లాలంటే మా వాడికి ఫోను చెయ్యమ్మా. ఏమీలా ఆడికి పది రూపాయలొస్తాయని అంతే.కొంచెం గుర్తెట్టుకో అమ్మా." అని చెప్పి బస్సు ముందుకు నడిపించాడు డ్రైవర్.

లగేజీ ఆటోలో సర్దినాక కూర్చొని "భలే వాడేనయ్యా ఆ బస్సు డ్రైవరు" అంది నిష్కళ.

"మా నాన్నండీ" అన్నాడు ఆటో అతను బండి స్టార్ట్ చేసి.

"అదా సంగతి"

"అవునండీ. అడ్డరోడ్డు కాడ ఆటోలు ఎక్కువయ్యాయండీ. అందుకే అప్పుడప్పుడూ ఇలా"

"సరేలే"

నిజంగానే బస్సులాగే అడ్డరోడ్డు దగ్గర వరసలో దాదాపు డజను ఆటోలు నిలిపి ఉన్నాయి. వాళ్ళని దాటి వెళ్ళుతుంటే కొందరు గోల చేశారు.

"ఇన్ని ఆటోలేంటయ్యా? ఇంతకు ముందుండేవి కాదుగా?"

"ఏమి చెప్తాం అండీ. వాళ్ళు పెట్టిన కాలేజీలో లెక్కకోసం ప్రోత్సాహకాలిచ్చి మరీ జాయిన్ చేసుకొని చదివిస్తున్నారు. తీరా డిగ్రీలొచ్చాక ఎవరికీ ఉద్యోగాలు లేవంటున్నారు. ఖాళీగా ఇంట్లో పడి ఉండలేక ఇలా.."

"ఏమి చదువుతున్నావు?" అడిగింది అమ్మాయి.

"ఇంజినీరింగండీ" చెప్పాడు అబ్బాయి.

"వాట్..! ఇంజినీరింగ్ చదివి ఇదేంటయ్యా?"

"అక్కడ ఆటోలు పెట్టుకున్న వాళ్ళందరూ ఇంజినీర్లేనండి"

మరింత ఆశ్చర్యపోయింది నిష్కళ.

◆◆◆

స్నానం చేసి, అల్పాహారం తిన్నాక మంచం మీద సేదతీరుతున్న కూతురు గదిలోకి వచ్చాడు బాబూరావు.

'ఏంటమ్మా ఇంత పొడవుందీ, కొత్త ఫోనా?"

"అవును నాన్నా"

"పోయినసారొచ్చినప్పుడు నీ చేతిలో ఉన్నది కూడా బాగానే ఉండేది కదమ్మా. అది కూడా పోయిన ఏడాదే కొన్నట్టున్నావు" సాలోచనగా అన్నాడు.

"ఇది కొత్త మోడల్ నాన్నా. ఎడ్జ్‌స్క్రీన్. ఫోను పక్కల కూడా తెర ఉంటాది చూడు" అని ఆన్ చేసి ఇచ్చింది.

"వార్నీ. భలేగా ఉందే. ఇదిగో చూడవే పక్కలమ్మట కూడా కనపడతా వుంది" అంటూ అప్పుడే లోనికొచ్చిన భార్య రత్నమ్మకు ఇచ్చాడు.

"ఎంతే ఇది? పాతదేమి చేసావు?" అడిగింది తల్లి.

"75 వేలు. అది ఇచ్చేసి ఇది తీసుకున్నా" నింపాదిగా చెప్పింది కూతురు.

"అంత డబ్బులెందుకే దండగ. బొత్తిగా డబ్బులంటే లెక్కలేకుండా పోయిందే నీకు"

"లేటెస్టు టెక్నాలజీ అమ్మా!" గారాలు పోయింది పిల్ల.

"ఏం టెక్నాలజీనో ఏమో. పెళ్లి కొడుకులు అడిగే కట్నాలు వింటుంటే మాకు గుండెలు అదిరిపోతున్నాయి. నువ్వేమో రూపాయి వెనకేసుకోకుండా ఇలా తగలేస్తున్నావు. మొన్న ఆ మెరకీది రామారావు గారి కూతురికి అమెరికా సంబంధం కుదిరిస్తే రెండు కోట్లడిగారంట. పెళ్లి ఖర్చులూ, పెట్టిపోతలూ ఇంకో కోటి అయ్యిందట. పదెకరాల మాగాణి, రెండెకరాల మామిడితోపూ అమ్మీ పిల్లని సాగనంపారు. ఇవన్నీ చూస్తుంటే మాకు చాలా భయంగా ఉంటుందే" గాభరా పడింది తల్లి.

"అమెరికావాడు కావాలని నేనడగలేదు కదమ్మా. మనకు అన్ని విధాలా అనుకూలమైన సంబంధమే చూడండి"

"అనుకుంటాం గానీ మన చేతుల్లో ఏం ఉందే. భగవంతుడెక్కడ రాసి పెట్టాడో. ఆ రామారావు అంత ఘనంగా పెళ్ళి చేసినా తన కూతుర్ని ఎప్పుడన్నా చూసుకోవాలంటే కూసంతా, కాసింతా దూరమా అమెరికా అని తెగ బాధపడుతున్నాడు. ఇంకోటి కొత్తల్లుడు ఈ పల్లెటూల్లో నేనుండలేనని అమ్మాయిని తీసుకొని పక్కటౌన్లో హోటల్లో ఏసీ రూంలో దిగాడట ఇక్కడున్నన్నాళ్ళూ" అంటూ అందరూ సరదాగా నవ్వేశారు.

"మరి మనకెలాంటి వాడొస్తాడో, ఎంతడుగుతాడో, పెళ్ళయ్యాక మన ఈ ఇంటికొస్తాడో, నిన్ను రానిస్తాడో... ఒక్కోసారి ఆలోచిస్తుంటే గుండె బరువెక్కి పోతుందమ్మా. ఆ రామారావుకి ఊళ్ళో ఇల్లు నిలిపే కొడుకులున్నారు. మరి మనకు అది కూడా లేదు" ఇంటిని చూసుకుంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు ఆ దంపతులు. ఏమీ మాటలాడలేకపోయింది కన్న కూతురు. కాసేపటికి తేరుకున్న రత్నమ్మ లేచి బీరువాలోంచి డబ్బులు తీసికొచ్చి "ఇదిగో ఈ సారి పంట డబ్బులు. మొన్నట్నుంచి ఇంట్లో పెట్టుకుని భయపడుతున్నాం. బంగారం ఏమన్నా కొనుక్కో. ముందు టౌనుకెళ్లి నీ ఎకౌంట్లో వేసుకో. తర్వాత బెంగుళూరులో నీకు నచ్చిన నగలు కొనుక్కో. ఇలా ఫోనులు, ఫ్యాషన్లు అంటూ

సొమ్ము తగలెయ్యమాకు" అంటూ హెచ్చరించింది.

"బయలుదేరమ్మా. అసలే శనివారం కదా. బ్యాంకు మధ్యాహ్నం వరకే ఉంటది" తొందర చేసాడు తండ్రి.

"ఇప్పుడలా కాదు నాన్నా. రెండవ, నాల్గవ శనివారాలు సెలవు. మిగతా రోజులన్నీ ఒకే సమయానికి తెరచి, మూస్తారు. వివరించింది తనయ.

"అలాగా. ఏమోనమ్మా ప్రతిసారీ ఏదో కొత్త రూలు చెప్తాడు మా బ్యాంకు మేనేజరు. అయితే ఈ వేళ మన ఊళ్లోని కోఆపరేటివ్ బ్యాంకు కూడా పని చేస్తదంటావా?"

"హా..! భేషుగ్గా"

"అయితే నువ్వొక్కతివే టౌనుకెళ్లి నీ ఖాతాలో డబ్బు జమ చేసుకొనిరా. నాకు మన కోపరేటివ్ బ్యాంకులో కొంచెం పనుంది" అన్నాడు తండ్రి.

"తోడు ఎవరూ లేకుండా అంత సొమ్ము పట్టుకొని ఎలాగండీ?" ఆదుర్దా పడింది తల్లి.

"పర్లేదులేమ్మా. పొద్దున్న వచ్చేటప్పుడు పక్క ఊరి ఆటో కుర్రాడు పరిచయం అయ్యాడు. ఫోను నంబరు కూడా ఇచ్చాడులే. అతన్ని పిలిచి తీసుకెళ్ళతాను" అంది కూతురు.

♦♦♦

ఫోను చేసిన పది నిమిషాలకి వచ్చిన ఆటో డ్రైవర్ శ్రీకాంత్, ఒక్కరే వెళ్లాలంటే ఒకరేటు, మిగతా వాళ్ళని కూడా ఎక్కించుకుంటూ పోతే ఒక రేటనీ చెప్పాడు. చేతిలో డబ్బులున్నాయి కాబట్టి ఒక్కత్తెనే తీసుకెళ్లమంది నిష్కళ. దారిలో ఎక్కడ, ఎవ్వరు చెయ్యెత్తినా ఫోను చేసి తన స్నేహితులకి ఫలానా చోట కిరాయి ఉందని చెప్తున్నాడు. రెండో వీధిలో తెల్సినావిడనుకుంటా ఆపి పిల్లలకి టౌన్లో స్కూలు ఫీజు కట్టమని డబ్బులిచ్చింది. ఇంకో ఆవిడ తిరిగొచ్చేటప్పుడు తెచ్చిపెట్టమని మందుల చీటీ ఇచ్చింది. ఇలా సాగిన ప్రయాణం నిష్కళకి కొత్తగా అనిపించింది.

అరగంటలో పని ముగించుకొని బ్యాంకు బయటకొచ్చిన నిష్కళకు ఆటో కనపడలేదు. వెంటనే ఫోను చేస్తే అదిగో, ఇదిగో అంటూ చాలా ఆలస్యంగా వచ్చాడు శ్రీకాంత్. ముందుగా క్షమాపణలు చెప్పి,"కొంచెం పనుండీ, ఫ్రెండ్ వాళ్ళింటికెళ్లానండి" అంటూ వివరణ ఇచ్చాడు.

"చెప్తే వేరే ఆటోలో వెళ్లిపోయేదాన్ని కదా, నువ్వు నీ ఫ్రెండ్‌తో ఎంజాయ్ చేసే పని" నిష్టూరమాడింది అమ్మాయి.

"అలా కాదు మేడం. జాబ్ అప్లికేషన్ ఒకటి ఆన్‌లైన్లో అప్‌లోడ్ చెయ్యడానికి వెళ్ళాను. మా వాడికి లాప్ టాప్ ఉంది. కానీ సర్వర్ డౌన్ అవ్వడంతో కొంచెం ఆలస్యమైంది" మరింత వివరంగా కారణం చెప్పాడు అబ్బాయి.

"అదేంటీ? స్మార్ట్ ఫోన్ వాడుతున్నావు. నిన్న విడుదలైన సూపర్‌స్టార్ కొత్త సినిమా పాటలని అప్పుడే డౌన్లోడ్ చేసి నీ ఫోనుకి రింగుటోనుగా పెట్టేసుకున్నావు. క్రికెట్ స్కోరు బాలు బాలుకి తెలుసుకుని అందరికీ చెప్తున్నావు. జాబు అప్లికేషనుకు మాత్రం వేరే వాడి దగ్గరకెళ్ళావా?" లా పాయింటు లాగింది చిన్నది.

"అవన్నీ ఏదో సరదాలు మేడం. ఫోనులో అన్ని పనులూ అవ్వవు కదా. స్క్రీను చిన్నది. అక్షరాలు సరిగ్గా కనపడవు. ఫొటోలు, డాక్యుమెంట్లు అప్లోడ్‌కి వీలు పడదు. చాలా ఇబ్బందిగా ఉంటుంది." అంటూ మెల్లగా తన బాధలు వెళ్లబోసుకున్నాడు కుర్రవాడు.

♦♦♦

మూడు నెలల తరవాత...

స్థానిక గ్రంథాలయ ప్రాంగణం సందడిగా ఉంది. పూలతో అలంకరించిన వేదిక మీద నియోజకవర్గ శాసనసభ్యుడు, ఊరి సర్పంచి, బాబూరావు గారు ఆయన సతీమణి, ఇంకొందరు ఊరి పెద్దలు ఆశీనులయ్యారు. శ్రీకాంత్ స్వాగతోపన్యాసం చేసి సర్పంచ్ గారికి మైకు అందించాడు.

"మన ఊరి బాగుకోసం శ్రీ బాబూరావుగారు సొంత డబ్బు ఖర్చు చెయ్యడమనేది నిజంగా చాలా అభినందనీయం. ప్రతీ ఒక్కరూ ఇలా సమాజ అభివృద్ధికి తమకు వీలైనంతలో తోడ్పడితే మన దేశం రూపు రేఖలు మారిపోతాయి. ఈ స్ఫూర్తి ప్రదాయక కార్యక్రమం మన ఊరి నుంచి ప్రారంభం కావడం మనకెంతో గర్వకారణం" అని ముగించాడు. తదుపరి బాబూరావుగారికి మన ఎమ్మెల్యే గారి చేతులమీదుగా సన్మానం అని ప్రకటించగానే, ఆయన లేచి మైకు అందుకొని "ఈనాటి ఈ కార్యక్రమం అంతా నా పేరుమీద, నా చేతిమీదుగా జరుగుతున్నా, దీనికి అసలు కర్త, కర్మ అంతా నా కూతురు నిష్కళ. ఈ సత్కారానికి సిసలైన అర్హురాలు తానే. కాబట్టి ఆమెనే ముందుకొచ్చి ఈ గౌరవం స్వీకరించి నాలుగు మాటలు

మాట్లాడాలని కోరుతున్నా" అని ప్రకటించాడు. అంతవరకూ ముందు వరుసలో కూర్చొని వేడుకని తన చరవాణిలో చిత్రీకరిస్తున్న కూతురు కరతాళ ధ్వనుల మధ్య వేదికనెక్కింది.

"పెద్దలందరికీ వందనం. ఇందాక మా తండ్రిగారు చెప్పినట్టు నా తల్లితండ్రుల పేరు మీద జరుగుతున్నా ఈ సత్కార్యానికి కారణం నేనే. తద్వారా వాళ్ళ పేరు నిలపాలనేది నా తాపత్రయం. పుట్టిన గడ్డమీద మమకారం అందరికీ ఉంటుంది. కానీ మా ఆడపిల్లలకి పెళ్లి చేసుకొని వెళ్లిపోయాక ఏదో ఒకప్పుడు వచ్చి పోవడం తప్పా, మాకు సొంత ఊరితో పెనవేసుకున్న అనుబంధానికి శాశ్వత రూపం ఇచ్చే అవకాశం రాదు. మా అమ్మానాన్న కూడా అందరు తల్లితండ్రులులాగే నాకూ ఏదో గొప్ప విదేశీ సంబంధం చేసి పంపించెయ్యాలని అనుకున్నారు. అలాగే తాము స్థిరపడిన ఈ ఊరిలో తమ అస్తిత్వానికి ఆనవాలు ఉండాలని కోరుకున్నారు. అందుకే తమకూ ఓ మగ బిడ్డ ఉండి ఉంటే ఇక్కడ ఇల్లూ, వారి పేరూ నిలిపేవాడని అనుకున్నారు" గొంతు గద్గదమవ్వగా కొంచెం నీళ్లు త్రాగి మళ్ళీ చెప్పనారంభించింది నిష్కళ.

"పోయినసారి నేను ఊళ్లో కొచ్చినప్పుడు ఇక్కడి పరిస్థితులు గమనించాను. చదువుకొని సరైన ఉద్యోగం దొరక్కా ఆటోలు నడుపుకుంటూ కిరాయిల కోసం బస్టాపుల్లో నిలబడి, ఒకరినొకరు తోసుకుంటూ, వంతులేసుకుంటున్న యువతను చూసాను. అప్పుడే నన్ను టౌనుకు తీసుకెళ్లిన ఈ శ్రీకాంత్ తానూ కంప్యూటర్ ఇంజనీర్నని చెపితే ముందు ఆశ్చర్యపోయిన నేను, తరవాత అతని తెలివితేటలకి ఒక చిన్న పరీక్ష పెట్టాను. మాకు అక్కడ సిటీలో క్యాబులు తిరుగుతాయి. మేమే ఎక్కడ నుండి బుక్ చేసినా అక్కడికి దగ్గరలో ఉన్న డ్రైవర్ వచ్చి మమ్మల్ని మా గమ్యస్థానానికి చేరుస్తాడు. వాళ్ళు ఎగబడరు. అంతా ఆన్‌లైన్. కానీ ఇక్కడ పరిస్థితి వేరు. జనాభా తక్కువ. ఆటోలేమో ఎక్కువ. రోజూ అందరికీ కడుపు నిండేంత కిరాయి దొరికే వెసులుబాటు లేదు.

అందుకే ఇక్కడ తిరిగే ఆటోలన్నింటికీ జిపిఆర్ఎస్ అమర్చి, ఆన్‌లైన్‌లో మన మండలంలోని ఏ ఊరి వాళ్ళైనా తమ తమ ఇళ్ళ దగ్గర నుండే ఆటోను పిలిచే వీలు కల్పించే యాప్ ని ఒకదాన్ని రూపొందించమన్నాను. తనకి నా పాత టాబ్లెట్, కొన్ని సాంకేతిక పరమైన సలహాలు ఇచ్చానంతే. నెల రోజుల్లోనే ఇప్పుడు మన ఎమ్మెల్యే గారు ఆవిష్కరించబోతున్న 'రత్నా సవారి' యాప్‌ని అన్ని విధాలా సిద్ధం చేసి చూపించాడు. అతని పట్టుదలని నేను ఎంతగానో అభినందిస్తున్నా'' అనగానే ఒక్కసారిగా చప్పట్లు మారుమ్రోగాయి.

''తనలాగే మీలోకూడా ఇంకా ఎంతో మంది ప్రతిభావంతులు దాగి ఉంటారు. ఒకప్పుడు మన గ్రంథాలయాలు ఊళ్ళోని యువతరంలో ముఖ్యంగా స్త్రీలలో విద్యావ్యాప్తికీ, వ్యక్తిత్వ వికాసానికీ ఎంతో తోడ్పడ్డాయి. ఈనాడు అంతా డిజిటల్ మయం. కాబట్టి ఇక మన గ్రంథాలయాలు కూడా ఆన్‌లైన్ అవ్వాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అందుకే నేను ఈ భవనం ఎంచుకొని మన సర్పంచి గారి సహకారంతో ఒక గదిలో ఇంటర్నెట్టు, వైఫై కనెక్షన్ పెట్టించాను నా వంతుగా మూడు లాప్‌టాప్‌లూ, రెండు ట్యాబ్‌లూ ఇక్కడ అందుబాటులో ఉండే ఏర్పాటు చేసాను. ఈ రోజుల్లో పరీక్షలకి రుసుములూ, అసలు పరీక్షలూ, ఉద్యోగ దరఖాస్తులు, ప్రభుత్వ పథకాలకు అర్జీలు, అధికారులకు, మంత్రులకు వినతులు అన్నీ, అందరూ అంతర్జాలంలోనే కాబట్టి మన ఊరి యువత ముఖ్యంగా ఆడపిల్లలు ఈ బాబూరావు అంతర్జాల సేవ (బీ ఆర్‌సైట్) ని వినియోగించుకొని మిమ్మల్ని మీరు కాలానికనుగుణంగా మలచుకుంటూ, మన గ్రామాన్ని కూడా ముందుకు తీసుకెళ్ళతారని ఆశపడుతున్నాను.

ఇక ముందుగా చెప్పినట్టుగా నా వంటి ఆడ కూతుళ్ళని మా కన్నవాళ్ళు అత్తగారిళ్లకో, విదేశాలకో సాగనంపి అక్కడి నుండి మేము చేసే ఫోను కోసం ఎదురు చూస్తూ గడుపుతారు. కానీ నా దొక ఆశ. నిజానికి స్వార్థం. మీలో ఎవరైనా మేము కల్పించిన ఈ సౌకర్యాలని ఉపయోగించుకొని, మన ఊరి నుంచే, అందరికీ పనికొచ్చేలా ఏదో కొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని రూపొందించి, ఒక కొత్త సాఫ్ట్‌వేర్‌నో లేక ఇంకో కొత్త యాప్‌నో అభివృద్ధి పరిచి తానూ వృద్ధిలోకొచ్చి, మరికొందరికి చేయూతనిస్తూ నా తండ్రి దృష్టిలో నాకు తగిన వాడుగా, యోగ్యుడైన వరుడిగా ఎదిగి నన్ను చేపట్టే స్థాయికి ఎదిగితే నేనూ సొంతూరిలోనే వివాహం చేసుకొని ఇక్కడే నా తల్లితండ్రుల కళ్ల ముందే స్థిరపడాలని కోరుకుంటున్నా" అంటూ సిగ్గు పడుతూనే తన ఆశని ధైర్యంగా అందరిముందు విశదీకరించి, గర్వంగా వేదికమీద తనకు కేటాయించిన ఉచితాసనంలో ఆసీనురాలయ్యింది నిష్కళ. ◆

## ఏడవ రుతువు కవిత్వం




**వైష్ణవిశ్రీ**

వెల : 150/- పేజీలు: 152

ప్రతులకు : 8074210263

రాయడం కోసం రాసేవాళ్లు ఒక రకమైతే రాయకుండా వుండలేని తనంతో రచించే వాళ్లు వేరు. వారు జీవితంలోంచి మనసు లోతుల్లోంచి, ఆనంద విషాద భరితమైన అనుభవపు పొరల్లోంచి ఆవేదనాగర్భం లోంచి రాస్తారు. వైష్ణవిశ్రీ ఈ కోవకు చెందిన కవయిత్రి అని ఇందులోని చాలా కవితలు మనకు చాటిచెబుతాయి.

**- తెలకపల్లి రవి**

## వెంట వచ్చునది కథలు




**ఎమ్వీ రామిరెడ్డి**

వెల : 160/- పేజీలు: 240

ప్రతులకు: 9866777870

రాజధాని ప్రాంతంలో వేగంగా మారుతున్న పరిస్థితులు, గాయపడుతున్న మానవ సంబంధాలు, విధి నిర్వహణలో భాగంగా ఎదురైన అనుభవాలు.. నన్ను అశాంతికి గురిచేసిన అంశాలను కథలుగా నిర్మించేందుకు శ్రమించాను.

**- ఎమ్వీ రామిరెడ్డి**

## సైరా.. మా బళ్ళారి..




పాటల 'చిరు' ప్రయత్నం

**జంధ్యాల రఘుబాబు**

వెల : 60/- పేజీలు: 66

ప్రతులకు: 9849753298

సాహిత్య రూపం ఏదైనా అదో సమిష్టి కార్యం. పాట, నాటిక, నాటకం ఆ వరుసలో ఇంకా ముందుంటాయి. శాతాల లెక్కన ఇంత అని చెప్పటం కష్టమే కాని పాట రాసేవారి కృషితో పాటు రాగం కట్టేవారు, గాయకులు, వాయిద్యకారులు, మైకుసెట్టు పని చూసేవారు ఇలా అందులో ఎందరి పాత్రో ఉంటుంది. పాట పరమార్థం సమాజాన్ని చేరటం, సమాజానికి ఉపయోగపడటమనేది ముఖ్య లక్ష్యం.

**- జంధ్యాల రఘుబాబు**

## మట్టిరంగు బొమ్మలు కవిత్వం




**సిరికి స్వామినాయుడు**

వెల : 100/- పేజీలు: 168

ప్రతులకు: 9494010330

2011లో నా తొలి కవితా సంకలనం 'మంటిదివ్వ' వచ్చింది. నా ఆర్తినీ, ఆవేదననీ, గుండె కొట్లాటల్నీ కవిత్వమే నంటూ ఆదరించిన సమస్త సాహితీలోకానికీ శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. 2012 నుండి 2018 మధ్య ఓ ఏడేళ్ల కళింగాంధ్ర పరిణామాల్నీ, వ్యథార్త జీవిత యధార్థతను అక్షరబద్ధం చేస్తూ యిప్పుడీ మలిసంకలనం 'మట్టిరంగు బొమ్మలు'తో వస్తున్నాను.

**- సిరికి స్వామినాయుడు**

## బాలల రంగస్థలం




ఏకపాత్రలు, లఘు నాటికలు, జానపద, దేశభక్తి, అభ్యుదయ గేయాలు

సంకలనం: అమరావతి బాలోత్సవం కమిటీ

వెల : 100/- పేజీలు: 116

ప్రతులకు : 9618848470

ప్రగతిశీల శాస్త్రీయ దృక్పథంతో ఏకపాత్రలు, లఘు నాటికలు, జానపద, అభ్యుదయ గీతాల కొరకు 'జాషువా సాంస్కృతిక వేదిక' కొత్త రచనలను ఆహ్వానించింది. ఉన్నంతలో ఉత్తమమైనవి ఎంపిక చేసి పుస్తక రూపంలో వెలువరిస్తున్నాం. బాలలు, తల్లితండ్రులు, ఉపాధ్యాయులు, శ్రేయోభిలాషులు దీనిని ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

**- అమరావతి బాలోత్సవ్ కమిటీ**

## పిల్లల పుస్తకం




బాలల నవల

**పి. చంద్రశేఖర అజాద్**

వెల : 70/- పేజీలు: 80

ప్రతులకు: 9246573575

పిల్లల పుస్తకం నవలలో పిల్లలు ముఖ్యపాత్రలు. చాలా సాధారణంగా మొదలై, పిల్లల ఆలోచనలు సరదాలనూ పంచుతూ పిల్లలు ఓ రచన చేయటంతో ముగుస్తుంది. ఆ క్రమాన్ని చదివి తీరాలి. పిల్లలతో అత్యంత దగ్గరగా మమేకం అయినప్పుడే ఇలాంటి నవలలు రాయటం సాధ్యం అవుతుంది.

**- బొప్పన విజయ్‌కుమార్**

## జీవనకాంక్ష కవిత్వం

**ఇనుగంటి జానకి**

**వెల : 50/- పేజీలు: 96**

**ప్రతులకు: 9441956321**




చదువరిగా, సమాజ చలన శక్తులేవో గుర్తించి, వారి పాత్రకు తగు అవకాశాలు, సాధికారత, సామాజిక స్థాయి కోరే కవిత్వాన్ని జానకి రాశారు. 'పర్వత మార్గం' వంటి కవితల్లో తాత్త్విక భావనలతో బాటు, విశాల బస్తర్ మీద రాసినా, విశాఖ బస్తీ మీద రాసినా, నవ్వు అరుదై పోయిందని, ఏది నవ్వు? అంటూ ప్రశ్నిస్తూ వెతుక్కుంటున్నా, ఆమె రచనలో ఒక వివేకం, విచక్షణతో కూడిన వేదనా ప్రవాహాలు ఉన్నాయి.

**- రామతీర్థ, జగద్ధాత్రి**

## సరిపడని సంగతులు

సంపాదకుడు:

**డా॥ అపిరెడ్డి హరినాథరెడ్డి**

**వెల : 50/- పేజీలు: 86**

**ప్రతులకు: 0866-2577533**




సీమలో ఆనాటి సంఘ సంస్కరణోద్యమాన్ని కళ్ళార చూసిన రాఘవ ఆనాటి సాంఘిక దురాచారాలను ఖండిస్తూ, స్త్రీల ఆత్మగౌరవాల్ని సంరక్షిస్తూ, వితంతు వివాహం ఇతివృత్తంగా 1933లో 'సరిపడని సంగతులు' అనే సాంఘిక నాటకం రాశాడు. వ్యవహార భాషలో నాటకం రాయడం అతని ప్రజాస్వామిక దృష్టిని తెలుపుతుంది.

**- డా॥ అప్పిరెడ్డి హరినాథరెడ్డి**

## సమూహ

**కిల్లాడ సత్యనారాయణ కవిత్వ పరామర్శ**

**సంకలనం: డా॥ జి. రామచంద్రారెడ్డి**

**వెల : 70/- పేజీలు: 80**

**ప్రతులకు: 9848132208**




కిల్లాడ సత్యనారాయణ తొలి కవితా సంపుటి 'మనిషి నా భాష' విశాఖపట్నంలో ఆవిష్కరణ అయ్యింది. విజయవాడలో ఆ సంపుటిపై సమాలోచన జరిగింది. మాట్లాడిన వారందరూ కూడా కవిత్వానికి ఉన్న వస్తు బలాన్ని చూసి, కవిత్వానికి అంటిన మార్మికతను, ధార్మికతను చూసి ముగ్ధులైపోయారు. వెంటాడుతున్న ఆ కవితా పాదాలకు స్పందించి, అక్షరాలై పలకరించారు. ఆ పలకరింపులే ఇప్పుడు 'సమూహ'గా మారి మీ చేతుల్లోకి చేరింది. మీ మనసులోకి చేరడానికి సిద్ధంగా ఉంది.

**- చినుకు పబ్లికేషన్స్**

## నీరు - నిప్పు కవిత్వం

**ఆచార్య కె.ఎస్. చలం**

**వెల : 50/- పేజీలు: 60**




అర్ధశతాబ్దం క్రితం ఉద్వేగంగా రాసే అభ్యాసం వుంది. ఆ అలవాటు నుండి బయటపడి చాలా కాలం అయింది. అయితే సమకాలీన సమాజంలో జరిగే విషయాలపై మనం ఏమనుకుంటున్నామో చెప్పే సామాజిక బాధ్యత నుండి తప్పుకోలేకపోయాను. అందుకే యీ వాక్యాలు క్లుప్తంగా, స్పష్టంగా, సూటిగా చెప్పేందుకు ప్రయత్నించాను.

**- ఆచార్య కె. ఎస్. చలం**

## అంతర్వాహిని (నా కథ)

**బి. హనుమారెడ్డి**

**వెల : అమూల్యం, పేజీలు: 182**

**ప్రతులకు: 9440288080**




నా జీవిత అంతర్వాహిని, ఎప్పుడూ ఒడ్డొరుసుకొని ప్రవహించలేదు. జీలుగా – పీలగానే పయనించింది. 78 ఏళ్ళ వయసులో, 55 ఏళ్ళ వృత్తి జీవితంలోని, 20 ఏళ్ళ ప్రవృత్తి జీవితంలోని నా గురించిన సమాచారం కోసం నన్ను నేను తవ్వుకున్నాను. నా అంతరాంతరాల్లో పొరాడుతున్న మధుర జ్ఞాపకాల వేడుకను, విధ్వంస జ్ఞాపకాల అగ్గినీ, బుగ్గినీ, విచ్చుకున్న సంకల్పాలను, పేర్చుకున్న సమాలోచనలను రేఖామాత్రంగా నీలితెరానంతర వెండితెరపై దర్శించాను.

**- బి. హనుమారెడ్డి**

## ఆవాజ్ కవిత్వం

**బండి చంద్రశేఖర్**

**వెల : 100/- పేజీలు: 123**

**ప్రతులకు: 9440087930**




ఈ కవి మంచితనాన్ని సమర్థిస్తాడు. చెడును నిరసిస్తాడు. కర్షకులకు, కార్మికులకు, శ్రామికులకు అండగా నిలుస్తాడు. ప్రజాక్షేమాన్ని కాంక్షిస్తాడు. ఆధిపత్య శక్తుల ధోరణులను, పాలకుల కపట బుద్ధులను బహిర్గతం చేస్తాడు. కులాల కుమ్ములాటలు, మతాల మారణహోమం కూడదని ప్రజలకు హితవు చెప్పుతాడు.

**- రేగులపాటి కిషన్‌రావు**




## తుర్రెబాజ్ ఖాన్

**యస్.డి.వి. అజీజ్**

వెల : 75/- పేజీలు: 73

ప్రతులకు: 8106367175

బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా అనేక తిరుగుబాట్లు జరిగాయి! అలాంటివారిలో తుర్రెబాజ్ ఖాన్ ఒకరు! అతని పోరాటం నాడే కాదు నేటికీ స్ఫూర్తిదాయకం. 1857 నాటి దేశ పరిస్థితి, హైదరాబాద్ రాజకీయ, సామాజిక పరిస్థితులు, తుర్రెబాజ్ ఖాన్ నాటి బ్రిటిష్ వారిపై నిజాం నవాబ్‌పై జరిపిన పోరాటం గురించి కళ్ళకు కట్టినట్టుగా ఈ రచనలో చిత్రీకరించడమైనది!

**- ప్రచురణకర్తలు**




## గుండెలో నదులు నింపుకొని..

**రావి రంగారావు**

వెల : 100/- పేజీలు: 126

ప్రతులకు: 9493686165

తెలుపును వెనక్కి నలవకు, తెలుపంటూ వేరే లేదు,/ నలుపు పండితే తెలుపవుతుంది. ఆ తెలుపే నీ బతుక్కి గెలువవుతుంది./ బతికినంత కాలం మనిషి లోనా బయటా నదిలా ప్రవహించాలి./ మనిషి పోయినా సరే జీవనదిగా రాణించాలి./

నది అంటే - భూమి కాగితమ్మీద ఆకాశం కవి రాసే ఓ కమ్మని పద్యం./ అది చదువుతున్నాం కాబట్టే ఇంకా మనం బతికే ఉన్నాం.

**- డా॥ రావి రంగారావు**




ప్రతిభాశాలి

## ఆచార్య ప్రతాపగిరి రామమూర్తి

**రావినూతల శ్రీరాములు**

వెల : 50/- పేజీలు: 62

1954లో ఒంగోలు ప్రిన్సిపాల్‌గా వుంటూ మా విశ్వవిద్యాలయానికి విచ్చేసిన ఆచార్య ప్రతాపగిరి రామమూర్తి మాకు పొలిటికల్ సైన్స్ బోధించేవారు. ఆయన విద్యార్థుల వట్ల ప్రత్యేక శ్రద్ధతో పాఠాలు బోధించడం కారణంగా మాపై చెరగని ముద్ర వేశారు. దేశభక్తులు, సంఘసంస్కర్త, మహావక్త, గొప్ప రచయిత అయిన ఆచార్య ప్రతాపగిరి రామమూర్తిగారి జీవితం నుండి నేటితరం గ్రహించాల్సింది ఎంతో వుంది.

**- యర్రగుడిపాటి భరద్వాజ**



## అమ్మపేరే.. కవిత్వం!

**కుంచె చింతా లక్ష్మీనారాయణ**

వెల : 150/- పేజీలు: 100

ప్రతులకు: 9908830477

అమ్మతనానికి నిలువెత్తు ప్రతిబింబం ఈ కావ్యం. పైకి చూడడానికి సెంటిమెంటల్ పొయెంగా కనిపిస్తుంది. అది కొంతవరకు నిజం కూడా. అయితే ఇది అమ్మలు ఉన్నవాళ్ళకి, అమ్మలు లేనివాళ్ళకు, అమ్మని చూడనివాళ్ళకి, అమ్మను చూసుకోని వాళ్ళకు అమ్మ ఔన్నత్యాన్ని చాటి చెబుతుంది.

**- ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి**




## వరి కల్లం కవిత్వం

**నాగవర్మ ముత్యం**

వెల : 50/- పేజీలు: 96

ప్రతులకు: 9490578855

వర్తమానంలోని విషాదాన్ని వ్యక్తం చేయటానికి భూతకాలాన్ని అనుభవంలోకి తేవటంలో నాగవర్మ ప్రదర్శించిన ఒడుపు, చాకచక్యం పాఠకులను ఆశ్చర్యంలో ముంచెత్తుతుంది. ఇదొక శిల్ప రహస్యం. ఇట్లాంటి శిల్ప రహస్యాలు తెలిసిన తనం చాలా కవితల్లో ద్యోతకమవుతుంది.. ఈ సంపుటిలో వస్తు వైవిధ్యం, అభివ్యక్తిలో నవ్యత, సాంద్రత ముప్పేటగా అల్లుకొని పాఠకులకు సరికొత్త కవిత్వానుభూతులను అందిస్తాయి.

**- తోకల రాజేశం**



## ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు కథలు

**పలమనేరు బాలాజీ**

వెల : 100/- పేజీలు: 158

ప్రతులకు: 9440995010

ఇవి మన కథలు. మన సంబంధాల కథలు. మానవ సంబంధాల కథలు. మానవ సంబంధాలు ఎంత దుస్థితిలో ఉన్నాయో చెప్పడం ద్వారా ఉదాత్త మానవ సంబంధాల వైపు మన ఆలోచనలను ప్రేరేపించగల కథలు. మానవ సంబంధాలలో, అనుభూతులలో, ఉద్వేగాలలో మనం కొనసాగించవలసిన, బలోపేతం చేసుకోవలసిన విలువల గురించి రేఖామాత్రంగా, ఉదాహరణప్రాయంగా, సూచనప్రాయంగా చెప్పిన కథలు.

**- ఎన్. వేణుగోపాల్**

# అవును ! ఇది దేవతలు దిగబడ్డ దేశమే

- డా॥ ఎన్.ఈశ్వర రెడ్డి
94901 92228



ప్రకృతి ప్రకోపం మహా వృష్టిగా కురిసి
ప్రాణాలకు పగుళ్లు పెడుతుంటే
దేహాలను గొడుగుల్లా విప్పార్చిన విపత్తు నిర్వహణా దేవుళ్ళు,

నీటి సుడులు నీల్గి బుసలు కొడుతున్నా
నిర్భయంగా ప్రవాహాల పైకి లంఘించిన సైనిక దేవుళ్ళు,

ఇంటిల్లిపాదిని వస్తుల కొండ చిలువ పట్టి బంధించినా
పరుల ప్రాణ రక్షణ కోసం
పడవలతో కవాతు చేసిన జాలరి దేవుళ్ళు,

కమ్మేసిన చీకట్లును చీల్చడానికి
కూలిన విద్యుత్ స్తంభాలకు
జీవం పోసిన కార్మిక దేవుళ్ళు,

తెల్లని మనసు దుస్తులతో తిరుగాడుతూ
క్షతగాత్రుల గాయాలను ఊరడించిన నర్సుల దేవతలు,

అపురూపంగా దాచుకున్న కిడ్డీ బ్యాంకులను
వాన బాధితుల కోసం పగలగొట్టి
చిల్లర పైసలతో సహా సహాయ నిధికి ఇచ్చేసిన చిన్నారి దేవుళ్ళు,

కుప్పించి దూకిన భీభత్స వరద
సర్వస్వాన్ని మింగి పోతే
మీకు మేమున్నామంటూ
ఆపన్న హస్తాలతో ఆలింగనం చేసుకున్న దాతల దేవుళ్ళు,
దర్జాగా అధికారం వెలగబెట్టకుండా
రోజుల తరబడి ఇళ్లకు పోకుండా
బియ్యం బస్తాలు మోసిన సివిల్ సర్వీసు దేవుళ్ళు,

ఇళ్ళల్లోకి చొరబడి
కాపురం పెట్టేసిన బురద కుప్పల్ని
నెత్తిపై ఆవలికి మోసిన స్వచ్ఛంద సేవక దేవుళ్ళు,

ప్రవాహ విషాదాన్ని పంచుకోడానికి
కన్నీటి ముద్దలై కరిగిన ప్రపంచ మానవ దేవుళ్ళు,

అన్నార్థుల ఆకలి బొరియలను పూడ్చడానికి
వంట పాత్రలకు అక్షయ మంత్రాలు నేర్పిన వంటక దేవుళ్ళు,

వీపులను మెట్లుగా వంచుకున్న వాళ్ళు,
చేతులను ఊయల్లుగా చేసుకున్న వాళ్ళు,
భుజాలను అంబులెన్సుగా మార్చుకున్న వాళ్ళు,
ఎక్కడ చూసినా దేవుళ్ళే దేవుళ్ళు
అవును! ఇది దేవతలు దిగబడ్డ దేశమే ! ◆

---

## జనరంజక కవి పురస్కార ఫలితాలు

"జన రంజక కవి ప్రతిభా పురస్కారాలు" కోసం రావి రంగారావు సాహిత్య పీఠం ప్రకటనకు స్పందించి కవులు 186 కవిత్వ గ్రంథాలు పంపించారని రావి రంగారావు సాహిత్య పీఠం కన్వీనర్ నర్రా ప్రభావతి ఒక ప్రకటనలో తెలిపారు. అందులో నాలుగు గ్రంథాలను "జన రంజక కవి ప్రతిభా పురస్కారాలు" కోసం ఎంపిక చేయటం జరిగిందని వివరాలు తెలియజేశారు. 1. "మట్టి రంగు బొమ్మలు"(వచన కవితలు)- సిరికి స్వామినాయుడు (పార్వతీపురం, విజయనగరం జిల్లా), 2. "నల్ల చామంతి" (వచన కవితలు) -చిత్తలూరి సత్యనారాయణ (అడ్డ గూడూరు, యాదగిరి భువనగిరి జిల్లా), 3. "సవ్వడి" (గజళ్ళు) - శ్రీమతి భైరి ఇందిర (ఇల్లందు, భద్రాద్రి కొత్తగూడెం జిల్లా), 4. "మా ఇంటి దేవతలు" (బాల గేయాలు) - బెలగాం భీమేశ్వరరావు (పార్వతీపురం, విజయనగరం జిల్లా). గుంటూరు బృందావన్ గార్డెన్స్ శ్రీవెంకటేశ్వరస్వామి దేవాలయ ప్రాంగణం అన్నమయ్య కళావేదిక మీద ఫిబ్రవరి 11 సోమవారం సాయంత్రం 6 గం.కు జరిగే సభలో ఈ పుస్తకాలు రాసిన కవులకు ఒక్కొక్కరికి 2000 రూ. నగదుతో, శాలువాతో, జ్ఞాపికతో పురస్కార ప్రదానం జరుగుతుందని ఆ ప్రకటనలో తెలిపారు. ◆

## ప్రపంచీకరణ - సాహిత్యంపై సమాలోచన




ఆధునిక సాహిత్యం, రాజకీయాలపై ప్రపంచీకరణ ప్రభావం పెద్ద స్థాయిలో ఉందని ప్రముఖ సాహితీవేత్త, రాజకీయ విశ్లేషకులు తెలకపల్లి రవి అన్నారు. విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ ఆధ్వర్యంలో నగరంలోని స్వరాజ్యమైదాన్‌లో 30వ పుస్తక మహోత్సవ్‌లో సాహిత్యం - ప్రపంచీకరణ ప్రభావం అనే అంశంపై సమాలోచన కార్యక్రమం జనవరి 9న జరిగింది. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రపంచీకరణ సంస్కృతి అంటే క్రికెట్, సినిమా, క్రిమినలైజేషన్, సెలబ్రిటీ, కార్పొరేట్ సెక్టార్ మాత్రమే కాదన్నారు. సామాన్యులకు కూడా అన్ని అవకాశాలు అందే విధంగా చూడాల్సిన అవసరం ఉందని తెలిపారు. ప్రపంచీకరణ ప్రభావం వల్ల మనిషి తనని తాను అమ్ముకుంటూ ఒక వస్తువును కొనుగోలు చేసే స్థితిలో నేడు ఉన్నారన్నారు. ప్రపంచీకరణ ప్రభావం సాహిత్యంతో పాటు అన్ని రంగాలపై కూడా పడిందన్నారు. మతాన్ని కూడా రాజకీయ వస్తువుగా, మార్కెటింగ్ సాధనంగా మార్చివేశారన్నారు. ఇటీవల తెలుగులో వచ్చిన బాహుబలి సినిమా ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందిందని, ఒకరిద్దరి గురించి మాత్రమే చూపించారని, ప్రజాకోణంలో ప్రశ్నించేతత్వాన్ని చూపించలేకపోయారని అన్నారు. సీనియర్ పాత్రికేయులు డాక్టర్ ఘంటా విజయకుమార్ మాట్లాడుతూ అక్షరం జాగృతి చేసేలా లేదని, సాహిత్యం, అక్షరం రెండూ అమ్ముడుపోయాయని ఆందోళన వ్యక్తం చేశారు. అప్పు చేసి దర్జా చేయడం అనే సంస్కృతి నేడు వచ్చిందని, దీని నుండి మారాలన్నారు. కవి బంగార్రాజు కంఠ మాట్లాడుతూ ప్రజలను జాగృతి చేసే రచనలు తక్కువగా వస్తున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమానికి నవ్యాంధ్ర రచయితల సంఘం అధ్యక్షులు బిక్కి కృష్ణ అధ్యక్షత వహించగా ప్రముఖ మానసిక వైద్య నిపుణులు డాక్టర్ ఇండ్ల రామసుబ్బారెడ్డి, ప్రముఖ రచయిత పి.చంద్రశేఖర్ ఆజాద్, నవ్యాంధ్ర రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి కలిమిశ్రీ, రచయిత శ్రీరామకవచం సాగర్ తదితరులు పాల్గొన్నారు. ♦

## కందుకూరి శతవర్ధంతి సభ



విజయవాడ 30వ పుస్తక ప్రదర్శన ప్రాంగణంలోని యద్దనపూడి సులోచనారాణి వేదికపై సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జనవరి 5న కందుకూరి శతవర్ధంతి సభ జరిగింది. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ అధ్యక్షతన జరిగిన ఈ సభలో సుప్రీంకోర్టు విశ్రాంత న్యాయమూర్తి జాస్తి చలమేశ్వర్, శాసనమండలి సభ్యులు విఠపు బాలసుబ్రహ్మణ్యం, రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, కనుపర్తి విజయబక్ష్, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ తదితరులు పాల్గొన్నారు. ముఖ్యఅతిథి జాస్తి చలమేశ్వర్ మాట్లాడుతూ గత ఏభై ఏళ్ళుగా దేశంలో కందుకూరి, గురజాడలాగా ప్రజల్ని ఉత్తేజపరిచే వాళ్ళు కనపడట్లేదని అన్నారు. ఈ రోజు దేశం గురించి, సమాజం గురించి మాట్లాడేవాళ్ళు లేకుండా పోయారని ఆవేదన వ్యక్తం చేశారు. స్వాతంత్ర్యానంతరం నేడు దేశాన్ని పట్టించుకోవలిసిన అవసరం అత్యంత తీవ్రంగా ఉందని అన్నారు. శాసనమండలి సభ్యులు విఠపు బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ గోదావరి వంతెనకు కందుకూరి పేరు పెట్టాలని ఉపాధ్యాయ సంఘాలు తీర్మానం చేసి ప్రభుత్వాన్ని కోరాయని, కానీ ప్రభుత్వం పట్టించుకోలేదని, దీన్నిబట్టి కందుకూరి భావాల వ్యాప్తికి ప్రభుత్వాలు చిత్తశుద్ధితో కృషిచేస్తాయని భావించలేమని అన్నారు. కందుకూరి రచనలు ప్రజలందరికీ చేరాలే ప్రభుత్వం కృషిచేసేలా ఒత్తిడి తీసుకురావలసిన బాధ్యత రచయితలు, మేధావులపై ఉందని అన్నారు. కందుకూరి సంఘసంస్కరణ ఉద్యమాల గురించి కనుపర్తి విజయబక్ష్, కందుకూరి సాహిత్య కృషిపై రాచపాళెం సమగ్ర ప్రసంగం చేశారు. ♦

## 'ఏడవ రుతువు' కవితాసంపుటి ఆవిష్కరణ



విజయవాడలో ఎం.బి. విజ్ఞానకేంద్రంలో జనవరి 19న కవయిత్రి వైష్ణవిశ్రీ కవితా సంపుటి 'ఏడవ రుతువు ఆవిష్కరణ సభ జరిగింది. సాహితీస్రవంతి అమరావతి కమిటీ ఆధ్వర్యంలో జరిగిన ఈ సభకు శాంతిశ్రీ అధ్యక్షత వహించారు. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఆయన మాట్లాడుతూ వైష్ణవిశ్రీ కవిత్వం సామాజిక దృష్టిని కలిగి వుంటుందని అన్నారు. ఆవేదన కలిగించిన సామాజిక సమస్యల్ని కవిత్వంగా మలిచారని అన్నారు. నేడు సమాజం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలపై వైష్ణవిశ్రీ తన కవితల ద్వారా స్పందించారన్నారు. తొలిప్రతిని వైష్ణవిశ్రీ మాతృమూర్తి మోతి గారికి వొరప్రసాద్ అందించారు. పుస్తక సమీక్ష చేసిన ప్రముఖ కవయిత్రి మందరపు హైమవతి మాట్లాడుతూ తొలికవితా సంపుటితోనే మంచి కవయిత్రిగా వైష్ణవిశ్రీని గుర్తించవచ్చని అన్నారు. ఏడవ రుతువు పేరుతో ఈ సంపుటిలో కవిత లేదని, అయితే ప్రకృతిలో ఆరు రుతువులతో సమానంగా స్త్రీని ఏడో రుతువుగా వైష్ణవిశ్రీ ఊహించడం అభినందించదగిన విషయం అన్నారు. ఈనాటి సమాజం ఎదుర్కొంటున్న పలు అంశాలను కవితా వస్తువులగా తీసుకుని కవిత్వాన్ని పండించారని, ముందు ముందు మరింత శక్తివంతమైన కవిత్వం రాయడానికి ఈ ఏడవ రుతువు కవితా సంపుటి ప్రాతిపదిక అవుతుందని హైమవతి అన్నారు. సభలో సత్యాజీ, అనిల్‌డ్యాని ప్రసంగించారు. చివరగా కవయిత్రి వైష్ణవిశ్రీ స్పందిస్తూ చిన్నప్పటి నుండీ ప్రశ్నించే మనస్తత్వం తనదని తెలిపారు. ఆ క్రమంలోనే కవయిత్రిగా మారానని అన్నారు. సమాజంలోని కులం, మతం, వివక్ష వంటివి తనని అసహనానికి గురిచేస్తాయని అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. సత్యరంజన్, అమరావతి సాహితీస్రవంతి కమిటీ బాధ్యులు డా॥ రావెళ్ళ, గంగాధర్ వీర్ల, గుండు నారాయణ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ◆

**స్పందన**

## రాసింది శ్రీశ్రీ కాదు, దాశరథి

'సాహిత్య ప్రస్థానం' మాస పత్రిక జనవరి,2019 సంచికలో 'ఘంట సాల గొంతులో శ్రీశ్రీ పాట' శీర్షికన అమర గాయకుడు ఘంటసాల పాడిన శ్రీశ్రీ పాటలు నేటి పాఠకులకు అందించిన రచయిత సక్కిరి భాస్కర్‌గారికి అభినందనలు. ఆ వ్యాసంలో చోటుచేసుకున్న కొన్ని సవరణలు, వివరణలు (ముఖ్యంగా శ్రీశ్రీకి సంబంధించి) పాఠకుల కోసం..

"శ్రీశ్రీ సామాజిక ప్రయోజనం గల పాట లతో పాటు అన్ని రకాల పాటలనూ రాశారు. ఇంకా చెప్పాలంటే అవసరమైన చోట వేరే రచయితల కంటే ఉదారంగా తన 'ముద్ర' నుండి తప్పుకుని మరీ రాశారు. అలా రాసిన పాటలే ప్రేమ పాటలు. 1.'నీలోన నన్నే నిలిపేవు నేడే...( గుడి గంటలు). 2. ఓ.. న జీవ శిల్ప సుందరి.. ఎవరివో నీవెవరివో(పునర్జన్మ). 3.ఆకాశవీధిలో అందాల జాబిలి (మాంగల్య బలం). 4.ఎవ్వరి కోసం ఈ మందహాసం (నర్తనశాల) 5. ఎందుకో సిగ్గెందుకో (సిరి సంపదలు). 6. జోరుగా హుషారుగా (భార్యాభర్తలు) లాంటి ప్రేమ గీతాలు రాశారు" అంటూ అమర గామరకుడు ఘంటసాల గానం చేసి ప్రాణం పోసిన శ్రీశ్రీ అద్భుత గీతాలను ఉదహరించారు.

ఇందులో వ్యాస రచయిత ఉదహరించిన 'నీలోన నన్నే నిలిపేవు నేడే' (గుడి గంటలు) గీతం శ్రీశ్రీ రాసిన గీతం కాదు. ఈ గీత రచ యిత దాశరథి. (పూర్తిపేరు దాశరథి కృష్ణమాచార్య. ప్రముఖ చలనచిత్ర రచయిత. 'అగ్ని ధార, రుద్రవీణ'లాంటి విప్లవ చైతన్య కావ్యకర్త. తెలంగాణ రచయిత)

'గుడి గంటలు' చిత్రానికి అసలు శ్రీశ్రీ పని చేయలేదు. ఈ చిత్రంలోని ఆరు పాటలను 'దాశరథి, సి.నారె, ఆత్రేయ, ఆరుద్ర, అనిసెట్టి నార్ల చిరంజీవి' రాశారు. మాటలు ముళ్లపూడి వెంకటరమణ. ఘంటసాల ఈ చిత్ర సంగీత దర్శకుడు. దర్శకుడు వి. మధుసూదనరావు దర్శకత్వం వహించిన ఈ చిత్రాన్ని రాజలక్ష్మి ప్రొడక్షన్స్ బేనర్‌పై సుందర్‌లాల్ నహతా, డూండీ నిర్మించారు.

అదే వ్యాసంలో మరో సవరణ: 'ఈ హరికథను కరుణశ్రీ రాసిన 'హృద యశ్రీ' ఉన్న కావ్యం' 'హృదయశ్రీ' కాదు ఉదయశ్రీ. కరుణశ్రీ కావ్యాలు ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ.'

వివరణ: 'హృదయశ్రీ' కరుణశ్రీ కావ్యం కాదు. ప్రసిద్ధులు కరుణశ్రీ(జంధ్యాల పాపయ్య శాస్త్రి)గారి కావ్యాలు 'ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ'.

**- సింగంపల్లి అశోక్‌కుమార్**
**9246277375**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

DDU-GKY
Deen Dayal Upadhyaya Grameen Kaushalya Yojana
Empowering India • Powering the World



# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ప్రతి గ్రామీణ పేద కుటుంబంలో అర్హులైన అందరికీ ఉద్యోగం కల్పించే లక్ష్యం.



ప్రతి ఒక్కరూ నూతన నైపుణ్యాలలో ప్రావీణ్యత సాధించడమే 21వ శతాబ్దపు ముఖ్య అవసరం

## మన రాష్ట్రాన్ని నైపుణ్యాంధ్రప్రదేశ్‌గా మార్చడమే లక్ష్యం

- **DDU-GKY** - గ్రామీణ ప్రాంతాలలోని 18 సం|| ల నుండి 35 సం|| ల వయస్సు గల నిరుద్యోగ యువతీ, యువకులకు వారి విద్యార్హత మరియు ఆసక్తి ఆధారంగా 90 రోజుల ఉచిత నైపుణ్య శిక్షణ మరియు ఉద్యోగకల్పన.
- **LIFE** - MGNREGA జాబ్ కార్డుదారుల కుటుంబాలలోని నిరుద్యోగ యువతీ యువకులకు ఉచిత నైపుణ్య శిక్షణ మరియు ఉద్యోగ కల్పన.
- **SAGARMALA** - సముద్ర తీరప్రాంత జిల్లాలలోని యువత కోసం ఓడ రేవులు మరియు సముద్రయాన రంగాలలో ఉద్యోగ ఆధారిత నైపుణ్య శిక్షణ మరియు ఉద్యోగ కల్పన.
- **RETAIL SKILLING** - వివిధ రిటైల్ వ్యాపార సంస్థలకు కావలసిన విధంగా నిరుద్యోగ యువతీ యువకులకు ప్రత్యేక శిక్షణ మరియు తప్పనిసరిగా ఉద్యోగ కల్పన.
- **DIRECT PLACEMENTS** - 18 నుంచి 35 సం|| ల వయస్సు గల నిరుద్యోగ యువతీ యువకులకు ప్రాంతాల వారీగా ఉద్యోగ మేళాల నిర్వహణ.
- **AGRICULTURE ALLIED** - వ్యవసాయ నైపుణ్య శిక్షణా సంస్థల సహకారంతో రైతులు మరియు వ్యవసాయ కూలీల కోసం ప్రత్యేక సాంకేతిక శిక్షణ.

67

## ఆంధ్రప్రదేశ్ నైపుణ్య శిక్షణ, ఉద్యోగ కల్పన మరియు వ్యాపార శిక్షణ సంస్థ (SEEDAP)

వివరాలకు www.seedap.in లో నమోదు కాగలరు లేదా మీ జిల్లా DRDA ప్రాజెక్ట్ డైరెక్టర్ గారి ఆఫీసు నందు సంప్రదించగలరు.

SAHITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 29.01.2019







If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059

| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A194 |
| పుస్తకం పేరు | Cutha NO |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యలివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |